# సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# జాతీయ నాయకులు
# వీర నారీమణులు

రచన

భూక్యా చిన వెంకటేశ్వర్లు
చీఫ్ ఎడిటర్ : "నడక" దిన పత్రిక

ప్రచురణ
ఆంధ్ర రాష్ట్ర గిరిజన జాతుల సంక్షేమ సంఘం
హైదరాబాద్ – 500 659

# విషయ సూచిక

# వైశ్యకులోద్భవి, ప్రథమ సత్యాగ్రహి శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరి చరిత్ర

దేవీ సప్తశతి, భాస్కరాచార్య విరచితమైన 'వాసవి మహాత్యం' అను పురాణం లోనూ శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి చరిత్ర విపులంగా చెప్పబడింది.

శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరి అగ్ని పునీత. వైశ్యకులంలో పుట్టిన కారణ జన్మరాలు. శ్రీ వాసవి పుట్టుకతో చరిత్రలో వైశ్యకులం చిరయశస్సు పొందింది. వైశ్యుల ఆత్మగౌరవం, సదాచార సాంప్రదాయాలు లోకానికి చాట బడినవి. వాసవి పుట్టి పెరిగిన పెనుగొండ యీనాటికీ గొప్ప దివ్యక్షేత్రంగా విరాజిల్లుతోంది.

పశ్చిమగోదావరి జిల్లా తణుకు రైల్వేస్టేషన్‌కు 20 కిలోమీటర్ల దూరంలోనూ, పాలకొల్లుకి 18, భీమవరానికి 48 కిలోమీటర్ల దూరంలోనూ పెనుగొండ క్షేత్రం నెలకొని వుంది.

క్రీ.శ. 8వ శతాబ్దం నాటికే పెనుగొండ గొప్ప పట్టణంగానూ, వైశ్యులచే పాలింపబడుతున్న సామంత రాజ్యంగా వుండేది.

**స్థల పురాణము :**

వేద యుగమున వైశ్యులు విశులు, ఆర్యులు, గోమథులు తదితర పేర్లతో పిలువబడినట్లు వైశ్యపురాణం వల్ల తెలుస్తోంది. వీరి వృత్తి గోసంరక్షణ, వాణిజ్యం, అప్పట్లో వైశ్యులు 714 గోత్రాల వారిగా వుండేడివారు.

పూర్వకాలంలో సమాధియను వైశ్యకులోత్తముడు తపస్సు చేసుకొనుటకు అరణ్యానికి వెళ్లాడు. అక్కడ ఆయనకు సుమేధుడను మహాముని తటస్థపడి జీవన సార్థకతకు యోగమాయా దేవిని గురించి తపస్సు చేయమని బోధిస్తాడు. సుమేధుని వాక్యములు విని సమాధి సంతోషించి, ఒక పుణ్య నదీతీరంలో దేవిని గురించి తపస్సు చేయగా, దేవి ప్రత్యక్షమై వరం కోరుకొనుమనగా "నా బంధువులకు, స్వపరివారమునకు మోక్షం ప్రసాదింపు మని కోరినాడు. మరొక జన్మలో నీ కోరిక తీరగలదని దేవి వరమిచ్చినట్లు దేవీ సప్తశతి వల్ల తెలుస్తోంది.

ఆ సమాధియే కలియుగమున పెనుగొండ నగరంలో కుసుమ శ్రేష్ఠిగ జన్మించినట్లు వైశ్యపురాణంలో చెప్పబడింది. అప్పట్లో పెనుగొండను పరిపాలించే కల్హారుడను వైశ్యప్రభువు కుమారుడిగా కుసుమ శ్రేష్ఠి జన్మించి పెరిగి పెద్దవాడయ్యాడు.

తండ్రి తదనంతరం పెనుగొండ పాలకుడైనాడు.

పంచక్రోశ పట్టణమని పెనుగొండకు పేరుండేది. దాని చుట్టు ప్రక్కల ప్రాంతాలలో గోదావరీ పరీవాహక ప్రాంతాలలో రవద్యము, పిఠాపురం, వీరనారాయణపురం, విశాలము, శివపురం, ఆచంట, కళింగం, పాంచాలం, పాలకుండం, నరసాపురం, ధనదపురం, ధర్మపురం, జననాధపురం, త్రిగుణం, భీమవరం, ఘంటసాము, పీఠికాపురం, నగరి అనుపేర్లతో 18 పట్టణములు వెలసివున్నాయి. పెనుగొండ యీ పట్టణములకు రాజధానిగా వుండేది. ఈ పట్టణాలన్నిటా కోటలు కట్టుకొని గోశాలలను సంరక్షించుకుంటూ, వర్తక, వాణిజ్యాలను నిర్వహించుకుంటూ 714 గోత్రాల వైశ్యులు నివసిస్తూ వుండేవారు.

కుసుమశ్రేష్టి అర్ధాంగి కుసుమాంబ. ఈ దంపతులకు ఎంత కాలానికి సంతానం కలుగనందున, కుసుమ శ్రేష్టి పుత్రకామేష్టి యజ్ఞం చేసాడు.

తదుపరి వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారం పునర్వసు నక్షత్రయుక్త లగ్నమున ఒక కుమార్తె, ఒక కుమారుడు కవలపిల్లలుగా కుసుమ శ్రేష్టి దంపతులకు జన్మించారు. వైశ్య కుల గురువైన భాస్కరాచార్యుడు వీరి జాతకములను పరిశీలించి, దీర్ఘంగా ఆలోచించి "పూర్వ జన్మలో యీ బాలిక వాసుదేవుని సోదరియైన యోగమాయ అనీ" కనుక బాలికకు వాసవి అని నామకరణం గావించెను. బాలుడు విరూపాక్షుని అంశతో జన్మించినందున విరూపాక్షుడనీ పేరిడినాడు.

శ్రీ వాసవి బాల్యం నుండీ విశిష్ట లక్షణములతో ఒప్పారుతూ వుండది. బంగారు శరీరచ్ఛాయ, మృదుభాషణము, సంస్కార గుణములతో వుట్టిపడేది. కుసుమశ్రేష్టి దంపతులు బిడ్డలను అల్లారు ముద్దుగా పెంచసాగారు.

విరూపాక్షుడు రణ విద్యలో మేటి. అప్పట్లో కొందరు బాలురు వ్యాపారాది వ్యవహారాల్లో ఆసక్తి లేకుండా, యుద్ధకోవిదులై, సైన్యంలో చేరి, దేశ రక్షణకు జీవితాన్ని అంకితం చేసుకొనేవారు. యిలాంటి వారికి "బాల నగరులు" అని పేరుండేది.

అలాగే కొందరు బాలికలు వారి ప్రవృత్తుల ననుసరించి, ఆజన్మ బ్రహ్మచారిణులుగా వుండి సంఘసేవకు అంకితమై, దైవారాధనలో, జగదాంబా సంసేవనలో వుండేవారు. వారిని "గౌరబాలికలు" అని పిలిచేవారు.

వాసవి గౌరబాలికగా వుంటూ పెరిగి పెద్దదైంది. సాంప్రదాయానుసారంగా, సమస్త శుభకార్యాలలోనూ, దేవాలయమునందలి పూజాదికార్యక్రమాల్లోనూ, నాటి వైశ్య కులాచారములకు అంకితమైన బాలనగరులు, గౌరబాలికలకు అగ్రతాంబూలమిచ్చి గౌరవిస్తూ వుండేది.

విరూపాక్షుడు పెనుగొండ సామంతరాజ్యానికి సైన్యాధ్యక్షుడిగా ఎన్నుకోబడినాడు. గౌరబాలిక అయిన వాసవి ఆజన్మ బ్రహ్మచారిణిగా వుండేందుకు నిశ్చయించుకొని సంఘసేవ, అహింస, సేవాభావం త్యాగం వంటి విశిష్ట లక్షణములను అనుసరిస్తూ, మానవులంతా యీ సద్గుణములను ఆచరించాలని బోధిస్తూ వుండేది.

అప్పట్లో రాజమహేంద్రవరం రాజధానిగా తూర్పు చాళుక్య ప్రభువులు తీరస్థ ఆంధ్ర దేశాన్నంతా తమ పలుకుబడి క్రింద పరిపాలిస్తూ వుండేవారు. ఆంధ్ర దేశంలోని చిన్న చిన్న సామంతరాజ్యాలన్నీ రాజమహేంద్రవరం చాళుక్య ప్రభువులకు లోబడివుండేవి. అలాగే పెనుగొండ రాజ్యంకూడా రాజమహేంద్రవరం సామ్రాజ్యం క్రింద సామంతరాజ్యంగా లోబడి వుండేది.

వేంగీ సామ్రాజ్యాన్ని కుబ్జవిష్ణువర్ధనుడు స్థాపించాడు. వేంగి సామ్రాజ్యానికి తొలుత వేంగిపట్టణం రాజధానిగా వుండేది. నేటి ఏలూరుకు సమీపంలోని పెదవేగి, చినవేగి అని పిలువబడే కుగ్రామాలే, ఆనాటి వేంగీ సామ్రాజ్యరాజధానిగా విరాజిల్లాయి.

తదుపరి కొంతకాలానికి మొదటి అమ్మరాజ విష్ణువర్ధనుని కాలంలో గోదావరి నది ఒడ్డున రాజమహేంద్రవరం నిర్మించబడి చాళుక్య రాజధానిగా విలసిల్లింది. రాజమహేంద్ర వరానికి, పెనుగొండ 54 కిలోమీటర్ల దూరంలో వుంటుంది.

రాజమహేంద్ర వరం రాజధానిగా వేంగీ సామ్రాజ్యాన్ని పాలించిన తూర్పు చాళుక్య రాజులందరూ తమ వంశానికి మూలపురుషుడైన విష్ణువర్ధనుని పేరులోనే పిలువబడినారు. విష్ణువర్ధన నామం వారికి బిరుదుగా వుండేది.

"సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన మహారాజు......" అంటూ పరివార జనంతో కీర్తించబడుతూవుండేవారు.

కథా కాలానికి వేంగీ సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్న ప్రభువు మూడవ విష్ణువర్ధనుడు కావచ్చునని భావించబడుతోంది. క్రీ.శ. 1179 నాటి ద్రాక్షారామశాసనంలో ఈయన ప్రస్తావన ఉటంకించబడింది.

పెనుగొండ సామంతరాజ్యంలో వాసవి దివ్యగాథ చరిత్రకెక్కిన ఘట్టం మూడవ విష్ణువర్ధనుని కాలంనాటిదే. పరిశోధకులు కాల నిర్ణయాన్ని నిర్ధారించవలసి వుంది.

విష్ణువర్ధన మహారాజు రాజమహేంద్రవరాన్ని పరిపాలిస్తూ వుండగా. సామంత రాజ్యమైన పెనుగొండలో కుసుమ శ్రేష్ఠి పాలన సాగుతూ వుండేది.

రాజమహేంద్రవరం రాజధానిగా వున్న వేంగీ సామ్రాజ్యంలో కళింగం నుండి ధనదపురం వరకు నెల్లూరు, ధరణికోట, పొత్తపినాడు, వెలనాడు ప్రాంతాలన్నీ చేరి వుండేవి. వెలనాడు రాజధాని ధనపురం. నేటి రేపల్లె ప్రాంతం.

ఒకనాడు వేంగీ ప్రభువు విష్ణువర్ధన మహా రాజు దేశపర్యటన గావిస్తూ, సామంత రాజుల ఆతిధ్యాన్ని, గౌరవ మర్యాదల్ని అందుకుంటూ తమ యెడల సామంతులు చూపే భక్తి శ్రద్ధలకు సంతసిస్తూ, దారిలో పెనుగొండ పట్టణానికి విచ్చేసినాడు.

విష్ణువర్ధన మహారాజు తమ నగరానికి విచ్చేయడంతో, కుసుమశ్రేష్టి సాటి వైశ్య ప్రముఖులతో కలిసి రాజుకు ఎదురేగి, సకల రాజలాంఛనాలతో ఆడంబరంగా ఆహ్వానించి, తన సౌధంలో విడిది ఏర్పాటు చేసాడు. రాజుకు తగిన విధంగా స్వయంగా, తన కుటుంబ సభ్యులతో చక్కని విందు ఏర్పాటు చేసి సమాదరించాడు.

కుసుమ శ్రేష్టి యిచ్చిన అతిధి మర్యాదలకు విష్ణువర్ధనుడు సంతోషించాడు. విందు అనంతరం విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో యదాలాపంగా విష్ణువర్ధనుడు వాసవిని చూడడం తటస్థించింది. అతని కళ్లు చెదిరాయి. వాసవి అపురూప సౌందర్యం అతన్ని ఆశ్చర్యచకితుడ్ని చేసింది. అంతే కాదు. మోహ వివశుడ్ని గావించింది. ఉచితానుచితాలు చూడకుండా, రాజదర్పంతో వాసవి వివరాలను తన అంతరంగికుల ద్వారా తెలుసుకొని విష్ణువర్ధనుడు కుసుమశ్రేష్టిని పిలిచి "నీ కుమార్తె వాసవి తనను ఆకట్టుకున్నదనీ, తాను వాసవిని వివాహమాడదలిచాననీ, అందుకు తగిన ఏర్పాట్లు చేయవలసిందనీ" అని ఆదేశించాడు.

కుసుమ శ్రేష్టి క్షణకాలం నివ్వెరపోయి, విష్ణువర్ధనుని విపరీతమైన కోర్కెకు బాధపడ్డాడు. ఆర్య వైశ్యులమైన మాకు వర్ణాంతర వివాహములు సాంప్రదాయం కాదు మహారాజా" అని వినయంగా సమాధానం యిచ్చాడు.

"చక్రవర్తియైన మేము మీతో వియ్యం అందుకోవటానికి సిద్ధపడినాము. మా కోర్కెను తీర్చడం మీకు క్షేమకరం. మేము వాసవిని వివాహమాడుటకు దృఢనిశ్చయులమైనాము" అని విష్ణువర్ధనుడు ఆజ్ఞాపిస్తున్నట్టు పలికినాడు.

"కులానికి అంతటికీ సంబంధించిన కులాచారాన్ని వుల్లంఘించడం కులపెద్దనైన నాకు భావ్యంకాదు. పెనుగొండ పరిధిలోని 18 పట్టణములలో గల బంధువులను, పెద్దలను రావించి, సభగావించి, తమ యిష్టాన్ని గురించి చర్చించి, నిర్ణయం గైకొనుట నా బాధ్యత అయివున్నది. నాకు యీ అవకాశమును యిప్పించవలసిందిగా మనవి చేసుకొనుచున్నాను" అని అన్నాడు కుసుమశ్రేష్టి.

"మీకు వారం రోజులు గడువు యిస్తున్నాను. యీలోగా మీ వద్ద నుండి మా అభీష్టానికి అనువుగా సమాధానం రాని యెడల మిమ్మల్ని క్షమించే ప్రసక్తి వుండదు. అంతేకాదు యే నిర్ణయం మా కోర్కెకు వ్యతిరేకంగా వున్నప్పటికీ, వాసవిని ఎట్టి పరిస్థితుల్లోనూ మేము వివాహం చేసుకొనుట ఖాయం. కనుక

గడువులోగా మా కోర్కెను సమ్మతిస్తూ, వార్త పంపిన మీకు మంచిదగును. లేని యెడల మేము ముహూర్తమును నిర్ణయించి, సైన్యంతో వచ్చి వాసవిని ఎత్తుకొని పోయి, గాంధర్వ వివాహం చేసుకుంటాము" అని విష్ణుగుప్తుడు అధికార దర్పంతో పలికి, రాజమహేంద్రవరానికి తిరుగు ప్రయాణమై, తన సేనాని విక్రమకేసరిని పిలిచాడు.

"నాలుగు వేల సైన్యంతో నీవు యిచ్చటనే వుండి, వైశ్యుల కార్యకలాపములను కనిపెట్టి వుండవలసింది. వాసవిని వారు ఎచ్చటికైననూ తరలించి, మోసం చేయ ప్రయత్నించిన యెడల వాసవితో సహా, వీరందర్నీ బంధించి తెచ్చే అధికారాన్ని నీకు యిస్తున్నాను జాగ్రత్త" అంటూ ఆజ్ఞ యిచ్చి విష్ణువర్థన మహారాజు వెళ్లిపోయాడు.

ఈ ఆకస్మిక సంఘటనతో కుసుమశ్రేష్టి నివ్వెరపోయాడు. తనకులగురువైన భాస్కరాచార్యుని సలహా మేరకు 18 పట్టణములలోని వైశ్య ప్రముఖులందరికీ కబురు పంపాడు.

కుసుమాంబ, విరూపాక్షుడు, కుసుమశ్రేష్టితో సహా బంధు పరివారమంతా ఆందోళన చెందియుండగా, వాసవి ఆత్మనిగ్రహంతో, ప్రశాంత చిత్తంతో పరిపరి విధాల ఆలోచించసాగింది. కుటుంబ గౌరవం, కులాచారం ఆమె మనోవీధిలో సాక్షాత్కరించాయి.

కుసుమశ్రేష్టి ఆహ్వానం మేరకు 18 పట్టణములలోని వైశ్య నాయకులందరూ పెనుగొండ పట్టణానికి విచ్చేసారు. భాస్కరాచార్యుని అధ్యక్షతన సభ జరుపబడింది.

జరిగిన సమాచారాన్ని కుసుమశ్రేష్టి ప్రతినిధులకు వివరించి, కర్తవ్యం తెలుప వలసిందిగా కోరినాడు. సభలో తీవ్రంగా చర్చలు జరిగాయి.

"పవిత్రమైన కులాచార ధర్మాలను మనం కాపాడుకొనుట యుక్తం. మహారాజు కోర్కెను మనం పాటించరాదు. చక్రవర్తికి కన్యను యిచ్చి, ఆత్మగౌరవాన్ని పోగొట్టుకొనుట ఆత్మహత్యా సదృశ్యం అవుతుంది" అని కొందరు వాదించినారు.

" చక్రవర్తిని ఎదిరించుట సామాన్యంకాదు. చక్రవర్తి కోపానికి మనందరం బలి కావలసి వుంటుంది. వాసవిని చక్రవర్తికి యిచ్చి వివాహానికి అంగీకరించడమే మనకు క్షేమం" అని మరి కొందరు పలికారు.

"ఈ విషయంలో వాసవిని సభకు పిలిపించి, ఆమె అభిప్రాయమును తెలుసుకొనుట ముఖ్యం" అని కొందరు సూచించారు.

వాసవి సభకు వచ్చింది. ప్రశాంతంగా, గంభీరంగా సభికుల నుద్దేశించి "వివాహం నా వ్యక్తిగత విషయం. ఇందులో నన్నెవ్వరూ బలవంతపెట్టజాలరు.

చక్రవర్తితో వివాహమునకు నేను అంగీకరింపను" అని అన్నది.

"నీ నిర్ణయం వలన కులానికి చేటు గలుగుతుంది. చక్రవర్తి బలవంతుడు ఆయనతో వైరం వైశ్యకులానికి క్షేమం కాదు. అయినప్పటికీ మనలో చక్రవర్తిని అడ్డగించు వారెవ్వరు?" అంటూ సభికులలో కొందరు తీవ్రంగా అన్నారు.

అంతట విరూపాక్షుడు లేచి "పెద్దలారా! దుర్మార్గుడైన చక్రవర్తికి మనం భయపడనవసరంలేదు. అతని సైనిక శక్తి పెద్దదే కావచ్చును. కానీ బాలనగర సైన్యం చేవ చచ్చిలేదు. ధర్మం కొరకు జరిపే మన పోరాటానికి దైవబలం తోడుగా వుంటుంది. ఆ విధంగా మనం విష్ణువర్ధనుని సైన్యాన్ని ఓడించగలం. మనల్ని మనం కాపాడుకొనగలం" అని అన్నాడు.

వాసవి యిలా చెప్పసాగింది. "రాజమహేంద్రవరానికి మన రాజ్యం సామంత రాజ్యం. అది మహాసామ్రాజ్యం. దానిని ఎదిరించి పోరాడుట ఉచితం కాదు. నేను అందుకు సుముఖంగా లేను. యుద్ధం వలన మన కులానికి ఆపద, ప్రాణనష్టం ఎక్కువగా కలుగుతుంది. చక్రవర్తిని ఎదిరించి, చక్రవర్తి కోపానికి అందరం బలి అయ్యే దానికంటే, నేను అగ్ని ప్రవేశంగావించి, ఆత్మాహుతి చేసుకొనుటకు నిర్ణయించుకున్నాను. ఇందు వలన చక్రవర్తి కోర్కెతో పాటు, యుద్ధం కూడా తప్పిపోగలదు" అని తన దృఢ నిశ్చయాన్ని సభకు తెలియజెప్పింది.

"ఆత్మాహుతి చేసుకొనుట ద్వారా వైశ్యకులానికి ఏర్పడిన ఆపదను వాసవి రక్షించినట్లవుతుంది" అంటూ సభికులలో కొందరు ఆశ్చర్యాన్ని, మరికొందరు ఆనందాన్ని, ఆత్మవిశ్వాసాన్ని వ్యక్తపరిచారు.

"వాసవీ! నీ ఆత్మహుతి తర్వాత కూడా చక్రవర్తి తన ప్రతీకారాన్ని తీర్చుకోవాలనుకుంటే, అప్పుడేం చేయాలి?" అని కొందరు అడిగారు.

"ఆత్మాహుతి పరమపవిత్రమైన కార్యం వంటిది. మానవ బలాన్ని పశుబలం ఎదిరించలేదు. పరిష్కారాన్ని సాధించలేదు. సత్యాగ్రహం సాత్విక బలంతో కూడుకొన్నట్టిది. సత్యాగ్రహానికి పరాకాష్టయే ఆత్మాహుతి అవుతుంది. ఎంతటి పశు ప్రవృత్తి గల వానిని కూడా సత్యాగ్రహం జయించి తీరుతుంది. సత్యాగ్రహం వలన ఆత్మ విశ్వాసంతో పాటు ఆత్మ గౌరవం కూడా నిలబడుతుంది. నేడు మన ముందున్న సమస్య పరిష్కారానికి ఆత్మాహుతి ఒక్కటే శరణ్యం. నేను దృఢ నిశ్చయంతో సభముందు ప్రతిజ్ఞ చేస్తున్నాను"

వాసవి నిండు సభలో యిలా ప్రకటించగానే, వైశ్యకుల గురువైన భాస్కరాచార్యులు లేచి "వాసవి నిర్ణయం వైశ్య కులానికి చరిత్రలో గొప్ప పేరు ప్రతిష్టలను తెచ్చిపెట్టగలదు. ఇది దైవ నిర్ణయం. యీ సభను వాసవి నిర్ణయంతో

ఏకీభవించ వలసిందిగా కోరుతున్నాను" అని గంభీరంగా వాక్రుణించాడు.

సభలో కలకలం బయలు దేరింది. కుసుమ శ్రేష్టి లేచి తాను సైతం "ఆత్మాహుతి చేసుకుంటానని" ప్రకటించాడు.

కుసుమశ్రేష్టి నిర్ణయాన్ని బలపరచి తాము కూడా ఆత్మాహుతికి సిద్ధంగావున్నామని 102 గోత్రాల వారు ప్రకటించారు. మిగిలిన 612 గోత్రాలవారు "తాము ఆత్మాహుతికి సిద్ధంగా లేము. మా దారి మేము చూసుకోగలమని" చెప్పి, వెళ్లిపోయారు.

ఆ సమయంలో కులగురువు భాస్కరాచార్యులు 612 గోత్రాల వారిని ఆపి "ఈ క్లిష్టసమయంలో కుల నిర్ణయాన్ని కాదని వెళ్లిపోయిన వారికి కులంతో గల సంబంధ బాంధవ్యాలన్ని తెగిపోయినట్లేననీ, యిక్కడ యీ ఆత్మాహుతి నిర్ణయాన్ని బలపరిచి నిలిచిన వారే నిజమైన వైశ్యులుగా చరిత్రలో స్థానం సంపాదించుకోగలరనీ" ప్రకటించాడు.

అయినప్పటికీ 612 గోత్రాలవారు ఆత్మాహుతికి సిద్ధంగా లేమని, ఒకరి కోసం అందరూ బలికావడం యిష్టంలేదనీ, కులంకంటే ప్రాణం ముఖ్యం అని చెప్పి వెళ్లిపోయారు.

అంతట కుసుమశ్రేష్టి సభా నిర్ణయాన్ని ఒక దూత ద్వారా రాజమహేంద్రవరం పంపాడు.

ఆర్యవైశ్యులందరూ పట్టణంలోని నగరేశ్వరాలయ మంటపం వద్దకు చేరారు. ఆత్మ బలిదానయజ్ఞ కార్యక్రమము ఏర్పాటు చేయబడింది. ఆర్యవైశ్యులందరూ ఆత్మాహుతికి సిద్ధంకాగా, భాస్కరాచార్యులు వారివారి 102 గోత్రములకు చెందిన 102 మంది పుణ్య దంపతులు ఆత్మాహుతి చేసుకొనుట యుక్తంగా వుంటుందని చెప్పి, వారిచే వీర కంకణములను ధరింపజేసాడు.

వైశ్యులచే పంపబడిన దూతలు విష్ణువర్ధన మహారాజుకు వైశ్యుల నిర్ణయం తెలియజేసి "మహాప్రభూ! తాము మనస్సు మార్చుకొని ధర్మమును, ప్రజలను రక్షించండి" అని మొరపెట్టుకోగా విష్ణు వర్ధనుడు కోపించి దూతలను బంధించాడు.

ఈ లోగా తాను పెనుగొండలో నియమించిన నాలుగు వేల సైన్యము కూడా వైశ్యుల పక్షంలో జేరినట్లు కబురు విష్ణువర్ధనుడికి అందింది. చక్రవర్తి వెంటనే సైన్యాధక్ష్యుని పిలిపించి "సైన్యమును వెంటనిడుకొని నీవు పెనుగొండను ముట్టడించవలసింది. వైశ్యుల వుద్యమాన్ని ఆపండి. అడ్డువచ్చిన వారిని నిర్దాక్షిణ్యంగా నరికి వేయండి. అంతకు మునుపు నేను పెనుగొండలో అట్టిపెట్టిన సైన్యం వైశ్యుల పక్ష్యాన చేరి, మనకు వ్యతిరేకమైనట్లు తెలిసింది. నీవు ఆ సైన్యాన్ని,

సైన్యాధ్యక్షుడైన విక్రమకేసరిని బంధించి వుంచవలసింది. నేను మీ వెంటనే బయలుదేరి వస్తాను" అని పురమాయించి సకల సైన్యాన్ని పెనుగొండకు తరలించాడు.

పెనుగొండలో నగరేశ్వరాలయ ప్రాంగణాన భాస్కరాచార్యుని ఆదేశానుసారం 102 అగ్ని గుండాలు నిర్మింపచేయబడినవి. వీటి మధ్యలో వాసవి కన్యక కొరకు ప్రత్యేకంగా ఒక గుండం నిర్మింపబడింది. వాసవి, సమస్త వైశ్యులు నగర ప్రదక్షణం. గావించారు. పట్టణంలోని ప్రజలందరూ విషాదమనస్కులై యీశాంతి ఉద్యమాన్ని తిలకించడానికి మంటపం వద్దకు చేరారు. అపూర్వమైన తేజస్సుతో వాసవి మంటప ప్రాంగణాన ప్రశాంత వదనంతో నిలబడింది. వాసవి దేవతాకన్యకగా ప్రజల దృష్టిలో భావించబడింది.

చక్రవర్తి సైన్యం పెనుగొండను ముట్టడించగలదని తెలియరావడంతో అంతకు మునుపు విష్ణువర్ధనునిచే పట్టణంలో నియమించబడిన వీరకేసరి ఆధ్వర్యానగల సైన్యం వైశ్యుల పక్షాన నిలబడింది. వైశ్యుల న్యాయమైన నిర్ణయం సర్వత్రా ప్రజల ప్రశంసలకు పాత్రమైంది. పట్టణమంతా ఒక్కటిగా నిలిచి విష్ణువర్ధనుని సైన్యాన్ని ఎదిరించటానికి సిద్ధపడింది. బాలనగర సైన్యానికి విరూపాక్షుడు సైన్యాధ్యక్షుడిగా పట్టణాన్ని రక్షించడానికి సన్నద్ధుడైనాడు. వీరకేసరి నాయకత్వంలో తిరుగుబాటు సైన్యం, బాలనగర సైన్యానికి తోడుగా నిలిచి వుంది. పెనుగొండ చుట్టూ కోట గోడలమీద సైనికులు మొహరించి, విష్ణువర్ధనుని సైన్యం కదలికలను గమనిస్తూ వుండిపోయారు.

పట్టణ పౌరులు సైతం ప్రాణాలకు తెగించి, తమతమ పరిధిలో పట్టణ రక్షణలో నిమగ్నమైయున్నారు.

నగరేశ్వరాలయాంగణం అగ్ని గుండాలతో, ధూపదీప నైవేద్యములతో, భాస్కరాచార్యుని ఆధ్వర్యములో మంత్రోచ్చాటనలతో, దైవదత్తమైన ఆధ్యాత్మిక వాతావరణం గంభీరంగా, ప్రశాంతతను సంతరించుకొని వుంది.

102 గోత్రాల పుణ్య దంపతులు, కుసుమశ్రేష్ఠి దంపతులతోసహా తమ కొరకు నిర్ణయింపబడిన అగ్ని గుండములవద్ద ఆత్మాహుతికి సిద్ధంగా వున్నారు.

మధ్యలో ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన అగ్నిగుండం వద్ద వాసవి కన్యక మూర్తిభవించిన దివ్యతేజస్సుతో చేతులు ముకుళించుకొని శాంత వదనంతో నిలుచుని వుంది.

వైశ్యులు అగ్నిప్రవేశం చేయుటకు సిద్ధమైవున్న తరుణంలో, చక్రవర్తి సైన్యం పెనుగొండను ముట్టడించింది. ముందుగా వార్త తెలిసిన విక్రమ కేసరి తన

ఆధీనంలో వున్న నాల్గువేల సైన్యంతో చక్రవర్తి సైన్యాన్ని ఎదుర్కొన్నాడు. ధర్మవర్తనులైన వైశ్యులను ఆదుకొనడమే న్యాయమని విక్రమకేసరి ఎప్పుడో నిశ్చయించుకున్నందున, అందుకు తగిన విధంగా, ముందుగానే సమాయత్తమైనాడు. సదాచారాలతో, ధర్మనిష్టతో, సాత్త్విక జీవనం సాగిస్తున్న వైశ్యులపై కత్తిగట్టి, పశుబలంతో వాసవి కన్యను చెరబట్టదలచిన విష్ణువర్థనుని దుర్మార్గాన్ని, రాజు స్వంత సైన్యమే సహించలేకపోయింది. వైశ్య భటులైన వీరభట సైన్యం కూడా యుద్ధంలో పాల్గొన్నది.

నగరేశ్వరాలయం వద్ద అగ్ని గుండములు భగభగమండుతున్నాయి. వాసవి, కుసుమ శ్రేష్టి దంపతులతో సహా 102 గోత్రాల పుణ్య దంపతులు ఆత్మాహుతికి సిద్ధంగా వున్నారు. అక్కడకు జేరిన పట్టణ పౌరులలో కొందరు, వాసవిని ఉద్దేశించి " అమ్మా! చక్రవర్తి సైన్యములు పట్టణాన్ని చుట్టు ముట్టినవి. మీరు ఆత్మాహుతి చేసుకున్న వార్త చక్రవర్తి చెవిన బడితే, పెనుగొండ పట్టణాన్ని విష్ణువర్థనుడు సర్వనాశనం చేయుస్తే" అప్పుడు చేయవలసిదేమీ ?" అని అడిగారు.

అందుకు సమాధానం చెబుతూ "పెద్దలారా! నేను ఆత్మాహుతి చేసుకున్న వార్త విన్న తోడనే విష్ణువర్థనుని శిరస్సు వేయి వ్రక్కలవుతుంది. యుద్ధం నిలిచిపోతుంది. పెనుగొండ సురక్షితంగా వుంటుంది" అని శపించింది.

వెనువెంటనే వాసవి అగ్నిగుండంలో ప్రవేశించి, చేతులు ముకుళించి నిలుచున్నది. 102 గోత్రముల పుణ్య దంపతులు సైతం అగ్ని గుండాలలోకి దూకారు. ప్రజల హాహాకారాలు మిన్నుముట్టాయి. ఇంతలో ప్రళయభయంకరంగా ప్రణవఘోషతో ప్రపంచం దద్దరిల్లింది. ఒక్కక్షణకాలం అంతటా అంధకారం క్రమ్ముకొన్నది. పౌరులందరూ సంభ్రమాశ్చర్యాలతో వాసవి గుండం వైపు చూడసాగారు. గుండం నుండి ఒక మహాజ్యోతి ఆకసమునంటి పెరగసాగింది. ప్రతి ఒక్కరికీ ఆ పరంజ్యోతి తప్ప మరొకటి కన్పించడంలేదు. ఆ పరంజ్యోతి దశదిశల ఆక్రమించింది. సర్వవ్యాపకమైంది.

పెనుగొండకు సైన్య సమేతంగా బయలు దేరిన విష్ణువర్థన మహారాజుకు మార్గమధ్యంలోనే వాసవి అగ్ని ప్రవేశం చేసిన వార్త తెలుపబడింది. యీ వార్త విన్న వెనువెంటనే ఆశ్చర్యంగా విష్ణువర్థనుని శిరస్సు పగిలి వేయి వ్రక్కలైంది. అతని సైన్యములు చెల్లాచెదరమైనవి. విష్ణువర్థనుని మరణ వార్త క్షణంలో పెనుగొండ చేరింది. అక్కడ చక్రవర్తి సైన్యములు లొంగిపోయినవి.

వైశ్యుల ధర్మనిర్ణయాన్ని బలపరచి, వారికి అండగా వున్న విక్రమకేసరి సైన్యం విజయ దుందుభిని మ్రోగించింది. బాలనగర సైన్యం పట్టణం నలుమూలలా

విజయ బావుటాలను ఎగురవేసింది.

అయినప్పటికీ నగరేశ్వరాలయ మంటపం వద్దనున్న 102 అగ్ని గుండములు పవిత్ర త్యాగానికి చిహ్నంగా నిలిచివున్నాయి. పట్టణం అంతటా విషాద, విభ్రమం అలుముకొన్నది.

వైశ్యకులంలోని 714 గోత్రములలో 102 గోత్రముల వారే నిజమైన వైశ్యులుగా చరిత్రలో నిలిచినారు. మిగిలిన 612 గోత్రాల వారు కులాన్ని విడిచి పారిపోయారు - భ్రష్టులయ్యారు.

వాసవి కథ కలకాలం చరిత్రలో నిలిచి పోయింది. పెనుగొండ ప్రపంచంలోని వైశ్యకులానికే ఆరాధనీయస్థలంగా వాసికెక్కింది. వాసవితో పాటు, కుసుమశ్రేష్టి దంపతులు కూడా అగ్ని ప్రవేశం చేసినందున, యిక ఆకుటుంబంలో మిగిలివున్న విరూపాక్షుడే పెనుగొండ సామంత రాజ్యానికి పాలకుడిగా ఎన్నుకోబడినాడు. తిరిగి వైశ్యుల పరిపాలన, ప్రతిపత్తి పెనుగొండలో స్థిరపడినాయి.

వాసవి వైశ్యకులంలో జన్మించి వైశ్యకుల ధర్మమును నిలబడేందుకు, నిగ్గు తేలే దశలో తానే కారణమాత్రురాలైంది. సాత్త్విక దృక్పథంతో, సత్యాగ్రహం సాగించి, ఆత్మాహుతి చేసుకొంది, ధర్మయుద్ధంలో నూతన పద్ధతిని తొలి సారిగా ప్రపంచానికి అందించింది. పశుప్రవృత్తిని జయించి, దుర్మార్గులలో సైతం మానసిక పరివర్తనకు సత్యాగ్రహం దోహదం చేసింది. పశ్చాత్తాపాన్ని కలిగించి, శతృభావం సమసిపోయి, సామరస్య విధానం ఏర్పడడానికి దారి తీసింది. కత్తి వైర్యాన్ని సత్యాగ్రహం అనే అహింసా సిద్ధాంతంతో ఎదుర్కొన వచ్చుననీ, కత్తికంటే, సత్యాగ్రహం పదునైన ఆయుధం అనీ తొలిసారిగా వాసవి ప్రపంచానికి చాటింది. త్యాగం కంటే మించిన గుణం యింకేమీ లేదని, త్యాగభావమే సర్వోత్కృష్టమైనదనీ తెలియ జెప్పింది.

ప్రధమ సత్యాగ్రహి, త్యాగశీలి, వాసవి ఆత్మాహుతి అనంతరం వైశ్యకుల దేవతగా వెలసింది. "శ్రీ వాసవీకన్యాకా పరమేశ్వరి" పేరిట తరతరాలుగా పూజలందుకుంటోంది. నాటినుండి నేటి వరకూ దేశ వ్యాప్తంగా, గ్రామగ్రామాన, వాడవాడలా శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరి దేవాలయాలు వెలసి, వైశ్యకులాచార సంప్రదాయాలను పుణికి పుచ్చుకుంటూ, నిత్య ధూపదీప నైవేధ్యాలతో అలరారుతున్నాయి.

వైశ్యకులాచార, సాంప్రదాయంను పరిరక్షించడానికి తన జీవితాన్నే బలిదానం చేసిన ఆదర్శప్రాయురాలైన శ్రీవాసవి కన్యకాపరమేశ్వరి భావితరాలకు స్ఫూర్తినిచ్చి, వైశ్య జాతిని కార్యోన్ముక్తులను చేసింది. ఆమె చరిత్ర కధలుగా, గాధలుగా

కీర్తింపబడింది. శ్రీ వాసవి జీవిత ఘట్టాలు చారిత్రక సంఘటనలుగా నేటికీ నిలిచి చారిత్రక వారసత్వంగా ఆచరించబడుతూ వున్నాయి.

విష్ణువర్ధన మహారాజు పెనుగొండ నగరాన్ని విడిచి వెళ్లినప్పుడు శ్రీవాసవీ కన్యకను ఎక్కడికైనా తీసుకుపోతారేమోనని కాపలా కాయడానికి తన పరివారాన్ని నాలుగు వేల సైన్యాన్ని గూఢచారుల్ని పెనుగొండ నగరం చుట్టు కాపలా వుంచాడు. ఆ సైన్యం శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరి ఘట్టంలోనూ, ధర్మ కంకణ ధారణ ఘట్టంలోనూ పాల్గొని అమ్మవారి భక్తులై పోయారు. విష్ణువర్ధన మహారాజు కొలువు మానివేశారు. అగ్ని ప్రవేశానంతరం ఉత్తేజితులై బాలనగరులతో కలిసి విష్ణువర్ధనుని సైన్యంతో యుద్ధం చేసినారు. ఈ నాటికినీ ఆ సంతతి వారు శ్రీ కన్యకా పరమేశ్వరి తల్లినే కొలుస్తున్నారు. వీరే వీరముష్టులుగా పిలువబడుతున్నారు. ఆనాడు యుద్ధంలో వీర మరణం పొందిన వారి శిరస్సులు వారు నిర్మించి, ఉరేగించే ప్రభల ముందు కనిపిస్తాయి. యుద్ధానికి సంబంధించిన ఆయుధాలన్నీ ప్రభల మీద ప్రదర్శిస్తారు. ఆనాడు వారి ధన ప్రాణాలను సంఘానికి అర్పించినవారు, కనుకనే నేటికినీ శుభకార్యాలలో ఆసంతతివారిని వైశ్యులు పోషిస్తూ సత్కరిస్తూ వుంటారు.

అంతే గాకుండా వారిలో కొంతమంది వాసవి అగ్ని ప్రవేశానంతరం బాలనగరులతో కలిసి కాశీపట్టణానికి వెళ్లారు. గంగానదిలో బాలనగరులు పితృకర్మలను చేసిన పిమ్మట వారితో కలిసి శివలింగాలను గంగాజలాన్ని పెనుగొండ పట్టణం వరకు మోసుకుని వచ్చారు. గంగాజలాన్ని కావిళ్లతో తెచ్చిన వారిని గంగకావిళ్ల వారనీ, నగరంలో శివలింగ ప్రతిష్టల్ని చేయించిన వారిని మైలారులనీ వ్యవహరిస్తున్నారు. మైలారులు, గంగకావిళ్లవారు వీరముష్టులు సర్వదా శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరిని కొలుస్తూ వున్నారు.

చరిత్రలో శ్రీవాసవి కన్యకా పరమేశ్వరి గాధ అజరామరంగా నిలిచివుంది. అపూర్వమైన వాసవి త్యాగం ఎనలేని ఖ్యాతిని తెచ్చిపెట్టింది. వైశ్యకులదేవతగా నిలిచిపోయింది.

ఆహింస, సత్యాగ్రహం, త్యాగం, ఆత్మాహుతి వంటి సాత్త్విక ప్రయోగాలను భావితరాలకు అందించిన శ్రీవాసవి కన్య చరిత్ర ప్రతి ఒక్కరికీ ఆదర్శప్రాయంగా, అనుసరణీయంగా నిలిచివుంది.

వైశ్యకులోద్భవి శ్రీ వాసవిగాధ వల్ల వైశ్యకులానికే వన్నె చేకూరింది. వైభవోపేతమైన ప్రతిష్ట సంతరించుకొన్నది.

# నాయకురాలు నాగమ్మ

వీరులకు నిలయం పలనాడు
పోరాటాలకు పోతుగడ్డ మా పలనాడు ...

ఉత్తర భారతదేశంలో "కురుక్షేత్ర" వద్ద జరిగిన మహాభారత యుద్ధానికీ, పలనాటి యుద్ధానికీ పోలికలు వున్నాయి. మహాభారత యుద్ధానికి కేవలం దాయాదుల మధ్య రాజ్యాన్ని పంచుకోవడంలో ఏర్పడిన వైరం ప్రధానకారణం, కాగా పలనాటి యుద్ధం వెనుక క్రీ.శ. 10,11 శతాబ్దాల నాటి చారిత్రక పరిస్థితులు, శైవ, వైష్ణవ మత ఘర్షణలు, సాంఘిక స్థితిగతులు ప్రేరణగా వున్నాయి.

అప్పటి పలనాడు శ్రీనాధ మహాకవి వర్ణలలో యిలా వుండేది.

" సజ్జ జొన్న కూళ్లు
సర్పంబులును, తేళ్లు
నాగులేటి నీళ్లు
నాపరాళ్లు ....." అంతేకాదు

స్వర్గీయ పులుసుల శివయ్యగారు ఎలుగెత్తిన పాట పలనాటి స్వరూపాన్ని కళ్లకు కట్టినట్లు చూపెడుతుంది.

"వర్ణ ధర్మాలన్న ఉక్కుచట్రము పగిలి
మాల కన్నమదాసు మనసైన సుతుడిగా
వీర వైష్ణవ మొచ్చెరా, పలనాట
బ్రహ్మన్న కలిగీతలో .... !
మగువ నాగమ్మతో మాయ యుద్ధము వచ్చె
మగువ మాంచాల తా మగని రణమునకంపె
వీర వనితలు పుట్టిరీ, పలనాట
శౌర్య ముగ్గులు పెట్టిరీ ..... !
బాలచంద్రుని కత్తి పదును మెరుపులు మెరిసి
తెరల కారెంపూడి ధర్మ రణరంగాన
వీర రక్తం చిందెరా, పలనాట
నాగులేరై పారెరా ...... !
బాలచంద్రుని కదన కౌశలము కధలల్లి
శ్రీనాధ కవిరాజు చంద్రవంకకు చెప్ప

ఎద కరిగి ప్రవహించెరా, పలనాట
ఎత్తిపోతల దూకెరా . . . . . !

పలనాటి చరిత్రకు యీ గీతం అద్దం పడుతుంది.

వీర రక్తపుధార
వార పోసిన సీమ . . . .
క్రీ.శ 1130

హైహయ వంశానికి చెందిన అనుగురాజు బాలమాచాపురి నుండి వచ్చి, గురజాల రాజధానిగా పలనాటిని పరిపాలించాడు. ఈతడు క్రీ. శ. 1147 వరకు పరిపాలించాడు. అనుగురాజుకు మైలమాదేవి, వీరవిద్యలదేవి, వితలదేవి, భూరమాదేవులని నలుగురు భార్యలు వున్నారు. మొదటి భార్య మైలమాదేవికి నలగామరాజు జన్మించాడు. మిగతా భార్యలవల్ల పెదమలి దేవుడు, పినమల్లిదేవుడు, బాల మల్లిదేవుడు, నరసింగరాజు, పెరుమాళ్లరాజులను కుమారులు కలిగారు.

అనుగు రాజు మంత్రి దొడ్డనాయుడు. ఈయన ధర్మపత్ని శీలమ్మ. వీరి కుమారుడే బ్రహ్మనాయుడు. వీరు అయిదుగురు అన్నదమ్ములు. పెద్దనాయుడు, బ్రహ్మనాయుడు, సూరినీడు, పేరినీడు, మల్లినీడు అనువారలు. వీరిలో పెద్దవాడైన పెద్దనాయుడు పేరు పొందిన రౌతు. రెండవ వాడు బ్రహ్మనాయుడు మంత్రిగా రాచకార్యాలు నిర్వహించాడు. మిగిలినవారు కూడా వీర యోధులు.

బ్రహ్మనాయని భార్య ఐతాంబ. సుగుణవతి, వీరపత్ని. వీరి ఏకైక పుత్రుడే బాలచంద్రుడు. ఇతను మహాభారత యుద్ధంలోని అభిమన్యుని వంటివాడు.

అనుగురాజు తర్వాత అతని పట్టపు దేవియైన మైలమాదేవి కుమారుడు నలగామరాజు పలనాటి రాజైనాడు. బ్రహ్మనాయుడు ఈయనకు మంత్రిగా వుండి రాచకార్యములను చతురతతో నిర్వహిస్తూ వస్తున్నాడు. బ్రహ్మనాయుడు ధర్మనిరతుడు. తండ్రి మరణించిన తదుపరి పిన్న వయస్కులైన మల్లి దేవాదులను, నరసింగరాజును కూడా సమదృష్టితో చూస్తూ, బ్రహ్మనాయుడు తండ్రి వలె పెద్దరికంతో రాచరిక కుటుంబానికి అండగా వున్నాడు.

అప్పట్లో ఓరుగల్లు రాజధానిగా తెలంగాణ ప్రాంతాన్ని కాకతీయులు పరిపాలిస్తున్నారు. నేటి అమరావతి(ధరణికోట)ని కోట వంశీయులు, వెలనాటిలో గొంకరాజు పరిపాలిస్తున్నారు.

గుంటూరు సీమ పశ్చిమ ప్రాంతాన్ని పలనాడు అంటారు. పలనాటి కార్యమపూడి, రెంటచింతల, మండాది, మాచర్ల, పిడుగురాళ్ల, గురజాల, దాచేపల్లి, జిట్టగామపాడు, వీరమేడపి, ప్రధాన పట్టణాలుగా వుండేవి. పలనాటికి రాజధాని

గురజాల. మూడు వందల గ్రామాలకు కేంద్రంగా బాసిస్తోంది. 'నేటి నరసరావుపేట పలనాటికి ముఖద్వారం వంటిది.

ప్రజలు కష్ట జీవులు. మెట్టప్రాంతం. వ్యవసాయం అప్పటికీ, ఇప్పటికీ ప్రధాన వృత్తి. ధైర్యసాహసాలకు పలనాటి ప్రజలు పెట్టింది పేరు. పట్టుదల గలవారు. అప్పట్లో దక్షిణ భారత దేశమంతటా వీర వైష్ణవం, వీరశైవం పరవళ్లు తొక్కుతున్నాయి. హైందవమతంలోని రెండుశాఖలైన శైవాన్నీ, వైష్ణవాన్ని కూడా ప్రజలు ఆచరిస్తున్నారు. ఇవిగాక జాతరలు, కొలుపులు జరుపుతూ వుంటారు. ఉత్సవాల్లో, పండుగదినాల్లో కోడిపందేలు, సాముగరిడీలు, ఎడ్లపందేలు నిర్వహిస్తూ ఆనందిస్తూ వుంటారు.

పలనాటిలో జిట్టగామాలపాడు ఒక మోస్తరు పల్లె. ఆరవల్లి రామిరెడ్డి ఆగ్రామ వాస్తవ్యుడు. మోతుబరిరైతు. ఒకనాటి ఉదయం రామిరెడ్డి అరక కట్టుకొని పొలం వెళ్లాడు. అరక దున్నుతుండగా పొలం గట్టున వున్న పెద్ద చెట్టు వద్ద పుట్టకు సమీపంలో ఒక పసికందు ఏడుపు రామిరెడ్డికి వినిపించింది. రామిరెడ్డి ఆశ్చర్యంతో ఎవరో కనిపారేసిన ఆ బిడ్డను చేతికి తీసుకొని, దైవ ప్రసాదంగా భావించి యింటికి తీసుకొని వెళ్లి పెంచసాగాడు. పుట్ట సమీపంలో దొరికినందున ఆశిశువుకు నాగమ్మ అని పేరు పెట్టాడు. రామిరెడ్డికి సంతానంలేదు. నాగమ్మను అల్లారుముద్దుగా పెంచి పెద్ద జేసాడు. ఆ బిడ్డ ఇంటిలో కాలుపెట్టినది మొదలు రామిరెడ్డికి బాగా కలసి వచ్చింది

జిట్టగామాలపాడు గ్రామానికి రామిరెడ్డి పెద్దకాపు అయినందున, అతని మాట గ్రామస్తులందరికీ శిరోధార్యంగా వుండేది. జిట్టగామాలపాడు అడవికి దగ్గర్లో వుంటుంది. క్రూర మృగాల భయం వల్లగానీ, కోయ వారి దోపిడీల బెడదల నుండి తమను తాము కాపాడుకోవడానికి గ్రామస్తులందరూ కత్తి, కర్రసాము నేర్చుకొని వుంటారు. రామిరెడ్డి కూడా కుమార్తె మీది ప్రేమతో ఆమెకు గుర్రం స్వారీ చేయడం, కత్తిసాము, కర్ర సాధన నేర్పించాడు. నాగమ్మ కూడా ధైర్య సాహసాలు గలది. ఆ చుట్ట ప్రక్కల గ్రామాల్లో రామిరెడ్డి మోతుబరి రైతు కావడంచేత, నాగమ్మ అంటే ఆ ప్రాంతంలో గౌరవం, భయం వుండేవి. యుక్త వయస్సు రాగానే రామిరెడ్డి తగిన వరున్ని చూసి నాగమ్మకు వివాహం చేసాడు. కానీ దురదృష్టవశాత్తు ఏడాది తిరక్కముందే భర్త చనిపోయి నాగమ్మ వితంతువైంది. మరికొంత కాలానికి తనను పెంచి పెద్దచేసిన రామిరెడ్డి దంపతులు కూడా మరణించారు. వారసులు లేని కారణంగా నాగమ్మ పుట్టినింటికి, మెట్టినంటికి కూడా వారసురాలైంది. కావలసినంత ఆస్తిపాస్తులు వున్నందున, నాగమ్మ ఆ చుట్టు ప్రక్కల గ్రామాల్లో గౌరవం, మన్నన

పొందింది. ఆ గ్రామానికి నాగమ్మే నాయకురాలైంది.

అడవికి దగ్గరగా వున్న గ్రామం కనుక జిట్టగామాలపాడు చుట్టూరా వున్న పల్లెల మీద అడవి చెంచులు, కోయలు పడి దోచుకునేవారు. నాగమ్మ గ్రామీణులైన యువకులను సమీకరించి, వారికి నాయకురాలిగా వుండి దొంగలబారి నుండి, క్రూర జంతువుల నుండి గ్రామస్తులను కాపాడుతూ వుండేది.

నాగమ్మ చిన్నప్పటి నుంచీ రామిరెడ్డి పెంపకంలో క్రమశిక్షణతో పెరిగింది. రామిరెడ్డి శివభక్తుడు. వీరశైవులైన జంగాలతో రామిరెడ్డి పూజలు జరిపిస్తూ వుండేవాడు. నాగమ్మకూడా చిన్నప్పటి నుంచీ ఉదయమే స్నానంచేసి, విభూతి ధరించి, శివపూజ చేస్తూ వుండేది. అటవీప్రాంతం గనుక స్థానికంగా దేవీపూజలు అక్కడ పరిపాటి. నాగమ్మ దాచేపల్లి, తదితర ప్రాంతాలలో శివాలయాలను కట్టించింది. ఆనాటికే ఆంధ్రప్రాంతంలో వీరశైవం బాగా వ్యాపించివుంది. జంగాల కథలు, గ్రామగ్రామన వినిపిస్తూ వుండేవి.

గురజాలలో యువరాజై నలగామ రాజును రాజుగా ప్రకటించి, బ్రహ్మనాయుడు పరిపాలనా వ్యవహారాలు చక్కదిద్దుతూనే ప్రజల యోగక్షేమాలతో పాటు, ప్రజల సాంఘిక జీవితాన్ని కూడా సంస్కరించేందుకు పూనుకున్నాడు. బ్రహ్మనాయుడు వైష్ణవ మతస్థుడు. త్రిమతాచార్యులలో ఒకరైన రామానుజాచార్యుల వైష్ణవ మత ప్రచారం అప్పట్లో ముమ్మరంగా జరుగూ వుండేది. సర్వజనులకూ, అన్ని కులాల వారికి వైష్ణవాన్ని అందించి, కులభేదాలు లేకుండా పాటించబడుతున్నది.

బ్రహ్మనాయుడు అన్నికులాల నుంచీ ఒక్కొక్కరిని దత్తు తీసుకొని, తన ఏకైక కుమారుడు బాలచంద్రునితో పాటు పెంచి పెద్దచేసి కులాల మధ్య తేడాలు వుండకూడదని, కులాలు మానవుడు సృష్టించినవేనని ప్రచారం చేయసాగాడు. మాలకన్నమదాసు, బ్రహ్మణ యువకుడైన అనపోతును తన కొడుకుతో సమానంగా పెంచాడు. అన్ని కులాల వారితో కలిసి సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేసి, దేవుని దృష్టిలో మానవులందరూ సమానులేనని చాటాడు. ఈ సహపంక్తి భోజన విధానమే చాపకూటి సిద్ధాంతంగా ప్రచారం చేయబడింది.

గురజాలలో బ్రహ్మనాయుని వైష్ణవ ప్రచారం జిట్టగామాలపాడులోని నాగమ్మకు కోపకారణమైంది. హైందవ మతాచారాలను బ్రహ్మనాయుడు మంటగలుపుతున్నాడనీ, ప్రజలను సంకరం చేస్తున్నాడనీ సాతాని జియ్యరులను మాల దాసర్లను తయారు చేసి ప్రజల్ని కులభ్రష్టుల్ని చేస్తున్నాడనీ కక్ష పెంచుకోసాగింది. నలగామ రాజు వద్ద మంత్రిగా వున్నందున బ్రహ్మనాయుని ఏ విధంగానూ ఎదుర్కోలేక సమయం కోసం ఎదురు చూడసాగింది.

ఒకనాడు నలగామరాజు మృగయా వినోదం కొరకు జిట్టగాలిపాడు సమీపంలోని అడవికి వేటకు వచ్చాడు. ఆ సంగతి నాగమ్మ ముందుగానే గ్రహించి, అడవిలో రాజునకూ, అతని పరివారానికీ తగిన వసతులు కల్పించవలసిందిగా, చెంచు నాయకులకు ఆదేశాలిచ్చి, తాను షడ్రసోపేతమైన భోజన ఫలహారములను తయారుచేసి, అచటికి చేరవేసింది. ఒక విశాల ప్రదేశాన మల్లెపందిళ్లు వేయించి, తియ్యని పానీయాలను సమకూర్చి వుంచింది. చాలా సేపు వేటాడి, అలసిపోయి నలగామరాజు, తన పరివారంతో, ఆకలిగొని, దప్పిక తీరక విశ్రాంతి కొరకు పరితపించే సమయంలో, నాగమ్మ అనుచరులు నలగామ రాజును, రాజ పరివారాన్ని చలువ పందిళ్లవైపు చేర్చారు. అక్కడ నలగాముడు హాయిగా విశ్రాంతి తీసుకొని, చక్కని విందుతో సేదతీరి, తనకీ ఏర్పాట్లు చేసిన వారెవరని అనుచరులను ప్రశ్నించారు.

అంతట నాగమ్మ రాజు ఎదుటపడి "రాజా! మీ కోసం నేనే యీ ఏర్పాట్లును చేసాను." అని తనను తాను పరిచయం చేసుకొన్నది. అంతకు మునుపే నాగమ్మ పేరు ప్రతిష్టల్ని వినియున్నందున నలగాముడు సంతోషించి ఒక సారి రాజస్థానానికి రావలసిందిగా నాగమ్మను ఆహ్వానించాడు.

తన ఎత్తుగడ ఫలించినందుకు నాగమ్మ సంతసించింది. అది మొదలుగా నాగమ్మ అనేకమార్లు గురజాలవెళ్లి నలగామరాజు ఆస్థానాన్ని సందర్శించి, అతనికి ప్రీతి పాత్రురాలైంది. సమయం వచ్చినప్పుడల్లా నలగామునకు సలహాలిస్తూ, అతని యోగక్షేమాల పట్ల శ్రద్ధ కనబరుస్తూ బాగా సన్నిహితురాలైంది. నలగామరాజు తన అంతరంగిక సలహాదారుగా నాగమ్మకే ప్రాతినిధ్యం యిస్తూ, ప్రధానామాత్యుడైన బ్రహ్మనాయుడ్ని సైతం త్రోసిపుచ్చిన సంఘటనలు అనేకం జరిగాయి.

పరిస్థితులు యిలా ఉండగా నలగామరాజు సవతి సోదరులైన మలిదేవాదులు యుక్త వయస్కులైనారు. బ్రహ్మనాయుడు వారి యోగాక్షేమాల పట్ల శ్రద్ధవహిస్తూ వుండేవాడు. దీన్ని అదనుగా తీసుకొని బ్రహ్మనాయుడు యువరాజులైన మలిదేవాదులకే అనుకూలుడనీ, సమయం రాగానే నలగాముని చంపి, రాజ్యాన్ని మలిదేవులకు అప్పగించేందుకు కుట్ర చేస్తున్నాడని నాగమ్మ నమ్మబలికింది. నలగాముడు నాగమ్మ ఆలోచన సరియైనదేనని భావించి, రాజ్య వ్యవహారాలలో మలిదేవులకు ఏ మాత్రం జోక్యం లేకుండా చేసి, బ్రహ్మనాయుని కూడా దూరంగా వుంచాడు. అంతేగాకుండా మలిదేవులను చంపించడానికి నాగమ్మ సలహాపై నలగాముడు ప్రయత్నాలు చేసాడు.

పరిస్థితిని గ్రహించిన బ్రహ్మనాయుడు యిక ఎంతమాత్రం గురజాలలో

వుండడం క్షేమంకాదని. మలిదేవులను, వారి తల్లులను, తన కుటుంబం, తన అనుచర వర్గాన్ని వెంటనిడుకొని మాచర్ల వెళ్లి అక్కడ కొత్తగా కోట కట్టుకొని పెద్ద మలిదేవుని రాజుగా ప్రకటించి, ఆ ప్రాంతాన్ని ఏలుబడిలోకి తెచ్చాడు. అక్కడ చెన్నకేశవస్వామి దేవాలయాన్ని పునర్నిర్మాణం గావించి, మాచర్ల చుట్టు ప్రక్కల గ్రామాలను అభివృద్ధి పరిచి అక్కడి ప్రజల అభిమానానికి పాత్రుడైనాడు.

బ్రహ్మనాయుడు మాచర్ల తరలిపోవడమే నాగమ్మకు కావలసింది. నాగమ్మ పథకం సునాయసంగా ఫలించింది. గురజాల పరిసర ప్రాంతాలలో ప్రజల్లో శైవమత ప్రచారాన్ని సాగించింది. నలగాముని కీలుబొమ్మగా తయారు చేసింది.

మాచర్ల పరిసర ప్రాంతాల్లో బ్రహ్మనాయుడు చాపకూటి సిద్ధాంతాన్ని అమలు పరుస్తూ, చెన్నకేశవస్వామి ఉత్సవాన్ని, రథోత్సవాన్ని పెద్ద ఎత్తున నిర్వహిస్తూ వైష్ణవ సాంప్రదాయాలను పరివ్యాప్తం చేస్తున్నాడు.

ఒక సంక్రాంతి పర్వదినంనాడు.

సంక్రాంతికి నాలుగు రోజుల ముందుగా బ్రహ్మనాయుడు మలిదేవాదులను వెంట తీసుకొని, గురజాల విచ్చేసి, మలిదేవులకు రాజ్యాన్ని పంచి యివ్వవలసిందిగా కన్నమదాసును నలగాముని వద్దకు రాయభారం పంపినాడు.

నాగామ్మ దీర్ఘంగా ఆలోచించి సంధి పొసగకుండా చేయడానికి ముందుగానే పథకం వేసింది. కన్నమదాసును నిండుసభలో అవమానించి, పంపడం జరిగింది. అయినప్పటికీ అహింసావాదియైన బ్రహ్మనాయుడే స్వయంగా మలిదేవులతో సహా నలగాముని సభకు వచ్చి రాజ్యం పంచవలసిందిగా కోరాడు.

పథకం ప్రకారం నాగమ్మ ముందుగానే నలగామునితో సంప్రదించిన ప్రకారం సాదర వాక్యాలతో బ్రహ్మనాయునితో సంభాషించి "సంక్రాంతి పర్వదినంనాడు వాదోపవాదములు సమంజసంకావు. పండుగ వెళ్లిన మరుసటి దినం రాజ్య వ్యవహారములు ఆలోచించవచ్చును. నేపు సంక్రాంతి కోడి పందెములు మన ప్రజల సాంప్రదాయం. గెలవగలమన్న ధీమా, ధైర్యం వుంటే గురజాలలో కోడి పందెములు జరుదాం" అని రెచ్చగొట్టే విధంగా మాట్లాడింది.

బ్రహ్మనాయుని అనుచరులు నాగమ్మ అహంకార ధీరశీలి సహించలేక, కోడిపందెములకు సిద్ధమేనన్నారు. నాగమ్మ వ్యూహం ఫలించింది. పందెములలో ఓడినవారు రాజ్యాన్ని వదిలి, అడవుల్లో ఏడు సంవత్సరాలు ప్రవాసం చేయాలన్న షరతులను యిరు పక్షాల వారూ అంగీకరించారు.

మాచర్ల పట్టణ వాసులు, గురజాల పౌరులు పెద్ద ఎత్తున ప్రదర్శన స్థలానికి చేరుకున్నారు. ఇరు పక్షాలు సేనాధిపతులు, నలగాముడు, బ్రహ్మనాయుడు,

నాగమ్మ, మలిదేవులు, నరసింగరాయ, కన్నమదాసు తదితర వీరులు పౌరుషం వుట్టిపడేట్టు తమతమ కోడిపుంజులను సమాయత్తపరిచారు. పట్టుదలలు, పంతాలూ పెరిగాయి. కోడిపుంజులు కత్తులు కట్టిన కాళ్లతో బరిమీద యుద్ధ విన్యాసం చేస్తూ ఎగసెగసి పడుతున్నాయి. గెలుపు, ఓటమిలు సమానంగా వుంటున్నాయి.

ఈ పరిస్థితిలో నాగమ్మ పక్షానికి చెందిన కోడిపుంజులకు కవచాలు అమర్చబడి, బరిలోకి వదలబడ్డాయి. ఈ కుట్ర తెలియని మాచర్ల పక్షాలవారు పందేలలో వుండగా, బరిలో మాచర్ల కోడిపుంజులు గాయాలతో నేలకొరిగాయి. గురజాల కోడి పుంజులు విజయగర్వంతో నిలబడ్డాయి.

షరతు ప్రకారం బ్రహ్మనాయుడు, మలిదేవులు మాచర్ల అనుచరవర్గమూ అవమాన భారంతో, వూరు వదిలి మండాది వద్ద అడవుల్లో ప్రవాసం చేయవలసి వచ్చింది.

నాగమ్మ ప్రత్యర్థి బ్రహ్మనాయుడు సదాచారాల్ని హైందవమత విశ్వాసాన్ని మంటగలిపి, చాపకూటితో, మాలదాసర్లతో బ్రహ్మనాయుడు సమాజాన్ని సంకరం చేస్తున్నాడని నాగమ్మ చేసే అభియోగం చుట్టుప్రక్కల రాజ్యాలలో కూడా ఉపయోగపడింది.

బ్రహ్మనాయుని ప్రవాస కాలంలో గురజాల కేంద్రంగా నాయకురాలు నాగమ్మ వీరశైవాన్ని ప్రజల్లో బాగా ప్రచారం చేసింది. శివాలయాలను నిర్మించింది. చుట్టూగల ధరణికోట, గుంటూరు, వెలనాడు, చేజర్ల, కోణిదెన రాజ్యాలలోని రాజ కుటుంబీకులలో నలగామరాజుకు సన్నిహిత సంబంధాల్ని సంతరించి పెట్టింది. వెలనాటి రెండవగొంకరాజు కుమార్తెను నలగామరాజు వివాహం చేసుకోవడానికి నాగమ్మ సహకరించింది, అప్పట్లో వెలనాడు బలమైన రాజ్యంగా వుండేది. వెలనాటికీ, కాకతీయులకూ సంబంధ బాంధవ్యాలు ఏర్పడివున్నాయి. ధరణికోట రాజైన రెండవ కేతరాజుకు వెలనాటి గొంకరాజు సోదరి సబ్బాంబికను వివాహం చేసుకోవడం ద్వారా, ధరణికోట రాజులతో కూడా నలగామరాజుకు బాంధవ్యం ఏర్పడింది. కాకతీయులతో దూరపు బంధుత్వం వుండనే వుంది. దూర దృష్టి, రాజకీయ చతురతగల నాయకురాలి ఎత్తుగడలు నలగామరాజుకు బాగా ఉపయోగపడ్డాయి. ఏదో విధంగా బ్రహ్మనాయుని పదభ్రష్టుని చేసి, సాధించి, ఆంధ్ర ప్రాంతాలు శైవాన్ని నెలకొల్పాలన్నదే నాగమ్మ పట్టుదల.

మండాదిలో ఏడు సంవత్సరాల ప్రవాసం పూర్తి చేసుకొని బ్రహ్మనాయుడు తన అనుచరులతోనూ, మలిదేవులతోనూ మాచర్ల చేరుకున్నాడు. ప్రవాసం ముగిసింది గనుక గురజాల మీదికి దండెత్తాలని, నలగాముని, నాగమ్మను పట్టి బంధించాలని మాచర్ల వీరులు కత్తులు నూరారు.

బ్రహ్మనాయుడు తొందరపడకుండా న్యాయబద్ధంగా మలిదేవులకు రాజ్యాన్ని పంచి యివ్వాల్సిందిగా రాచమల్లు అనే రాజకుటుంబీకుడ్ని గురజాలకు రాయభారం పంపాడు. రాచమల్లు ఎవరోకాదు. నలగామరాజుకు స్వయానా అల్లుడే. నలగామరాజు ఏకైక కుమార్తె పేరమ్మను రాచమల్లు వివాహం చేసుకున్నాడు. కానీ యింత కాలమూ రాచమల్లు బ్రహ్మనాయుడి పక్షంలో చేరినందున, గురజాలకు దూరమయ్యాడు. భార్యను పుట్టింట వదిలివేసాడు. ఈనాడు బ్రహ్మనాయుడి పనుపున రాచమల్లు దీర్ఘకాలం తర్వాత గురజాలకు రాయభారిగా వచ్చి, నలగాముని సభాముఖంగా కలుసుకొని, బ్రహ్మనాయుడు పంపిన సంధి వార్త తెలియజేసాడు.

నాగమ్మ సలహా మీదట నలగామ రాజు సంధికి అంగీకరించలేదు. కానీ అల్లుడు రాకరాక వచ్చినందున, భార్య, కుమార్తెల కోరికపై ఆరోజు వుండవలసిందిగా కోరినాడు. కానీ రాచమల్లు భార్య పేరమ్మ వద్దకు వెళ్లి, ఆమెను కలుసుకొని, అనునయ వాక్యాలతో సమాధాన పరచి, యుద్ధానంతరం తనతో పాటుతోడ్కొని వెడతానని మాటయిచ్చి, మాచర్ల ప్రయాణమై, చీకటి పడినందున దారిలో చర్లగుడిపాడులో మకాం చేసాడు. ఆ విషయం తెలుసుకున్న నాగమ్మ, నమ్మకస్థులతో రాచమల్లుకు విషాహారం పెట్టించి చంపించింది. పాము కాటుకు చనిపోయాడని బహిరంగంగా ప్రచారం చేయించింది. భర్త మరణ వార్త విని పేరమ్మ సహగమనం చేసి చనిపోయింది.

ఈ సంఘటనతో మాచర్ల వీరులు పట్టరాని కోపంతో ప్రళయ రుద్రులైనారు.

ఇరు పక్షాలవారూ యుద్ధ సన్నద్ధులైనారు. యుద్ధభూమి కార్యమపూడిగా యిరు పక్షాల వారూ అంగీకరించారు. మాచర్ల సైనాధ్యక్షుడు కన్నమదాసు సకల సైన్యంతో కార్యమపూడి పట్టణ శివార్లలో విడిది చేసాడు. గురజాల నుంచి నలగాముని సైన్యాలు మరొక వైపు మోహరించాయి. ఏ క్షణంలోనైనా యుద్ధం ప్రారంభించే దశలో బ్రహ్మనాయుడు సంధి జరిపేందుకు తుది ప్రయత్నాలు చేయసాగాడు.

బ్రహ్మనాయుడు మలిదేవాదులతో, సకల పరివారంతో కోడి పందేలలో ఓడిపోయి, మండాదికి ప్రవాసం వెళ్లిన ఏడేళ్లు బ్రహ్మనాయని సతీమణి ఐతాంబ తను ఏకైక కుమారుడైన బాలచంద్రునితోడ్కొని తన పుట్టిల్లువున్న వీరమేడపిలో వుంటూ వచ్చింది. అప్పటి నుంచి నేటి దాకా ఆమె, కుమారునితో పుట్టింటనే వుండి పోయింది.

బాలచంద్రుడు యువకుడు. సాహసి, సాగి మగన్న నాయని కుమార్తె మాంచాలతో చాల సంవత్సరాల క్రితమే బాలచంద్రునికి వివాహం జరిగింది. కానీ

బాలచంద్రుడు ఆటపాటలతో, బాల్య చాపల్యంతో కాలం గడుపుతూ భార్య మాంచాలకు దూరంగా వుండిపోయాడు.

ఒకనాడు బాలచంద్రుడు తన మిత్రులతో కూడి నడివీధిలో బొంగరములాటలాడుచుండగా, బాలచంద్రుడు విసిరిన బొంగరం ఆదారిన పోతున్న 'అన్నమ్మ' అనే ఆమె కాలిగిలకకు తగిలింది. ఆ బాధ నోర్వలేక అన్నమ్మ కోపంతో బాలచంద్రుని దూసిస్తూ "నీ తండ్రీ, పరివారమంతా యుద్ధభూమిలో శత్రువులతో పోరాటానికి సిద్ధంగా వుంటే, నీవు యిక్కడ బొంగరాలాటతో పొద్దుపుచ్చుచున్నావా? నీకు పౌరుషం లేదా ? నీ ప్రతాపం ఆడవారి పైన చూపుతావా?" అని వెళ్ళిపోయింది.

అప్పటి దాకా బాలచంద్రునికి కార్యమపూడి యుద్ధరంగాన్ని గురించి ఏమాత్రం తెలియదు. తండ్రి బ్రహ్మనాయుడు ఆ విషయాన్ని కుమారునికి తెలియకుండా గోప్యంగా వుంచాడు. కానీ బాలచంద్రుడు పరుగుపరుగున యింటికి వెళ్లి తల్లి ఐతాంబను నిలదీసి మాతండ్రి, మలిదేవరాయలు, కన్నమదాసు కార్యమపూడి యుద్ధరంగానికి ఎప్పుడు వెళ్లారు ? ఎందుకు ?" చెప్పమని పట్టుపట్టాడు.

తల్లి ఐతాంబ యిక బాలచంద్రునికి తెలియకుండా వుంచడం సాధ్యం కాదని, విషయమంతా వివరించింది. తాను కూడా కదనరంగానికి బయలు దేరుతున్నాని సైనిక దుస్తులు ధరించి, ఆయుధధారియై వచ్చిన కుమారున్ని దీవించి, "వెళ్లే ముందు నీ భార్య మాంచాలను కలిసి వెళ్లు! ఇది నాయాజ్ఞ" అని అన్నది.

అప్పటి దాకా మాంచాల ముఖం కూడా చూడని బాలచంద్రుడు భార్య మాంచాల దగ్గరికెళ్లి, పశ్చాత్తాపాన్ని తెలియజేసి, యుద్ధరంగానికి వెళ్లడానికి వీడ్కోలు పలికి సాగనంపమని" చెప్పాడు. ఏనాటికైనా తన భర్త తన వద్దకు వస్తాడని ఆశిస్తున్న మాంచాల భర్త రాకకు సంతోషించి, "వీరపత్నిగా నిన్ను యుద్ధరంగానికి పంపుతున్నాను" అంటూ వీరగంధం పూసి, మగని చేతికి వీర ఖడ్గాన్ని అందించి చిరునవ్వుతో సాగనంపింది. మాంచాల వీర పత్నిగా నిరూపించుకున్నది.

తనతో పాటు బయలు దేరిన మిత్రులతో కలిసి కార్యమపూడికి గుర్రాల మీద దౌడు తీసాడు బాలచంద్రుడు, బ్రాహ్మణయువకుడైన ఒక్క అనపోతును మాత్రమే మభ్యపరిచి వెళ్లగా, యీ విషయం తెలుసుకున్న అనపోతు కత్తితో పొడుచుకొని తన జంధ్యాన్ని రక్తంతో తడిపి బాలచంద్రునికి అనుచరుని ద్వారా అందచేయించాడు. 'అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ' అనే సామెతను అనపోతు రుజువు చేసాడు.

కార్యమపూడిలో బ్రహ్మనాయుడు సంధికి తుది ప్రయత్నాలు చేస్తున్నాడు. నాగమ్మ సమరనాదం మోగించింది. యుద్ధమే యీ వైరానికి పరిష్కార మార్గమని గర్జించింది.

వీరశైవులు, జంగాలను రంగంలోకి దింపింది.

యుద్ధసన్నద్ధులై యుర్వికంపింప
వారితోడనె కూడి వడియ జంగాలు
నల్లబొంతల వారు నాలుగు వేలు
ఎర్రబొంతల వారు ఎనిమిది వేలు
ఉరమున లింగాలు మెరిసెడు వారు
గళమున రుద్రాక్ష కలిగినవారు

పలనాటి వీర చరిత్ర పేరిట శ్రీనాథ మహాకవి రాసిన ద్విపదకావ్యంలో పలనాటి వీరులు, శైవమత జంగాలు, వైష్ణవ జియ్యర్లు ఏవిధంగా పలనాటి యుద్ధంలో పాల్గొన్నదీ కళ్లకు కట్టినట్లు రచించాడు.

పలనాటి యుద్ధంలో నలగామరాజుకు సహాయంగా కాకతీయ రుద్రదేవుడు రెండువేల ఏనుగుల్ని సహాయంగా పంపాడు. కోట కేతరాజు రాయభారం కూడా విఫలం కాగా, నలగాముని పక్షమే వహించాడు. వెలనాటి గొంకరాజు తన అల్లుడైన నలగామునికి అండగా నిలిచాడు.

దాదాపు ఆనాడు ఆంధ్ర దేశమంతా పలనాటి యుద్ధంలో పాల్గొన్నది. పలనాటిలో గల మూడు వందల గ్రామాల్లో యుద్ధ భేరి మ్రోగింది. పలనాటి పౌరుషం కదను త్రొక్కింది.

క్రీ.శ. 1180 బ్రహ్మనాయుడి సంధి ప్రయత్నాలు ఫలించలేదు. ఈ లోగా వీరమేడపి నుండి బాలచంద్రుడు వచ్చిపడ్డాడు. బ్రహ్మనాయుని శిబిరంలోకి దూసుకొని వచ్చి యుద్ధమే తప్ప, సంధి వద్దని ప్రకటించాడు.

ఈలోగా బాలచంద్రుని చేతికి అనపోతు పంపిన రక్తపు జందెం అందింది. బాలచంద్రుడు సివంగిలా ముందుకు దూకాడు. అనపోతు మరణం అతనిలో ఏదో చెప్పరాని ఆవేశాన్ని కలిగించింది.

కత్తిదూసి కదన రంగానికి ఉరికాడు.

అక్కడ నలగాముని సైన్యాలు యుద్ధానికి సిద్ధంగా వున్నాయి. నలగామరాజు సైన్యానికి అతని సవతి తమ్ముడైన నరసింగరాజు సైన్యాధ్యక్షుడిగా వున్నాడు.

"జై ! చెన్నకేశవా!" అనే నినాదాలు –

"హరహరశంభో! శంకరా" అనే ప్రత్యర్థి హుంకారాలతో కార్యమపూడి యుద్ధభూమి దద్దరిల్లింది.

బాలచంద్రుడు కొదమ సింగంలా శత్రు సైన్యాలపై బడి హతమారుస్తూ, వీరవిహారం చేస్తూ, నరసింగరాజు తలనరికి బల్లేనికి గ్రుచ్చి. బ్రహ్మనాయని శిబిరం

వద్దకు వచ్చి తండ్రి ముందు పడవేశాడు. ఊహించరాని సంఘటన చూసి తమ సవతి సోదరుడు దుర్మరణం చెందాడని మలి దేవాదులు తల్లడిల్లి పోయారు.

బ్రహ్మనాయుడు తీవ్ర మనస్తాపంతో, రాచకుటుంబానికి హాని జరక్కుండా యుద్ధాన్ని ముగించాలని తాను చేసిన ప్రయత్నాలు వమ్ముకాగా, అందుకు కారకుడైన బాలచంద్రుడిపై ఈసడించుకున్నాడు.

తండ్రి బ్రహ్మనాయని వైఖరికి మండిపడి "మీరు పిరికి వాళ్లు" అంటూ దూషించి, అనుచరులతో కదన రంగానికి కదిలి శత్రు సైనికులతో అరివీర భయంకరుడిలా పోరి, తుదకు వంటరిగా గాయాలతో, యుద్ధభూమిలోనే నేల కొరిగాడు.

యుద్ధం భయంకరంగా సాగింది.

మలిదేవాదులు చనిపోయారు

నాయకురాలు నాగమ్మ స్వయంగా సైన్యాలకు ఆదిపత్యం వహించి, రణరంగంలోకి వచ్చింది. "మీసం మగవారికే కాదు. నాముంజేతికి మీసం కలదంటూ" శత్రు వీరులను కవ్వించి, సవాలు చేసింది.

ఇరుపక్షాల సైనికులు వీరోచితంగా పోరాడారు. యుద్ధం ఏడు రోజులు కొనసాగింది. చెప్పుకోదగిన వీరులందరూ మరణించారు.

అంతకుముందే రాయబారిగా వచ్చిన నలగామరాజు అల్లుడైన రాచమల్లు హత్య చేయబడినాడు. ఆ వార్త విని అతని భార్య పేరమ్మ సతీ సహగమనం చేసింది. బ్రహ్మనాయుడు పెంచి పెద్ద చేసిన అనపోతు ఆత్మహత్య చేసుకున్నాడు. పలనాటి వీరులంతా కార్యమపూడి కదన రంగంలో వీరోచిత మరణం చెందారు.

ఏడవరోజు యుద్ధం మరింత భీకరంగా సాగింది.

బ్రహ్మనాయుని సైన్యాధిపతి కన్నమదాసు ఎరుపెక్కిన కళ్లను యుద్ధరంగంలో నాయకురాలు నాగమ్మ పైనే కేంద్రీకరించాడు. నలగామరాజును నాయకురాల్ని బంధించాలనేదే కన్నమదాసు పట్టుదల.

నాయకురాలు నాగమ్మ గుర్రంమీద కత్తిపట్టి యుద్ధ రంగంలో తన సైనికులను ఉసికొల్పుతూ ముందుకు వురికిస్తున్నది. బ్రహ్మనాయుని బంధించాలని నాగమ్మ కోరిక.

హఠాత్తుగా కన్నమదాసు ఒక్క ఉదుటున నాగమ్మ ఎదుటపడ్డాడు. వీరయోధుడైన కన్నమదాసు అంతటాతానై విజృంభించి, నాయకురాలి సైన్యాన్ని చెల్లాచెదురు చేసి, నాగమ్మను పట్టి బంధించాడు. గుర్రంతో సహా నాగమ్మను నిరాయుధురాలిని చేసి, బ్రహ్మనాయుడి ముందుకు తెచ్చి పడవేసాడు.

ఈ సంఘటన చూసి బ్రహ్మనాయుడు బాధపడుతూ "కన్నా! మన భారతీయధర్మం, ఏ పరిస్థితుల్లోనూ స్త్రీ జాతికి అవమానం చేయకూడదని ఘోషిస్తోంది. ఒక అబలను జయించడమే పౌరుషం కాదు. నాగమ్మ తోబుట్టువు వంటిది. ముందు ఆమె కట్లువిప్పు" అని ఆదేశించాడు.

నాయకురాలు బంధ విముక్తి చెందింది. తలవంచుకొని బ్రహ్మనాయుడి ముందు నిలబడింది.

"నాగమ్మా! నాయకురాలికుండవలసిన అర్హత, లక్షణాలు నీకు వున్నాయి. కాదనను. కానీ నాపైన కత్తిగట్టి, నన్ను సాధించడానికి చేసిన ప్రయత్నం పలనాటినే సర్వనాశనం చేసింది. నీవు శివభక్తురాలివి. నేను వైష్ణవుడను. అన్నికులాలవారినీ సమదృష్టితో చూసే వైష్ణవ ధర్మం నీకు కంటగింపుగా మారింది. మత భేదాలు, పట్టింపుల వల్ల మనం ఏం సాధించాం. శివ కేశవులకు భేదంలేదు. ఆచార వ్యవహారాల్లో మాత్రమే భిన్నత్వం వుంటుంది. ఇకనైనా సర్వమతసామరస్యానికి నీ జీవితాన్ని అంకితం చేసుకో. నీకు శ్రేయస్కరం అవుతుంది" అని "కన్నా! ఈమెకు మన సైనికుల నుండి ఏ ఆపదా రాకుండా, నీవు వెంటవుండి నలగాముని శిబిరానికి చేర్చు" అని ఆదేశించాడు.

కన్నమదాసు సహాయంతో నాగమ్మ గురజాల శిబిరం చేరింది. యుద్ధం ఆగిపోయింది. నలగామరాజు పరుగుపరుగున బ్రహ్మనాయుడి వద్దకు వచ్చి పాదాలపై బడి విలపిస్తూ వుండిపోయాడు.

బ్రహ్మనాయుడు అతనిని దగ్గర కూర్చుండబెట్టుకొని, "నలగామా! మాతండ్రి కాలం నుండి మీ హైహయ వంశానికి సేవలు చేస్తూ వచ్చాం. మీ కుటుంబానికి పెద్దగా, తండ్రిగా, మంత్రిగా మీ అన్నదమ్ములందరి క్షేమాన్ని సమానంగా భావించానే కానీ నీకు ఎప్పుడూ ద్రోహం తలపెట్టలేదు. ఈ యుద్ధంలో నీవు తప్ప, హైహయ వంశవీరులతోపాటు, మీ అన్నదమ్ములందరూ మృతి చెందారు. నీవు మిగిలావు. యిక మీదట ప్రజలందర్నీ కన్నబిడ్డల్లా చూస్తూ మాచర్ల, గురజాల రాజ్యాల రెంటినీ ఏకం చేసి, యీ పలనాటిని పరిపాలించు. నీకు శుభం కలుగుగాక" అని తల నిమిరి భుజం తట్టాడు.

నలగాముడు ఏదో చెప్పబోయి బ్రహ్మనాయుడి ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు.

"నీవు చెప్పదలచుకున్న విషయం నాకు తెలుసు నన్ను గురించి నీవు చెప్పదలచుకున్నావు. నా మంత్రిత్వం యధావిధిగా కొనసాగాలని నీ కోర్కె. కానీ నేను సన్యసిస్తున్నాను. నాశేష జీవితం చెన్నకేశవుని సేవకే వినియోగించుకోవాలను కుంటున్నాను" అని లేచాడు.

నలగాముడు గురజాలచేరుకున్నాడు.

నాగమ్మ మనస్సు పరిపరి విధాల పోయింది.

"తన తల్లిదండ్రులెవరో తెలియదు. ఎవరో కనిపారేసిన తనను రామిరెడ్డి పెంచిపెద్ద చేసాడు. వివాహం జరిగింది. విధి వక్రించింది. ఏడాదికే వైధవ్యాన్ని పొందింది. తన పెంపుడు తండ్రి యింట వంశానుగతంగా వస్తున్న శివభక్తికి తాను అంకితం అయ్యింది. హైందవ మతాచారాలకు, సాంప్రదాయాలకు, పరమశివుని పాదపద్మముల సాక్షిగా తాను పాటు పడింది. ఇందులో తన వ్యక్తి గత స్వార్థం లేదు. ఈశ్వరేచ్ఛ తనను యిలా నడిపించింది. పలనాడు రక్తపుటేరుల్లో మునిగింది. యిది తన స్వయంకృతాపరాధంగాదు. ఒక కర్తవ్యం, ఒక పవిత్రాశయమే తన చేత కత్తి పట్టించింది. ఒక భక్త్యావేశం తనని ఊగించింది. వివశురాల్ని చేసింది. చివరకు మిగిలిందేమి?" అంటూ తన ఏకాంత మందిరంలో పూర్వాపరాలను తలపోసింది.

ఎదురుగా నటరాజస్వామి, ఢమరుకం మోగిస్తూ, శూలం ధరించి ప్రళయ నృత్యం చేస్తున్న దృశ్య పటం మీద నాగమ్మ దృష్టి నిలిపింది.

చివాలున లేచి నాగమ్మ "శంకరా" అంటూ మండపం మీద నిశ్చలంగా వున్న శివలిగం మీద శిరస్సు వాల్చి వుండిపోయింది.

ఆవల పలనాడు
కొండవీడి వల నిలిచి
జననమెత్తిన చిరుత బాలునికి గూడ
వీరగాధలు గరుపుచోటు
వీర భాషాభిరామ
గుంటూరు సీమ

అంటూ జాషువా ఎలుగెత్తి పాడిన పాటలో గుంటూరు సీమ స్వరూపం మన కళ్ల ముందు సాక్షాత్కరిస్తున్నది.

# సిక్కుల పదవ గురువు, ఖాల్సా నిర్మాత గురుగోవింద సింగ్

పిచ్చుకలను డేగలుగా, నక్కలను పులులుగా మార్చగల సమర్థుడైన గురుగోవిందసింగ్ తన జీవితాన్ని సిక్కు మత ధర్మానికి, స్వాతంత్ర్య సాధనకు అంకితం చేసాడు.

గురునానక్ క్రీ.శ. 1469లో జన్మించి సిక్కు మతాన్ని స్థాపించాడు. అప్పట్లో భారత దేశాన్ని పరిపాలిస్తున్న ముస్లింపాలకులు భారతీయ సమాజంపై ఎన్నో దురాగతాలకు పాల్పడ్డారు. మతద్వేషంతో భారతీయులపై ముస్లిం పాలకులు దౌర్జన్యకాండని జరుపుతున్న రోజులవి. సమాజంలోని మతద్వేషాన్ని నిరసించి, సరళిమత సామరస్యం ప్రాతిపదికగా గురునానక్ సిక్కు మతాన్ని నెలకొల్పాడు. ఆయన బోధనల్ని అనుసరించిన వారందరూ సిక్కులయ్యారు. శిష్యులనే పదమే పంజాబీ భాషలో సిక్కులుగా ఉచ్చరించబడుతుంది.

గురునానక్‌తో సహా సిక్కు మతానికి పదిమంది గురువులు వున్నారు. వారిలో చివరి గురువు గురుగోవిందసింగ్. వీరిలో తొమ్మిదవ గురువైన గురుతేజ బహదూర్ కుమారుడే గురుగోవింద్ సింగ్.

ముస్లింలు జరుపుతున్న మతాంతీకరణను వ్యతిరేకించినందుకు ఔరంగజేబు అతి క్రూరంగా తేజ్‌బహదూర్‌సింగ్ తలను నరికించాడు. వీరిలో అయిదవగురువైన గురుఅర్జునసింగ్‌ను జహంగీరు ఉరి తీయించాడు. ముస్లిం రాజుల క్రూరమైన చేష్టలకు గురుగోవింద్ సింగు తీవ్రంగా కలత చెంది ఆగ్రహోదగ్రుడైనాడు.

"స్వధర్మ రక్షణకు ఆత్మార్పణ చేసేవారు ముందుకు రావాలని గురుగోవింద్‌సింగ్ పిలుపు యిచ్చాడు. మొగలులపై గురుగోవింద్ సింగ్ జరిపిన అవిశ్రాంత పోరాటం దేశ చరిత్రలో ఒక అద్భుత ఘట్టంగా భాసించింది.

1699లో గురుగోవింద్ సింగ్ ఖాల్సాను స్థాపించాడు. ఖాల్సా అంటే పవిత్రులని అర్థం. ఖాల్సా స్థాపనకు ముందు ఆనంద్‌పూర్‌లో నాలుగు మాసాలు మహాయజ్ఞాన్ని ఈయన జరిపించాడు. ఈ మహాసభకు దేశం నలుమూలల నుండి అసంఖ్యాకంగా ప్రజలు విచ్చేసారు.

సర్‌హింద్ రాష్ట్రంలో గురుగోవిందసింగ్ ఖాల్సాను బలోపేతంగా నిర్మించాడు. సర్‌హింద్ గవర్నరు అతిక్రూరంగా గురుగోవింద్ సింగుపై కక్ష సాధించాడు. కన్న

తల్లిని, యిద్దరు కుమారులను బంధించాడు. ఇస్లాం స్వీకరించడానికి నిరాకరించి నందుకు గోవింద్ సింగు కుమారులనిద్దర్నీ గవర్నరు నిర్దాక్షిణ్యంగా సజీవ సమాధి చేయించాడు. యీ శోకంతో గురుగోవిందుని తల్లి మరణించింది. అంతకు ముందే తండ్రి తేజ బహదూర్‌ను ఔరంగజేబు చంపించాడు.

"నాకొన వూపిరి వున్నంత వరకు అధర్మంపై పోరాటం సాగిస్తాను" అని గురు గోవింద్ సింగు ప్రతిజ్ఞ చేసాడు.

ఖాల్సా అవతరించిన నాటి నుండి ప్రతి కుటుంబం నుండి ఒకరిద్దరు ఖాల్సాలో చేరడం సాంప్రదాయికంగా మారింది. ఖడ్గదారులైన ఖాల్సాలు స్వధర్మ రక్షణకు నడుం బిగించి, గురుగోవింద సింగు నాయకత్వంలో సుశిక్షుతులుగా మార్పు చెందారు.

ముస్లింల అత్యాచారాలను అరికట్టడానికి దీక్షవహించి "మీరిక శిక్కులే కాదు, సింహాలు" అని గోవింద్ సింగ్ వీర సందేశం యిచ్చాడు. అప్పటి నుండి సిక్కులు తమ పేరు చివర్లో సింగ్ అనగా (సింహ) అని ధరించడం ప్రారంభించారు.

శిక్కుల సైనిక ధర్మ వ్యవస్థ అయిన ఖల్సాను స్థాపించి, సిక్కుల ఆత్మ గౌరవాన్ని గోవిందసింగ్ యినుమడింపజేసాడు.

హైందవ మతంలో ఒక శాఖగా సిక్కుమతం ప్రభవించింది. అందుకే సిక్కు మతంలో హైందవం అంతర్లీనంగా కనిపిస్తూ వుంటుంది.

గోవిందసింగ్ తండ్రి అయిన తేజ్ బహదూర్ సింగు అన్యాయాలను ప్రతిఘటించే సాహస మనస్తత్వం గలవాడు. ఔరంగజేబు పరిపాలనలో కాశ్మీరు పండితులపై ఇస్లాం స్వీకరించాలని వత్తిడి పెరిగి, దౌర్జన్యంగా ముస్లింలు కాశ్మీరు పండితులను మతాంతీకరణం చేసే సమయంలో కాశ్మీరు పండితులు తేజ్ బహదూర్‌ను శరణు కోరారు. వారికి అండగా నిలిచి తేజ్ బహదూర్ ఔరంగజేబు దౌర్జన్యాన్ని వ్యతిరేకించాడు. ఇందుకు కక్ష వహించిన ఔరంగజేబు క్రూరాతి క్రూరంగా తేజ్ బహదూర్ శిరస్సు నరికించాడు. అన్యాయాల్ని దౌర్జన్యాల్ని ప్రతిఘటించే కుటుంబంలో జన్మించి, పవిత్ర ఆశయాలు గల సిక్కు మతానికి గురువుగా ప్రభవించి గురుగోవింద్ సింగు వీరాధివీరుడిగా చరిత్ర కెక్కాడు.

అంతేకాదు సాంప్రదాయిక జీవన విధానాన్ని సిక్కులకు అందించాడు. గురుగోవింద్ చక్కని సారస్వత ప్రియుడు కూడా. తులసీదాసు రామాయణం చదివిన ప్రేరణతో గోవిందసింగ్ స్వయంగా గోవింద రామాయణాన్ని రచించాడు. గో హత్యకు వ్యతిరేకంగా పోరాడాడు.

ముస్లింల పరిపాలనా కాలంలో నిరంతరం హైందవ ప్రజలపై జరుగుతున్న దౌర్జన్యాలను, దాడులకు సిక్కులు అడ్డుకట్ట వేసారు.

సిక్కు మతంలో కులభేదాలు లేవు. ప్రజలంతా సమానులే. అందరూ కలిసి సహ పంక్తి భోజనం చేయడం పరిపాటిగా వుంటుంది. ఈ పద్ధతిని పంగల్ అంటారు.

నాలుగవ గురువైన గురు రామదాసు తీవ్రమైన కృషి చేసి, అక్బరు చక్రవర్తి నుండి అమృత్‌సర్‌ను సంపాదించి, అచ్చట స్వర్ణ దేవాలయానికి పునాది వేసాడు. గురురామదాసు కుమారుడు అర్జునసింగ్ అయిదవ గురువుగా వుంటూ అమృతసరస్సు త్రవ్వించి అందంగా మలిచి, దాని మధ్యలో స్వర్ణ దేవాలయాన్ని నిర్మించాడు. అమృతసర్ సిక్కులకు పరమ పవిత్ర క్షేత్రంగా రూపొందింది. గురునానక్ బోధనలన్నింటినీ క్రోడీకరించి, సిక్కుధర్మం, ఆచార వ్యవహారములను పొందుపరిచి, గురు అర్జున్ సింగ్ గ్రంథస్తం చేసాడు దీనినే "గ్రంధసాహిబ్" అంటారు. ఇది సిక్కుల ఆది గ్రంథం. అమృతసర్ దేవాలయంలో గ్రంథ సాహిబ్ మూలప్రతి నెలకొని వుంటుంది.

గోవధ నిషేధం కొరకు ముస్లిం, బ్రిటిషు ప్రభుత్వాల పై జరిపిన పోరాటంలో అనేకమంది నామ్‌ధారి సిక్కులు తమ ప్రాణాలను బలి యిచ్చారు. గురుగోవింద్ సింగు గోమాత రక్షణ సిక్కుల పవిత్ర కర్తవ్యంగా బోధించాడు. ఈ ఉద్యమాన్ని "కూకా" ఉద్యమం అని పిలుస్తారు.

నిర్గుణోపాసన ప్రాతిపదికగా గల భక్తి ఉద్యమం నుండి గురునానక్ సిక్కు ధర్మాన్ని బోదించాడు. సిక్కుల పదవ గురువైన గురుగోవిందసింగు వరకు సిక్కుల స్వధర్మాలకోసం తమ ప్రాణాలను తృణప్రాయంగా అర్పించారు.

గురుగోవింద సింగ్ గొప్ప పండితుడు. స్వధర్మ రక్షణకు సిక్కులకు ఆయుధధారణ కలిగించిన వీరుడు. ఇప్పటికీ సిక్కులు తమ వెంట కృపాణం ధరించి తిరగడం జీవన విధానంగా భావించి ఆచరిస్తున్నారు.

సిక్కులు క్షురకర్మ చేయించరు. పుట్టిన దగ్గర నుండీ చనిపోయేంత వరకు జుత్తు పెంచి వుంచుతారు. గడ్డం, మీసాలు కూడా యధాతధంగా వుంటాయి. తలజుట్టు ముడి వేసి తలగుడ్డ చుట్టకొని వుంటారు. ముస్లిం పాలకుల అత్యాచారాలను అడ్డుకొనే దశలో ప్రతిజ్ఞాపూర్వకంగా వీరు యీ ఆచారాన్ని పాటించడం జరిగింది. అదే ఆచారంగా సిక్కుల జన జీవితంలో నిలిచిపోయింది.

పట్టుదలకు, శౌర్యసాహసాలకు సిక్కులు పెట్టింది పేరు. సిక్కులను సమరసింహాలుగా రూపొందించిన గురుగోవిదసింగు చివరి గురువుగా భాసించాడు.

గురుగోవిందు ఒక సారి మూల్వారాజ్యంలో ఉన్నప్పుడు కొందరు శిష్యులు "గురునానక్ బోధించిన అహింసా మార్గానికి" తరలకూడదా ? అని అడిగారు.

"నేను యీ పవిత్ర ధర్మ రక్షణ కోసం నాతండ్రినీ, నాతల్లిని, కన్న బిడ్డలను సైతం త్యాగం చేసాను. ఇప్పుడు కేవలం నాప్రాణ రక్షణ కోసం శాంతి వచనాన్ని వల్లించలేను. భారత జాతి ప్రమాదంలో వుండగా విశ్రాంతి తీసుకోలేను. నాకొన

వూపిరి వున్నంత వరకు అధర్మంపై పోరాటం జరుపుతాను" అని గురుగోవింద్ సింగు నిర్భయంగా ప్రకటించాడు.

గురుగోవిందసింగు స్థాపించిన ఖాల్సా జాతి రక్షణలో అనన్యమైన త్యాగాలను చేసింది.

గురుగోవిందసింగు సిక్కు సమాజాన్ని సంస్కరించాడు. వారిలో ఐక్యమత్యాన్ని పెంపొందించాడు. సిక్కులకు సైనిక రక్షణ యిచ్చాడు. ఖాల్సా పేరిట సిక్కు సైన్యాన్ని తయారు చేసాడు. ఆయుధ ధారణ సిక్కులకు పవిత్ర కర్తవ్యంగా బోధించాడు.

గోవిందసింగు పంజాబ్ అంతటా కోటలు నిర్మించాడు. ఔరంగజేబు దురాగతాలను ఎదుర్కొన్నాడు. ముస్లింలతో నిరంతర పోరాటం జరిపాడు.

తానే కడపటి గురువునని, తన తదనంతరం ఆస్థానాన్ని" గురుగ్రంధ సాహిబ్" పవిత్ర గ్రంథం గురు పీఠాన్ని అలంకరించగలదని" ప్రకటించాడు. ఆ విధంగా గురుగోవిందు సింగ్ సిక్కుల ఆఖరి గురువుగా ప్రసిద్ధి చెందాడు.

జాతి రక్షణకు ప్రాణాలనే త్యాగం చేయాల్సిందిగా సిక్కులకు గోవిందసింగ్ బోధించాడు. ప్రత్యేక ధర్మాలను సిక్కుల కొరకు రూపొందించాడు.

"అందరూ పరస్పరం సోదరులు. మహిళలు సైతం పురుషులతో సమానమే. స్వధర్మ రక్షణ ధ్యేయాన్ని ఆచారంగా భావించేందుకు శిరోజములను, గడ్డములను పెంచండి. ఈ ఆచారం సదా మీకు స్వధర్మ రక్షణ ధ్యేయాన్ని గుర్తు చేస్తూ వుంటుంది. శుభ్రతకై దువ్వెన ఉండాలి. కంకణం ధరించాలి. ఖడ్గప్రాణులు కావాలి. ధూమపానం వంటి దురభ్యాసములను విడనాడాలి. కుల, వర్గ, వర్ణ భేదములు లేకుండా సిక్కులంతా సమానులే అనే భావాన్ని కలిగి వుండాలి. మీరంతా సింహ (సంగ్) నామం ధరించాలి" అని బోధించి వాటిని ఆచరణాత్మకం చేసాడు.

సిక్కు జాతికి ఒక ప్రత్యేకతను సంతరించి పెట్టి వారి జీవన విధానాన్ని గురుగోవిందసింగ్ తీర్చిదిద్దాడు.

తన జీవిత కాలమంతా స్వజాతి శ్రేయస్సుకు ఆయన పాటుపడ్డాడు. గోవిందునిలోని కర్తవ్య పరాయణత, ధైర్య సాహసాలను చూసి ముస్లింల కళ్లు కుట్టాయి. ఎలాగైనా గోవిందుని తుదముట్టించాలని కుట్రపన్నారు.

ఒక ముస్లిం ప్రచ్ఛన్న వేషంతో గోవిందసింగు శిష్యునిగా చేరి, మోసపూరితంగా గోవిందుని హత్య చేసాడు.

సిక్కుల పదవ గురువు, ఖాల్సా నిర్మాత, గురుగోవింద సింగు జీవితం భావితరాలకు ఆదర్శ ప్రాయమైనది. జాతి రక్షణకు ఆయన బోధనలు స్ఫూర్తి నిస్తాయి.

# నవభారత పిత
# శ్రీ రాజారామ్ మోహన రాయ్

నవభారత పిత శ్రీరాజరామ్ మోహన రాయ్ బెంగాల్‌లోని రాధానగర్‌లో 1772లో జన్మించాడు.

మూఢ విశ్వాసాలు, చాందసాచారాలు, బాల్య వివాహాలు, సతీసహగమనం వంటి దురాచారాలు సమాజంలో పాతుకొని వున్న రోజులవి.

రాజారామ్ మోహన్ రాయ్ తల్లిదండ్రులు పూర్తిగా పూర్వాచారపరాయణులు. సనాతన బ్రాహ్మణ కుటుంబీకులు. విగ్రహారాధన వారియింట నిత్యకృత్యంగా వుండేది.

ఆనాటి ఆచారాన్ని అనుసరించి, చిన్న వయస్సులోనే పన్నెండేళ్ల పసివయస్సుగల కన్యతో రాజారామ్ మోహన్ రాయ్‌కి వివాహం జరిగింది. కానీ స్వల్పకాలానికే ఆ పిల్ల మరణించింది.

పాట్నాలో చదువుకొనుటకు రామమోహనుని తల్లిదండ్రులు పంపారు. పాట్నాలో పాఠశాలలోని మిగతా విద్యార్థులకంటే మిన్నగా వుండి తెలివితేటలలో బాలమేధావిగా ఉపాధ్యాయులచే గుర్తించబడ్డాడు. బెంగాలీ, పార్సీ, ఇంగ్లీషు మొదలైన పలు భాషల్లో రామమోహనుడు పాండిత్యాన్ని సంపాయించాడు. కాశీలో సంస్కృతం నేర్చుకున్నాడు. హైందవ శాస్త్రాలను, పురాణాలను అధ్యయనం చేసాడు. అప్పటికే ఆంగ్ల విద్య ప్రభుత్వ భాషగా వున్నందున రామమోహనుడు ఇంగ్లీషులో ప్రావీణ్యాన్ని సంపాదించాడు.

బహుభాషా పరిచయం వల్ల పాశ్చాత్య పద్ధతులు, భిన్న సాంప్రదాయాలను, వివిధ మతాల్లోని సారాంశాన్ని బాగా అధ్యయనం చేసాడు. రామమోహనుని మస్తిష్కంలో కొత్త ఆలోచనలు మొసుకెత్తాయి. విశాలమైన ప్రాపంచిక పరిజ్ఞానం అబ్బిన కారణంగా నూతన భావాలు అతనిలో పెరగసాగాయి. సనాతన ఛాందసాచారాలు, మూఢ విశ్వాసాలు, విగ్రహారాధన పట్ల అతనికి అసంతృప్తి ఏర్పడింది.

రామమోహనుని లోని యీ మార్పును, సాంప్రదాయాల పట్ల, ఆచారాలపట్ల అతని వైముఖ్యం తల్లిదండ్రులకు, బంధు పరివారానికి నచ్చలేదు. రామమోహనుడు విపరీత ధోరణులకు, పాశ్చాత్య వ్యామోహంలో పడిపోయాడని వారు భావించారు.

ఇంతలో ఆయన తండ్రి గతించాడు. బాగా సంపన్నమైన కుటుంబం వారిది.

విశేషమైన పిత్రార్జితంపై ఆయనకు అధికారం ఏర్పడింది. కానీ అంత తేలికగా ఆయనకు ఆస్తి పాస్తులు స్వాధీనం కాలేదు. సనాతన ధర్మ సూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడని తల్లి అడ్డు వచ్చి, న్యాయస్థానంలో ఆస్తి మీద అతనికి అధికారం లేదని వాదించింది. న్యాయస్థానం రామమోహనునికి అనుకూలంగా తీర్పు చెప్పింది.

రామమోహనుని సోదరుడు అకాలమరణం చెందాడు. ఆనాటి ఆచారాన్ని అనుసరించి వదిన సహగమనం చేయవలసి వచ్చింది. కానీ రామమోహన్ రాయ్ యిందుకు వ్యతిరేకించాడు. కానీ ఆయన మాటను ఎవరూ లెక్క చేయలేదు.

అతని వదిన భర్త చితిపై సహగమనం చేసింది. పతి శవం ప్రక్కనే చితిపై సహగమనం చేయునప్పుడు అగ్నిజ్వాలల వేడికి తట్టుకోలేక బిగ్గరగా ఆమె రోదించే దృశ్యం రామమోహనుని కలచి వేసింది. పురోహితులు, బంధు జనులు వెదురు కర్రలతో ఆమెను వెనుకకు నెట్టే దృశ్యం, ఆమె ఏడుపులు, పెడబొబ్బలు వినబడకుండా డోళ్లు మ్రోగిస్తు కొమ్ము బూరలు వూదడం, వళ్లు జలదరించే ఆ సంఘటన రామమోహనుని మస్తిష్కంలో అలజడిని రేపింది. ఈ క్రూరమైన ఆచారాన్ని తుదముట్టించాలని రామమోహనుడు ప్రతిజ్ఞ తీసుకున్నాడు.

సాంస్కృతిక పునరుజ్జీవనానికి మూల పురుషుడిగా రామమోహన రాయ్ చరిత్ర కెక్కాడు,. భారతీయ సమాజంలో పాతుకపోయిన మూఢ విశ్వాసాలను, ఛాందసవాదాన్ని సంస్కరించి, ఒక నూతన కోణంలో సామాజిక స్థితిగతుల్ని సరిదిద్దాలని కంకణం కట్టుకున్నాడు. అప్పట్లో ప్రపంచ వ్యాప్తంగా నూతన భావధోరణులు పెల్లుబికి, వివిధ దేశాల్లో నూతన సామాజిక వ్యవస్థలకు అంకురోత్పత్తి జరుగుతూ వుంది. ఫ్రెంచి విప్లవం ఆనాటి మేధావుల్లో గొప్ప సంచలనాన్ని రేకెత్తించి. ఇంగ్లీషు విద్యా ప్రభావం వల్ల ప్రపంచంలోని సామాజిక పరిణామాల్ని, ఆయా ప్రాంతాల్లో పరిఢవిల్లుతున్న భావ వికాసాన్ని పరస్పరం తెలుసుకొనే అవకాశం ఏర్పడింది.

ఇట్టి చారిత్రక సంధికాలంలో నూతన సమాజాన్ని భారతదేశంలో ఆవిష్కరించడానికి రాజారామమోహన్ రాయ్ సంకల్పించాడు. 1828లో ఆయన నూతన భావాలతో, సంస్కరణలతో బ్రహ్మసమాజాన్ని స్థాపించాడు.

బ్రహ్మ సమాజంలో ఏకేశ్వరోపాసన ప్రధానమైన అంశం. పరబ్రహ్మ ఒక్కడే. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అన్నది బ్రహ్మ సమాజానికి మూలం. ఇందులో విగ్రహారాధనకు తావులేదు. పరబ్రహ్మ నిర్గుణ స్వరూపం. ఇందులో కుల ప్రసక్తి వుండదు. కులభేదాలు లేవు. కుల, వర్ణ, వర్గాలు లేని సర్వ సమానత్వమే

'బ్రహ్మ సమాజం' ఆశయాలు. మానవులంతా ఒక్కటే. హెచ్చు తగ్గులు లేవు. అందరూ సమాజాభ్యుదయానికి పాటుపడాలి. మూఢాచారాలను, ఛాందస భావాలను విడనాడాలి. విశాల భావంతో మానవ సేవకు పాటు పడాలి".

బ్రహ్మ సమాజంలోని యీ సూత్రాలు ఆనాటి మేధావుల్ని, విద్యావంతుల్ని బాగా ఆకర్షించాయి. నవ సమాజానికి నాందీ వాచకంలా బ్రహ్మ సమాజాన్ని వర్ణించి నెత్తి కెత్తుకున్నారు. అనతి కాలంలోనే ఎందరో సభ్యులుగా చేరారు.

హైందవంలోని అద్వైతభావం, బౌద్ధంలోని విశ్వమానవ సౌభ్రాతృత్వం, ఇస్లాంలోని నిర్గుణోపాసన, సోదరభావాలు, క్రైస్తవంలోని కారుణ్యం, మానవసేవలను జోడించి, సర్వమత సంకలనంగా, అన్ని మతాలలోని మంచిని స్వీకరించి, మారుతున్న సమాజానికి అనుగుణంగా, నూతన భావాలతో, నూతన దృక్పధంతో రాజరామ్‌మోహన రాయ్ బ్రహ్మసమాజానికి రూపు రేఖలు తొడిగాడు.

హైందవ సమాజంలో పాతుకపోయిన దురాచారాలపై రామమోహనుడు కత్తి కట్టాడు. తన జీవితంలో ఎదురైన స్వీయానుభవాలే ఆయన్ను ఆలోచింపజేసి, యీ సాంఘిక దురాచారాన్ని చట్టబద్ధంగా తుద ముట్టించాలనే నిర్ణయానికి తెచ్చాయి. బాల్య వివాహాలను, సతీ సహగమనాన్ని, నిర్మూలించాలనీ, స్త్రీ విద్యను ప్రోత్సాహించి, వితంతు వివాహాలను జరిపించాలన్నవి ఆయన ఆశయాల్లో ముఖ్యమైనవి.

బహుభాషా పాండిత్యం, ఆధునిక దృక్పధం, రాజారామ్‌మోహనరాయ్ తాను పుట్టిపెరిగిన హైందవ సమాజాన్ని సంస్కరించి, నూతన దృక్పధంతో ప్రజలందరికీ ఆమోదయోగ్యమైన రీతిలో, అందరి జీవన విధానానికీ ఉపయుక్తమైన బాటలో 'బ్రహ్మసమాజం' సంస్థను స్థాపించాడు.

అప్పట్లో సత్య దృక్పధం గల 'బ్రహ్మ సమాజం' దేశంలో ఎందరో మేధావులను ఆకర్షించింది. భారతీయ సమాజంలో ఒక కొత్త అధ్యాయాన్ని తెరచింది.

రాజారామ్‌మోహనరాయ్‌లు స్థాపించిన బ్రహ్మ సమాజం ఆదర్శాలను ద్వారకానాథ్ ఠాకూర్ బాగా ప్రచారం గావించాడు. రామమోహన్‌రాయ్‌ల అనంతరం మహర్షి దేవేంద్రనాధ ఠాకూర్ బ్రహ్మ సమాజాన్ని తీర్చి దిద్దాడు. కేశవచంద్రసేన్ బ్రహ్మ సమాజాన్ని బహుళ వ్యాప్తికి తెచ్చాడు.

కేశవ చంద్రసేన్ 1864లో మదరాసుకు వచ్చి బ్రహ్మసమాజం గురించి ఉపన్యాసాలు యిచ్చాడు. వీరి ఉపన్యాసాలకు రాజగోపాలాచారి, సుబ్బరాయలు శెట్టి ప్రభావితులైనారు. 1871లో శ్రీధరనాయుడు అనే యువకుడు బ్రహ్మసమాజం ఆదర్శాలకు ప్రబోధితుడై బెంగాల్ రాష్ట్రం పర్యటించి వచ్చి, మద్రాసులో దక్షిణ

భారత బ్రహ్మ సమాజం నెలకొనడానికి కారకుడైనాడు. 1878లో శ్రీ మన్నవ బుచ్చయ్య పంతులు దీక్షవల్ల మద్రాసులో బ్రహ్మ సమాజానికి భవనం ఏర్పడింది. ఆ భవన నిర్మాణానికి తెలుగువాడైన రాజా గణపతిరావుగారు భూరి విరాళం యిచ్చారు. అంతకు ముందే 1870లో బరంపురంలో, 1875లో బందరులో, 1878లో బాపట్లలో, రాజమండ్రిలోనూ, 1888లో కాకినాడలోనూ బ్రహ్మసమాజాలు వెలిసాయి.

1905 నుండి బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి కృషితో ఆంధ్ర దేశంలో బ్రహ్మసమాజ ఉద్యమానికి కాకినాడ ప్రధాన కేంద్రం అయింది. వీరికి పిఠాపురం మహారాజా రావు వెంకట మహాపతి సూర్యారాయ బహద్దూరు గారు బాగా సహకరించారు.

బ్రహ్మసమాజం ఒక మానవతా వాద ఉద్యమంగా ఆంధ్రలో పరివ్యాప్తి గాంచడానికి సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు, కందుకూరు వీరేశలింగంగారు, పిఠాపురం రాజాగారు ముఖ్య కారకులు. ఈ త్రిమూర్తుల కృషి వల్ల ఆంధ్రలో బ్రహ్మసమాజం శాఖోపశాఖలుగా విస్తరించింది. అంతేకాదు సాంస్కృతిక ఉద్యమంగా రూపొందింది.

బెంగాల్ రాష్ట్రం నుండి అనేకమంది మేధావుల్ని ఆంధ్ర ప్రాంతానికి రప్పించి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ఉపన్యాసాలను యిప్పించారు. వీరిలో ప్రసిద్ధ బ్రహ్మ సమాజ ప్రచారకులు అయిన పండిత విశ్వనాధ శాస్త్రి, హేమచంద్ర సర్కారు, సతీశచంద్ర చక్రవర్తి తదితరులు, అమృతలాల్ బోసు, నిర్భర ప్రియ ఘోషు, రాజకీయ దురంధురులైన చిపిన్ చంద్రపాల్, విశ్వకవి రవీంద్రుడు బొంబాయి నుండి షిండే, అమెరికా నుండి పాల్‌వర్తు, నేట్‌ఫీల్డ్ తదితరులు ఆంధ్రలో పర్యటించినారు. ఈ కార్యక్రమాలతో భిన్న ప్రాంతాల మధ్య సాంస్కృతిక సమన్వయం జరిగింది.

బ్రహ్మ సమాజం అనేక రంగాల్లో తన కృషిని కొనసాగించింది. మద్యపాన వ్యతిరేక ఉద్యమం కూడా యిందులో ఒక భాగంగా కొనసాగింది. విద్యా సంస్థలు స్థాపించి, పాఠశాలల్లో స్త్రీ విద్య ప్రధానంగా ప్రోత్సాహింపబడింది. బాలికలకు కూడా ప్రత్యేకంగా పాఠశాలలు నెలకొల్పబడ్డాయి. నిమ్నజాతుల ఉద్ధరణ యిందులో ఒక భాగంగా నిర్వహించబడింది. హరిజన సేవ అంటరానితనానికి వ్యతిరేకంగా ఉద్యమం తీవ్రంగా జరుపబడింది. అనేక సాంఘిక సంస్కరణలు బ్రహ్మ సమాజం ఆధ్వర్యంలో నిర్వహించబడి సాంఘికస్వరూపంలో నూతన భావాలు పెంపొంది ఆచరించబడినాయి.

తాను స్థాపించిన బ్రహ్మ సమాజం దేశ వ్యాపితంగా విస్తరించి, సంఘ

ప్రయోజనకరమైన కార్యక్రమాలు నిర్వహింపబడుతుండగా రాజారామ్‌మోహన్‌రాయ్ హైందవ సమాజంలో పాతుకపోయిన సతీసహగమనం, బాల్యవివాహాలను నిర్మూలించడానికి కంకణం కట్టుకున్నాడు.

అప్పట్లో భారతదేశంలో వైస్రాయిగా విలియం బెంటింగ్ వుండేవాడు. బెంటింగ్ సంస్కరణ వాది. ప్రజల శ్రేయస్సుకు కృషి చేయాలనే భావాలు కలవాడు. రాజారామ్ మోహన్ ఈ సందర్భంలో విలియం బెంటింగ్ సహకారం తీసుకున్నాడు. 1829లో సతీసహగమనం ప్రభుత్వం చేత నిషేధింపబడింది. రాజారామ్ మోహన్ రాయ్ నిరంతర కృషితో బెంటింగ్ సహకారంతో ఎట్టకేలకు సతీసహగమనం నిషేధించబడటం జరిగింది. బెంగాల్, రాజస్తాన్ వంటి ఉత్తరాది రాష్ట్రాలలో విరివిగా ఆచరణలో వున్న యీ అనాగరిక, క్రూర సాంప్రదాయం రాజారామ్ మోహన్ రాయ్ పట్టుదల, కృషితో రూపుమాసింది. చట్ట బద్ధంగా నిషేధించబడింది. అదేవిధంగా బాల్య వివాహాలు కూడా నిషేదించబడినవి.

తన స్వీయ జీవితంలో అనుభవించి, మానసిక వేదనకు గురి అయి, హైందవ సమాజంలో గుదిబండలుగా వున్న సతీసహగమనం, బాల్య వివాహములు నిషేధించబడడానికి రాజారామ్ ఎనలేని కృషి చేసాడు. అలాగే విగ్రహారాధనకు వ్యతిరేకంగా ప్రచారం గావించాడు. ఏకేశ్వరోపాసన, నిర్గుణోపాసన ప్రజలలో ప్రచారం గావడానికి బ్రహ్మ సమాజాన్ని స్థాపించి, ప్రజల్లో మూఢ ఛాందస భావాలకు, ఆచారాలకు రాజారామ్ మోహన్ రాయ్ అడ్డుకట్ట వేసాడు. యీ కార్యక్రమాల నిర్వహణలో ఆయన ఎన్నో కష్టనష్టాలకు గురి అయ్యాడు. అయిన వాళ్లు వెలివేసారు. బంధుమిత్రులు దూరమైనారు. అయినప్పటికి లెక్క చేయక, సంఘ ప్రయోజనములైన యీ ఉదాత్త ఆశయాలను ఆచరణలోకి తెచ్చి నవభారత జాతి పిత అని ప్రజలచేత ప్రశంసింపబడినాడు.

సర్వమత సమన్వయంతో కూడిన బ్రహ్మ సమాజం రాజారామ్ మోహన్ రాయ్ తదనంతరం కూడా ప్రపంచం అంతటా విస్తరించి, శాఖోపశాఖలుగా ప్రజల్లో పాదుకొని సంఘ సంస్కరణలకు కేంద్రంగా నెలకొని విశిష్ట సేవల్ని అందించింది.

ఆయన సాంఘికాదర్శం సువిశాలమైంది. సర్వ సమగ్రమైంది. అజ్ఞానాన్ని మూఢ విశ్వాసాలను అంత మొందించి, ప్రజలలో విద్యా, విజ్ఞానాలు పెంపొందించేందుకు రాజారామ్‌మోహన్‌రాయ్ అవిరళ కృషి సలిపినాడు.

లండన్‌లో రాజారామ్ మోహన్ రాయ్‌కు అపూర్వమైన ఆదరణ లభించింది. అనేక సభలలో రామమోహన్ రాయ్ అనర్గళంగా ఉపన్యసించి ఆంగ్లేయులను వుత్తేజపరిచాడు. లండన్‌లో ఆయనకు అనేకమంది శిష్యులుగా చేరారు. ఆయన ఆరోగ్యం క్షీణించి భారతదేశం చేరుకోక ముందే ఇంగ్లండులో స్వర్గస్థులయ్యారు. బ్రిస్టల్‌లో ఆయన సమాధి నేటికీ చారిత్రాత్మకంగా మనకు దర్శనమిస్తూ వుంది.

# స్వదేశీ సంఘ నిర్మాత, జాతీయవాది
# శ్రీ గాజుల లక్ష్మీ నరసు సెట్టి

బ్రిటిషు హయంలో ఆంధ్రదేశం మూడు ముక్కలుగా వుండేది. సర్కారు, దత్త మండలాలు (రాయసీమ), తెలంగాణా పేరిట విభజింపబడింది. తెలంగానా ప్రాంతం నిజాం నవాబు క్రింద వుండగా, దత్త మండలాలు, సర్కారు జిల్లాలు మద్రాసు ప్రెసిడెన్సీ క్రింద వుండేవి.

అప్పట్లో మద్రాసు ప్రెసిడెన్సీలో ఆంధ్రతో పాటు, కేరళ, తమిళ ప్రాంతం, సిలోన్ కూడా అవిభాజ్యంగా వుండేవి. వీటికి చెన్నపట్టణం (మద్రాసు) రాజధానిగా వుండేది.

చెన్న పట్టణాన్ని తొలిరోజుల్లో తెలుగు వారే నిర్మించారు. తరువాత కాలంలో బ్రిటీషుహాయంలో చెన్న పట్టణం విస్తరించి మద్రాసు నగరంగా రూపొందింది.

శతాబ్దాల నుండి తెలుగు వారు చెన్నపట్టణంలో స్థిరపడి వున్నారు. ఆంగ్లేయుల పాలనలో దేశం అస్తవ్యస్తంగా వుండేది. అప్పట్లో ప్రజలకు ప్రజాస్వామిక దృక్పథం వుండేది కాదు. ప్రభుత్వ అధికారుల, భూస్వాముల యిష్టానుసారంగా పనులు జరుగుతూ వుండేవి. ప్రభుత్వం అంటే ప్రజలకు భయం, చట్టం అంటే ఏమిటో ప్రజలకి తెలియదు.

పరస్పరం సంబంధాలు లేని సాంఘిక జీవితం, మత మూఢ విశ్వాసాలు, అందుబాటులో లేని విద్యావిధానం, చదువుకొన్న కొద్ది మంది ధనికులు పట్టాలు పుచ్చుకొని ప్రభుత్వ ఉద్యోగాల్లో చేరి ఎవరికీ ముట్టనట్లు విలాస జీవితాన్ని గడపడం, రాకపోకల సౌకర్యాలు లేక పోవడం, రైతులపై భరించలేని పన్నులు విధింపు, పన్నులు కట్టలేని వారిని క్రూరంగా హింసించడం, ప్రజలకు దారి చూపే రాజకీయ నాయకులు లేకపోవడం తదితర సమస్యలు అప్పట్లో సమాజంలో ఏర్పడి వున్నాయి.

ఇటువంటి పరిస్థితుల్లో చెన్న పట్టణంలో గాజుల లక్ష్మినరసుసెట్టి ఏనుగుల వీరస్వామి, కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్లై, వెంబాకం రాఘవచార్యులు వంటి ప్రముఖులు ప్రజల్లో జాతీయ భావాన్ని కలిగించి, సంఘటిత పర్చారు.

గాజుల లక్ష్మినరసు సెట్టి 1806లో చెన్న పట్టణంలో జన్మించాడు. తండ్రి సిద్ధుల సెట్టి. అప్పట్లో చెన్నపట్టణంలో సిద్దుల సెట్టి నీలిమందు వ్యాపారస్తులుగా సుప్రసిద్ధులుగా వుండేవారు.

లక్ష్మీ నరసు సెట్టి స్వదేశీ సంఘం వారు నిర్వహించే బడిలో చదువుకున్నాడు.. తండ్రి తరువాత వ్యాపారంలో ప్రవేశించి, దక్షతతో నడిపి బాగా ఆర్జించాడు.

తరువాత వ్యాపారాన్ని ప్రక్కన బెట్టి ప్రజల్లో రాజకీయ చైతన్యం కలిగించేందుకు దీక్ష బూనాడు. 1840 లో బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా మదరాసులో స్వాతంత్ర్య శంఖారావాన్ని గాజుల లక్ష్మీ నరసు సెట్టి పూరించాడు.

అప్పట్లో ప్రభుత్వం భాషగా ఆంగ్లం వున్నందున, ప్రభుత్వ కార్యకలాపాలు ప్రజలకి తెలిసేవి కావు. రాజకీయంగా అజ్ఞానంలో వున్న ప్రజల్ని తట్టి మేల్కొల్పిన తొలి జాతీయవాదిగా గాజుల లక్ష్మీ నరసు సెట్టి చరిత్రలో నిలిచివున్నాడు.

ప్రజల కష్టాలను ఎప్పటికప్పుడు ప్రభుత్వానికి తెలియ జెప్పేందుకు, ప్రజల్లో రాజకీయ చైతన్యాన్ని కలిగించేందుకు "మద్రాసు స్వదేశీ సంఘం" అనే పేరుతో ఒక సంస్థను శ్రీ గాజుల లక్ష్మీ నరసు సెట్టి స్థాపించాడు. ధనికులైన వర్తకులు, అనేక మంది పెద్దలు యీ సంఘంలో సభ్యులుగా చేరి తమ విలువైన సేవలు అందించారు.

లక్ష్మీ నరసు సెట్టి ప్రధానంగా విదేశీ మిషనరీలపై తన బాణాన్ని ఎక్కు పెట్టాడు. పెద్దపెద్ద ఉద్యోగస్థులైన అనేకమంది ఆంగ్లేయులు మదరాసు ప్రాంతంలో క్రైస్తవ మిషనరీలు చేసే మతం మార్పిడి విధానాన్ని ప్రోత్సాహిస్తూ, మిషనరీలకు సహాయపడేవారు. అప్పట్లో త్రెన్నివెల్లి కలెక్టరుగా వున్న థామస్, మద్రాసు సదర్ కోర్టులో న్యాయాధిపతిగా వున్న సర్‌విలియం బర్టన్, ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి అయిన జె.యఫ్.థామస్ హిందూ మతం నుండి క్రైస్తవ మతంలోకి మారిన వారికి ప్రభుత్వోద్యోగాలను సమకూర్చేవారు. ఈ సందర్భంలో మతం మారడానికి అంగీకరించని హిందువులకు అన్యాయం జరుగుతూ వుండేది. మిషనరీల క్రైస్తవ మత ప్రచారాన్ని, ప్రభుత్వ అధికారుల ప్రోత్సాహాన్ని చూసి లక్ష్మీ నరసు సెట్టి కలత చెందాడు. ఇంగ్లీషు మిషనరీలు క్రైస్తవ మతంలోకి ప్రజల్ని మతం మార్పిడి చర్యల్ని లక్ష్మీ నరసు సెట్టి తీవ్రంగా ఎదుర్కొన్నాడు.

అప్పట్లో నారాయణస్వామి నాయుడి గారి సంపాదకత్వంలో ప్రచురించబడే "నేటివ్ సర్క్యులర్" అనే పత్రికను, దాని అనుబంధ ముద్రణా యంత్రాలను లక్ష్మీ నరసు సెట్టి ఖరీదు చేసి ఆ పత్రిక పేరును "క్రీసెంట్" పేరిట మార్చి 2-10-1844లో మొదటి ప్రతిని వెలువరించాడు.

క్రిసెంట్ పత్రికలోని విమర్శలకు బ్రిటీషు ప్రభుత్వం భయపడింది. పత్రికకిచ్చే కనీస సదుపాయాలను ప్రభుత్వం క్రిసెంట్ పత్రికకు నిలుపు జేసింది. పత్రికపై కక్ష కట్టింది.

క్రైస్తవ మతం మార్పిడికి అనుకూలంగా క్రైస్తవ మతం పుచ్చుకొన్న హిందువులు తమమతం మార్పిడి వల్ల ఆస్తిహక్కులు కోల్పోకుండా వుండేందుకు, వారి ఆస్తి, వారసత్వ హక్కులు యధాతథంగా రక్షిపబడేందుకు ప్రభుత్వం అధికారులు ఒక చట్టాన్ని తెచ్చేందుకు ప్రయత్నించారు. ఆ ప్రయత్నాన్ని ఎదుర్కొనేందుకు లక్ష్మీనరసు సెట్టి 9-4-1845న మద్రాసులోని స్వదేశీయులందరితో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసారు. ఆ సమావేశానికి చాలా మంది స్వదేశీయులు హాజరైనారు.

ప్రభుత్వం చేయనున్న చట్టాన్ని నిరసిస్తూ దేశీయుల మత, సాంఘిక, ఆచారాలను హరించే యీ బిల్లును రద్దు చేయాలని ప్రభుత్వానికి, సుప్రీం కోర్టుకు మహాజర్లు పంపాలని సమావేశం తీర్మానించింది. ఆ విధంగా ఒక మహాజరును తయారుచేసి గాజుల లక్ష్మీ నరసు సెట్టి, దానిని లండన్ లోని బ్రిటిష్ ప్రభుత్వానికి సైతం పంపాడు. ఈ మహాజరును ప్రభుత్వం పరిశీలించి, భారతీయుల విశ్వాసాలను దెబ్బతీసే చట్టాన్ని రద్దు పరిచింది. యీ విషయాన్ని లండన ప్రభుత్వం మద్రాసులోని స్వదేశీ సంఘానికి కూడా తెలియపరిచింది.

7-10-1846 న మద్రాసు పచ్చయప్ప కళాశాల ఆవరణలో లక్ష్మీనరసు సెట్టి ఒక బహిరంగ సభను ఏర్పాటు చేసాడు. ఆనాటి సమాజంలో ఈస్టిండియా కంపెనీ పరిపాలన వలన జరుగుతున్న యిబ్బందులను, కష్టనష్టాలను, మిషనరీలు చేస్తున్న అక్రమాలను బహిరంగ సభలో వివరించి, యీ సమస్యలపై ఇంగ్లండులోని "ఆనరుబుల్ కోర్టు ఆఫ్ డైరెక్టర్సు"కు మహజరు పంపాలని తీర్మానించి మహాజరు తయారు చేసి దానిపై 12 వేల మంది ప్రజల సంతకాలను చేయించి ఇంగ్లండు పంపడం జరిగింది. ఈ మహాజరు యీ నాటికీ "ఇండియా ఆఫీసు లైబ్రరీ"లో, లండన్‌లో భద్రంగా వుంచబడింది.

"మద్రాసు నేటివ్ అసోసియేషన్" ద్వారా 1852లో లక్ష్మీ నరసు సెట్టి సుదీర్ఘమైన మరొక విజ్ఞాపన పత్రాన్ని తయారు చేసి, బ్రిటీషు పార్లమెంటుకు పంపారు. ప్రజలు అనుభవిస్తున్న కష్టాలనన్నింటిని ఆ మహజరులో పొందు పర్చడం జరిగింది. ప్రజలపై అధికంగా పన్నులు విధించడం, వాటిని వసూలు చేయడంలో బ్రిటీషు అదికారులు అనుసరించే ధారుణమైన హింసా పద్ధతులు, న్యాయస్థానాల్లో భారతీయులకు జరిగే అన్యాయాలు వివరించబడ్డాయి. ఈస్టు ఇండియా పాలనను తొలగించవలసిందిగా లండన్‌లోని బ్రిటిషు ప్రభుత్వానికి లక్ష్మీ నరసు శెట్టి హెచ్చరిక చేసాడు. జాతీయోద్యమంలో ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలనను రద్దుపరచవలసిందిగా భారతదేశం నుండి లండన్‌కు పంపబడిన తొలి హెచ్చరిక యిదే. 1857 సిపాయిల తిరుగుబాటుకు దశాబ్దం ముందుగానే ఈస్టు

ఇండియా కంపెనీ పాలనపై ధ్వజమెత్తిన లక్ష్మి నరసు సెట్టి తొలి తిరుగుబాటు దారుడిగా చరిత్రలో నిలిచాడు.

ఈయన పంపిన యీ విజ్ఞాపన పత్రం 25-2-1853న లండన్‌లో "'హౌస్ ఆఫ్ లార్డ్సు" సభలో ప్రస్తావనకు వచ్చింది. తిరిగి 14000 సంతకాలతో లక్ష్మి నరసు శెట్టి మరొక విజ్ఞాపన పత్రాన్ని లండన్‌కు పంపాడు. ఈ విజ్ఞాపనలో సైతం ఇండియాలో ఈస్టు ఇండియా కంపెనీ పాలనను తొలగించి, నేరుగా విక్టోరియా రాణి పరిపాలననే ఇండియాలో అమలు పరచవలసిందిగా లక్ష్మి నరసు శెట్టి ముందుగా హెచ్చరికను చేసాడు. సరిగ్గా యీ సూచననే 1857 సిపాయిల తిరుగుబాటు అనంతరం 1858లో విక్టోరియా రాణి అమల్లో పెట్టి, కంపెనీ పాలన రద్దు గావించి, విక్టోరియా రాణి పాలనను ఇండియాలో ప్రవేశపెట్టింది.

లక్ష్మి నరసు సెట్టి ప్రజల పక్షాన నిలిచి, ప్రజాశ్రేయస్సు కొరకు జరిపే ఆందోళనపై పోలీసు కాపలా పెట్టి ప్రభుత్వం ఆయనను ఆందోళకారునిగా ప్రకటించింది . అయినప్పటికి ఆయన తన ప్రజాఉద్యమాన్ని కొనసాగిస్తూనే వచ్చాడు.

1854లో ఆయన పచ్చయప్ప ట్రస్టుకు ధర్మకర్తగా నియమించబడినాడు. లక్ష్మినరసు సెట్టి దేశ ప్రజలకు చేస్తున్న నిస్వార్థ సేవకు గుర్తింపుగా సి.యస్.ఐ. అనగా కంపానియన్ షిప్ ఆఫ్ దిస్టార్ ఆఫ్ ఇండియా అనే బిరుదు యివ్వబడింది. 1863లో ఈయన "మదరాసు" లెజిస్లేటివ్ కౌన్సిల్లో సభ్యునిగా నియమితులైనారు.

లక్ష్మినరసుసెట్టి స్త్రీ విద్య పట్ల ప్రత్యేక శ్రద్ధా సక్తులను కనబరిచేవారు. తన స్వంత ఖర్చుపై అనేక బాలికా పాఠశాలలను నెలకొల్పాడు. ఎందరో బాలికలు విద్యావంతులు గావడానికి ఎంతగానో కృషి చేసాడు. ఆయన వితంతు వివాహాలను ప్రోత్సహించాడు. తాను స్వయంగా వితంతు వివాహాలను జరిపించాడు.

వ్యవసాయదారులంటే ఆయనకెంతో యిష్టంగా వుండేది. భూమిపై ఎక్కువ పన్నులు విధించబడినప్పుడు ఆయన ఆందోళన జరిపి వ్యవసాయదారులకు అనుకూలంగా పోరాడాడు.

1864 నాటికి లక్ష్మి నరసు సెట్టి దగ్గర వున్న ధనం అంతా ఖర్చు అయింది. ప్రజా సంఘాల నిర్వహణకు, పత్రికా ప్రచురణకూ, సంఘసేవకు ఆయన తన ఆస్తిపాస్తులన్నింటిని వెచ్చించాడు. తన పూర్వీకులైన తాత, తండ్రుల దగ్గర నుంచీ నీలిమందు వ్యాపారంపై ఆర్జించిన సంపదనంతా ఆయన ప్రజాహిత కార్యక్రమాలకే వినియోగించాడు. తనకంటూ ఏమీ మిగుల్చలేకపోయాడు.

క్రిసెంటు పత్రిక సిబ్బంది ఖర్చులు పెరగడం వల్ల ఆయన వద్ద నున్న ద్రవ్యమంతా హరించుక పోయింది. డబ్బులేనందువల్ల పత్రిక ఆగిపోయింది.

శేషజీవితాన్ని లక్ష్మీనరసు సెట్టి నిరుపేదగా గడపవలసి వచ్చింది. అయినప్పటికీ ప్రజాసేవనూ, సంఘసేవనూ కొనసాగిస్తూనే వచ్చాడు.

లక్ష్మీనరసు సెట్టి వ్యతిరేక కార్యకలాపాల్ని పత్రిక ద్వారా సమాజంలో జరుగుతున్న అన్యాయాలను చీల్చి చెండాడటం ద్వారా ఆయన ఎదుర్కొన్న వ్యక్తిగత కష్టాల్ని బ్రిటిషు అధికార్లు సైతం గమనించి, ప్రశంసించిన సందర్భాలు వున్నాయి.

ఆంగ్లేయుడైన జాన్ బ్రూస్ నార్టన్ యిలా అన్నాడు "లక్ష్మీ నరసు సెట్టి తన తెలివినీ, ధనాన్ని స్వదేశీయుల ఉన్నతి కోసం ధారపోసిన అసలు సిసలైన దేశభక్తుడు అంతేకాదు ఆయన గొప్ప సంఘ సంస్కర్త కూడాను"

లక్ష్మీ నరసు సెట్టి మరణించే నాటికి ఇండియాలో నేషనల్ కాంగ్రెసు కూడా అవతరించి వుండలేదు. ఆయన గతించిన ఒక సంవత్సరం తర్వాత గాంధీజీ జన్మించాడు.

స్వాతంత్ర్య కాంక్షను అప్పట్లో భారతీయులు వూహించనైనా లేని రోజుల్లో గాజుల లక్ష్మీ నరసు సెట్టి స్వదేశీయుల్లో ఆయన స్వాతంత్ర్య జ్యోతికి వత్తినీ, నూనెను అందించాడు. తన జీవితాన్నే వత్తిగా జేసి, తన మేధా సంపదనే నూనెగా అమర్చి ప్రజల్లో స్వాతంత్ర్య జ్యోతిని వెలిగించాడు.

ఈ మహోన్నత వ్యక్తి 1868లో కన్ను మూసాడు.

"తమ సోమా జ్యోతిర్గమయ".

# వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి

1857 నాటి సిపాయిల తిరుగుబాటు స్వరాజ్య ఉద్యమానికి ప్రాతిపదిక అయ్యింది. ఆనాటి నుండి బ్రిటీషువారి పరిపాలన నేరుగా ఇండియాలో ప్రారంభమైంది. అప్పటి దాకా ఈస్టిండియా కంపెని పాలన దేశంలో కొనసాగుతూ వస్తున్నది.

అప్పటికి భారతదేశంలో 500కి పైగా సంస్థానాలు వుండేవి. సంస్థానాధీశులందరూ స్వతంత్రులు. వీరిపై ఈస్టిండియా కంపెనీ ఆధిపత్యం వుండేదికాదు. కానీ సంస్థానాధీశుల స్థితి గతులను బట్టి, కంపెనీతో సంబంధ బాంధవ్యాలు వుండేవి. పూర్వం రాజులు, తమ రాజ్యపాలన చేసుకుంటూ వుండేవారు. కాలక్రమేణా రాజ్యాలు చిన్న చిన్న రాజ్యాలుగా, తదుపరి సంస్థానాలుగా కుంచించుకుపోయాయి.

అలాంటి సంస్థానాలలో ఝాన్సీ ఒకటి. ఝాన్సీ ఉత్తర భారతదేశంలో మధ్య ప్రదేశ్‌లో నెలకొనివుంది. భారతదేశంలోని బలవత్తరమైన కోటలలో ఝాన్సీకోట ఒకటి. కొండమీద శత్రువులకు అలవికాని దుర్గం అది. బలోపేతమైన కోట గోడలు, లోపల విశాలమైన రాజ మందిరాలు, అంతఃపుర మందిరాలు, స్నానవాటికలు, దుర్గాదేవి దేవాలయం, సైనిక శిబిరాలు, అశ్వశాలలు, గజశాలలు, సిబ్బంది వసతి గృహాలతో ఝాన్సీ కోట పటిష్టమైన వ్యూహంతో రూపొందించి, నిర్మింపబడింది.

ఝాన్సీరాజాలు పరాక్రమవంతులు. పట్టుదలకు సాహసానికి పెట్టిందిపేరు. ఎవ్వరికీతలవంచని వీరులు. ప్రజల్ని కన్నబిడ్డల్లా పరిపాలించే వారు. ఝాన్సీరాజు అకాల మరణం చెందిన తరువాత ఝాన్సీరాణి లక్ష్మీబాయి రాజ్యపరిపాలకురాలైంది రాణి పరిపాలన ప్రజలకు ప్రీతిపాత్రంగా సాగింది.

ఝాన్సీ లక్ష్మీబాయి దుర్గాదేవి భక్తురాలు. ఆమె రాజ్యపాలన సాటిరాజుల కే మాత్రం తీసిపోకుండా నిర్వహిస్తూ వుండేది. ఝాన్సీ రాజదంపతులకు సంతానం లేదు. అందువల్ల తన తర్వాత తన రాజ్యానికి వారసులు లేకపోవడం వల్ల ఝాన్సీరాణి ఒక బిడ్డను దత్తత తీసుకొని పెంచసాగింది.

క్రీ.శ. 1846లో గవర్నరు జనరల్‌గా వచ్చిన డల్‌హౌసీ కాలంలో స్వదేశీ సంస్థానాలకు కష్టాలు ప్రారంభమైనాయి. ఇతడు గొప్ప సామ్రాజ్యవాది. యుద్ధాల ద్వారా, రాజ్య సంక్రమణ సిద్ధాంతం ద్వారా ఇతడు అనేక స్వదేశ సంస్థానాలను బ్రిటీషు పాలన క్రిందకు తెచ్చాడు. కొందరు స్వదేశ రాజుల అసమర్థత, దుష్పరిపాలన ఇతనికి మంచి అవకాశమైంది.

రాజ్య సంక్రమణ సిద్ధాంతాన్ని డల్‌హౌసీ అమలు జరిపాడు. మొగలాయీల కాలంలోనే సరియైన వారసుడు లేని సామంత రాజ్యాలను సార్వభౌములు ఆక్రమించుకుంటూ వుండేవారు. యీ ప్రాతిపదిక మీదనే డల్‌హౌసీ స్వదేశీ సంస్థానాలను బ్రిటీషు పాలనలో చేర్చడానికి కుయుక్తితో రాజ్య సంక్రమణ పద్ధతిని రూపొందించాడు. డల్‌హౌసీ కాలంనాటికే సైన్య సహకార ఒడంబికల ద్వారా స్వదేశ రాజులు చాలా మంది ఆంగ్లేయులకు సామంతులయ్యారు.

ఇదే సమయంలో స్వదేశీ సంస్థానాధిపతులలో చాలా మందికి తగిన వారసులు లేకపోవడం కూడా జరిగింది. దత్తత స్వీకారపద్ధతి రద్దు చేయబడింది. అందువలన సంతానం లేని స్వదేశీ రాజుల సంస్థానాలకు ముప్పు ఏర్పడింది. ఈ విధానం ద్వారా సతారా, ఝాన్సీ, జబ్బల్‌పూర్, నాగపూర్, ఉదయపూర్, సంబల్‌పూర్ తదితర సంస్థానాలను డల్‌హౌసీ ఆంగ్ల సామ్రాజ్యంలో చేర్చాడు. రెండవ బాజీరావు దత్త పుత్రుడైన నానా సాహెబ్‌కు భరణం ఆపుచేసాడు. ఈ విధానం ద్వారా స్వదేశీ సంస్థానాల పాలకులు, మతపరమైన ఆచారాలకు దెబ్బతగిలే చర్యల వలన సిపాయిలు, ప్రజలు కూడా బ్రిటిషు పరిపాలనపై తీవ్ర అసంతృప్తి ఏర్పడింది. ఈ అసంతృప్తి 1857 తిరుగుబాటుగా అవతరించింది.

1857 నాటికి ఇండియా పూర్తిగా ఆంగ్లేయులకు స్వాధీనమైంది. ఆంగ్లేయులు తమ స్వంత సైన్యముతో ఇండియా పైన దండెత్తి జయించలేదు. వ్యాపార, వాణిజ్యముల కొరకు వచ్చి, కోటలను కట్టుకొని క్రమంగా దేశ రాజకీయాల్లో తలదూర్చి, కుటిల పద్ధతుల ద్వారా ఇండియాపై పెత్తనం సంపాదించారు. అందువలన దేశ పరిపాలనా నిర్వహణకు కావలసిన సిపాయిలను భారతదేశ ప్రజల నుండే రిక్రూట్ చేసుకొనేవారు. సిపాయిలపట్ల ఆంగ్లేయులు సరియైన పద్దతులను, సామరస్య పూర్వక విధానాలను అవలంభించక పోవడం వల్ల సిపాయిలలో అసంతృప్తిరాజుకొంటూ వస్తున్నది. గతంలో వెల్లూరు, బారక్‌పూర్‌లలో స్వల్ప కారణాలకే సిపాయిలు తిరగబడ్డారు. అయితే 1857 తిరుగుబాటు దేశ చరిత్రనే కొత్త మలుపు త్రిప్పింది.

1857 తిరుగుబాటులో సిపాయిలు, స్వదేశీ సంస్థానాధిపతులు, ప్రధానంగా పాల్గొన్నారు. కొందరు చరిత్ర కారులు 1857 తిరుగుబాటును భారత జాతీయ స్వాతంత్ర్య పోరాటంగా కూడా వర్ణించారు.

డల్‌హౌసీ అమలు జరిపిన స్వదేశీ సంస్థానాల స్వాధీన విధానం ద్వారా రాజ్యాలను కోల్పోయిన స్వదేశ రాజులు ఆంగ్ల ప్రభుత్వంపైన కక్ష వహించి తిరుగుబాటు చేసి, బ్రిటిషు వారి ఆదేశాలను ఖాతరు చేయకుండా వుండేందుకు

నిర్ణయించుకున్నారు. వీరిలో ఝాన్సీరాణి, నానాసాహెబ్, అయోధ్య ప్రభువు ముఖ్యులు.

1857 తిరుగుబాటుకు సారధ్యం వహించింది ఝాన్సీలక్ష్మీబాయే. ఈమె తమ సాంప్రదాయకమైన ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకునేందుకు, పట్టుదలతో సాటి స్వదేశీ రాజులను ప్రోత్సహించి, సిపాయిలను రెచ్చగొట్టి 1857 తిరుగుబాటును ధైర్యసాహసాలతో నడిపింది.

స్వదేశీ రాజులకే గాక ఇండియాలో అన్ని తరగతుల ప్రజలకూ ఆంగ్ల ప్రభుత్వం పట్ల ద్వేషం ఏర్పడింది. మొగలుల కాలంలో వంశ పారంపర్యంగా ఉద్యోగాలను నిర్వహిస్తూ సకల సౌకర్యాలు పొందిన జమీందారులు, తాలూకాదారులు, ఠాణేదార్లు తదితరులు బ్రిటీషువారి కాలంలో తమ తమ ఉద్యోగాలను, పదవుల్ని కోల్పోయారు. ఇండియాలో బ్రిటిషువారు భారీ పరిశ్రమలను నెలకొల్పడం వల్ల గృహ పరిశ్రమలు, చేతి వృత్తులు నశించి నిరుద్యోగుల సంఖ్య నానాటికీ పెరగ సాగింది.

బ్రిటిషు వారు ఇంగ్లీషు భాషను రాజభాషగా చేసి నందుఌ దేశభాషలు స్వయం ప్రతిపత్తిని కోల్పోయాయి. పాఠశాలల్లో, కార్యాలయాల్లో ఇంగ్లీషు భాష వాడుక భాషగా తయారైంది. దీనికి తోడు క్రిష్టియన్ ఫాదరీలు హిందూ ముస్లిం మతాలను తీవ్రంగా విమర్శిస్తూ, ప్రజల్ని క్రిష్టియన్ మతంలోకి చేర్చేందుకు వత్తిడి తేసాగారు. క్రిష్టియన్ మతంలోకి చేరినవారికి, వారి పిత్రార్జితంపై కూడా హక్కులు పొందే శాసనాన్ని కూడా ప్రభుత్వం చేసి పెట్టింది. మతం మార్చుకొనే వారికి ప్రలోభాలను చూపెట్టి, ప్రజలను మతాంతీకరణ పొందేందుకు పెద్ద ఎత్తున క్రిష్టియన్ సంస్థలు పూనుకున్నాయి. ఇందువలన తమ మతానికి ముప్పు కలుగుతున్నదని హిందూ, ముస్లిం మతస్థులు ఆందోళన చెందారు. 1857 తిరుగుబాటులో ప్రజలు సైతం పాల్గొడానికి ఏర్పడిన కారణాల్లో యివి కొన్ని మాత్రమే.

1857 తిరుగుబాటును సిపాయీల తిరుగుబాటుగా భారతీయ చరిత్రకారులు అభివర్ణించాడానికి తిరుగుబాటును సిపాయిలు ప్రారంభించడమే ప్రధాన కారణం. బ్రిటిషు ప్రభుత్వంపై సిపాయిలు తిరుగుబాటుకు అనేక కారణాలు ప్రాతిపదిక అయ్యాయి. ఆంగ్ల సైన్యంలో ఇండియన్ సోల్జర్సే ఎక్కువ. సైన్యాధికారులు, పెద్ద పెద్ద మిలిటరి ఉద్యోగాలన్నీ తెల్లదొరలకు లభించేవి. ఆంగ్ల సైనికులతో పోల్చుకుంటే, ఇండియన్ సోల్జర్ల జీతభత్యాలు చాలా తక్కువగా వుండేవి. నేటి బర్మా, శ్రీలంక దేశాలు కూడా అప్పటి బ్రిటిషు సామ్రాజ్యంలో అంతర్భాగంగా వుండేవి. గనుక సిపాయీలు తరచూ సముద్రయానం ద్వారా ఆయా దేశాలకు

వెళ్లవలసి వచ్చేది. సముద్రయానం హిందూ మతాచారాలకు అప్పట్లో నిషిద్ధంగా వుండేది. సాటి ముస్లిం దేశాలల్లో యుద్ధాలు చేయవలసి వచ్చినప్పుడు ఇండియన్ ముస్లిం సోల్జర్సు, సాటి ముస్లింలతోనే యుద్ధం చేసి చంపవలసి వచ్చేది.

అదీగాక సిపాయీలకిచ్చే తూటాలపై ఆవు కొవ్వు, పంది కొవ్వు పూయబడుతూ వుండేది. ఆవు హిందువులకు పవిత్రమైనది, పంది ముస్లింలకు అసహ్యకరమైనది. తమతమ విశ్వాసాలను నాశనం చేయడానికే బ్రిటిషు ప్రభుత్వం యీ విధంగా ప్రవర్తిస్తున్నదని హిందూ ముస్లిం సైనికులకు కలిగింది. వారిలో అంతకు మునుపే చోటు చేసుకున్న అసంతృప్తి తారాస్థాయికి చేరుకున్నది.

సిపాయిల్లో వున్న ఈ అసంతృప్తిని ఝాన్సీలక్ష్మీబాయి పసిగట్టింది. ఇట్టి పరిస్థితుల్లో ఇంగ్లీషువారిపై తిరుగుబాటు జరపడం చాలా తేలికగా ఝాన్సీరాణి భావించింది. నానాసాహెబ్, తాంతియాతోపే, అయోధ్యా నవాబు తదితర సంస్థానాధిశుల్ని కూడగట్టిది. ఒక వైపు నుంచి సంస్థానాధీశులు బ్రిటిషు ప్రభుత్వంపై తిరగబడతారనీ, సరిగ్గా అదే సమయంలో సిపాయిల కూడా తిరుగుబాటు చేసి, సహకరించాలనీ సిపాయీ నాయకులతో సంప్రతింపులు జరిపింది. నానాసాహెబ్, తాంతియాతోపేలు మహారాష్ట్ర తదితర ప్రాంతాల్లోనూ, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్‌లలో ఝాన్సీరాణి, ఈశాన్య ప్రాంతంలో అయోధ్య నవాబు తిరుగుబాటుకు నాయకత్వం వహించాలనే పథకం సిద్ధం చేయబడింది.

1857 మార్చి 29 ఖరక్‌పూర్‌లో తిరుగుబాటు ప్రారంభమైంది. అయితే తిరుగుబాటుకు అన్ని ప్రాంతాలలో ఏకకాలంలో ప్రారంభించాలని నిర్ణయించుకున్న తేదీకి, ముందుగానే మంగళ్‌పాండే అను సిపాయి ఆవేశాన్ని అణుచుకోలేక, ఉద్రేకంలో బ్రిటిషు ఉద్యోగిని కాల్చివేసాడు. యీ విధంగా ప్రారంభమైన తిరుగుబాటు మిగతా ప్రాంతాలకు వ్యాపించింది. ఢిల్లీలో బహదూర్‌షా, లక్నోలో నానాసాహెబ్, ఝాన్సీ ప్రాంతాలలో ఝాన్సీరాణి, తాంతియాతోపేలు తిరుగుబాటుకు నాయకత్వం వహించారు.

బ్రిటిషు ప్రభుత్వం సిపాయిల తిరుగుబాటును సకాలంలో గ్రహించి, తీవ్ర చర్యలు తీసుకొని అణచివేసింది. మంగళ్‌పాండే ఉద్రేక చర్యతో బ్రిటిషు ప్రభుత్వం జాగ్రత్త పడింది. ఒక వైపు సిపాయిలను అణచివేస్తూనే, బ్రిటిషు ప్రభుత్వం తిరుగుబాటుకు నాయకత్వం వహించిన సంస్థానాధీశుల సంస్థానాలపైకి సైన్యాన్ని పంపింది.

ఝాన్సీ సంస్థానాన్ని బ్రిటిషు సైనికులు చుట్టుముట్టాయి. ఝాన్సీ లక్ష్మీబాయి తన సైన్యాన్ని సమాయత్త పరిచి, బ్రిటిషు సైన్యాన్ని ఎదుర్కొన్నది.

కొండ దిగువ ప్రాంతంలో చుట్టు ముట్టిన బ్రిటిషు సైనికులను, కొండపైకి, కోటలోపలికి జొరబడకుండా నిరోధించింది. కోట చుట్టూ గల అగడ్తలను జాగ్రత్త చేసింది. ఝూన్సీ పట్టణంలోనూ, పరిసర సంస్థానంలోని గ్రామాల్లోనూ ప్రజల సహకారంతో బ్రిటిషు సైన్యాలపై వీరోచితంగా విరుచుక పడింది. కానీ అపారమైన బ్రిటిషు సైన్యం ఆధునిక ఆయుధ సామాగ్రితో, ఫిరంగులతో ఝూన్సీ సైన్యాన్ని నిర్వీర్యం చేస్తూ, ఎక్కడికక్కడ పట్టణాన్ని, గ్రామాలను స్వాధీనం చేసుకుంటూ, కొండమీద గల కోటపైకి చొచ్చుకపోయాయి.

ఝూన్సీలక్ష్మి తన దత్త పుత్రుడ్ని వీపుకు కట్టుకొని పంచకళ్యాణి గుర్రం మీద, కత్తి చేతపట్టి, సైన్యాన్ని పురికిస్తూ అపరకాళీదేవిలా బ్రిటిషు సైన్యంపై పడింది. కానీ ఎక్కువ రోజులు బ్రిటిషు సైన్యాన్ని నిరోధించ లేకపోయింది. కోటచుట్టూ బ్రిటిషు సైనికులు లెక్కకు మిక్కుటంగా ఫిరంగులతో, తుపాకులతో కోట గోడలను బ్రద్దలు కొడుతూ, కోట లోపలికి చొచ్చుకరావడానికి సిద్ధంగా వున్నాయి.

ఇక ఎంతమాత్రం కోటను రక్షించుకోలేమని ఝూన్సీ రాణి భావించింది. ప్రాణాలతో బ్రిటిషు సైనికులకు పట్టుబడకూడదని నిర్ణయించుకున్నది. తమ కులదేవత అయిన దుర్గాదేవికి పూజలు చేసింది. దత్తపుత్రున్ని వీపుకు కట్టుకుంది. శిరస్త్రాణాలు ధరించింది. కత్తి, డాలు చేత పట్టింది. గుర్రం మీద, తన సైన్యాన్ని కవాతు చేయించి, కోటను రక్షించుకోవడానికి తుది ప్రయత్నం చేయసాగింది.

ఝూన్సీరాణి ప్రయత్నం ఫలించలేదు. చూస్తూ వుండగనే బ్రిటిషు సైనికులు కోట లోపలికి చొచ్చుకొని వచ్చాయి. ఝూన్సీలక్ష్మి "జై భవానీ" అంటూ గుర్రాన్ని అదిలించి, ఎత్తైన కొండమీది నుంచి, క్రిందికి దూకించింది. గాలిలో ఊదినట్లు పంచకళ్యాణి గుర్రం ఎగిరి నేలమీదపడింది. గుర్రం, దత్తపుత్రునితో సహా ఝూన్సీలక్ష్మి ఎత్తైన కొండమీచి నేలమీద పడి స్వచ్ఛంద మరణం పొందింది. తదుపరి అదే ప్రదేశంలో నెలకొల్పబడిన గుర్రంమీద కూచుని వున్న ఝూన్సీరాణి నల్లని కంచు విగ్రహాన్ని మనం దర్శించవచ్చును. వీరనారి ఝూన్సీలక్ష్మిబాయి స్వాతంత్ర్య పోరాటంలో వీరోచితమైన వీరమరణం చెందింది. ఒక సముజ్జ్వలమైన ఘట్టం ముగిసింది.

ఇదే విధంగా ఢిల్లీ, బహదూర్‌షా, నానాసాహెబ్, తాంతియాతోపేలు సైతం వీరమరణం చెందారు.

ఉవ్వెత్తున ఎగసిన సిపాయిలు ప్రారంభించిన 1857 తిరుగుబాటు విఫలమైంది.

తిరుగుబాటు విఫలంగావడానికి అనేక కారణాలు తోడైనాయి. సిపాయిలలో ఐక్యమత్యం లేకపోవడం, తిరుగుబాటు సేనలకు ఆధునిక ఆయుధ సంపత్తి లేకపోవడం, తిరుగుబాటు ఉత్తర భారతదేశానికే పరిమితం కావడం ప్రధాన కారణాలయ్యాయి.

"ఆంగ్లేయులు యిక మీదట స్వదేశీ సంస్థానాల జోలికిరారు. సంతతిలేని స్వదేశ రాజులు దత్తత తీసుకొని, తమ వారసునికి రాజ్యాన్ని సంక్రమింప జేసుకొనమచ్చును. దత్తత స్వీకార పద్ధతి పునరుద్ధరింపబడింది. ప్రజల మత, సాంఘిక విషయాలలో ప్రభుత్వం జోక్యం చేసుకోదు"

విక్టోరియారాణి ప్రకటన 1857 తిరుగుబాటు ఫలితమే. అంతేగాదు. ఇప్పటితో ఈస్టిండియా కంపెనీ పరిపాలన రద్దు అయ్యింది. బ్రిటిషు ప్రభుత్వమే నేరుగా ఇండియాను పరిపాలిస్తున్నట్లు ప్రకటన గావించింది. విక్టోరియా రాణి పరిపాలన ఇండియాలో ప్రారంభమైంది ఇంగ్లండులో ఒక ఇండియా కౌన్సిలు నియమింపబడింది. దాని నిర్వహణకు ఇండియా కార్యదర్శి (సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా) నియమింపబడినాడు. గవర్నరు జనరల్‌కు యిక మీదట వైస్రాయి పదవి కూడా లభిస్తుంది. 1857 తిరుబాటు వల్ల ఈస్టిండియా కంపెనీ పరిపాలన అంతమై బ్రిటిషు రాణి నేరుగా ఇండియాను పరిపాలించుటకు నిర్ణయం కావడం దేశ చరిత్రలో పెద్దమలుపు అని చెప్పవచ్చును.

అంతేగాకుండా జాతీయోద్యమం బలపడింది. ఆంగ్లేయులతో జరిపిన సాయుధ పోరాటం విఫలమగుట వలన, యిక మీదట చట్ట బద్ధమైన జాతీయోద్యమాన్ని ప్రారంభించాలనే ఆలోచన భారతీయ మేధావులలో, విద్యావంతులలో కలిగింది.

1-11-1858వ తేదీన అలహాబాద్‌లో విక్టోరియారాణి ప్రకటనను ఒక దర్బారు జరిపి, ఇండియాకు వైస్రాయిగా వచ్చిన కానింగ్ ప్రభువు ప్రజలకు చదివి వినిపించాడు. 1861లో ఇంగ్లీషు పార్లమెంటు చేసిన శాసనం ప్రకారం వైస్రాయి సలహా సంఘంలో భారతీయ సభ్యుడు చేర్చుకొనబడినాడు.

భారతీయ జాతీయోధ్యమానికి అంకురార్పణ ఏర్పడడానికి ప్రధానకారణమైన 1857 తిరుబాటు భారత స్వాతంత్ర్యపోరాట చరిత్రలో అజరామరంగా నిలిచిపోయింది. వీరనారి ఝాన్సీలక్ష్మిబాయి పోరాటగాథ ముందు తరాల ప్రజలకు ఆదర్శనీయమైంది.

వీరనారి ఝాన్సీలక్ష్మిబాయి ఇంగ్లండులోని విక్టోరియారాణి కళ్లు తెరిపించింది. బ్రిటిష్ సింహాసనాన్ని ఊగించి, ఊపివేసింది. ఝాన్సీలక్ష్మి వీరోచిత మరణం భారత స్వాతంత్ర్య చరిత్రలో సముజ్జ్వల ఘట్టమై భాసించింది.

భారతీయ మహిళల శౌర్య సాహసాలకు ఝాన్సీలో లక్ష్మిబాయి ప్రతిబింబంగా వన్నెకెక్కింది.

# లోకమాన్య బాలగంగాధర తిలక్

"స్వరాజ్యం నా జన్మహక్కు" అనే నినాదంతో దేశ ప్రజల్ని ఉర్రూతలూగించిన బాలగంగాధర తిలక్ కొంకణ ప్రాంతంలో రత్నగిరి అనే గ్రామంలో 1856 జులై 23వ తేదీన ఒక సామాన్య కుటుంబంలో జన్మించాడు.

ఆయన తండ్రి సామాన్యమైన బడిపంతులుగా ఒక చిన్న పాఠశాలలో ఉపాధ్యాయునిగా పనిచేస్తు వుండేవాడు. సంస్కృతంలోనూ, గణితశాస్త్రంలోనూ ఆయన మంచి పండితుడు.

సనాతన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించినందున తిలక్ బాల్యం, ప్రాథమిక విద్య సాంప్రదాయికంగా గడిచింది.

తిలక్ పదవ ఏట తన తండ్రికి రత్నగిరి నుంచి పూనా పట్టణం బదిలీ అయింది. తిలక్‌కు పూనాలో మేధావుల దగ్గర చదువుకొనే అవకాశం లభించింది. తిలక్‌కు పదహారో ఏడు వచ్చేటప్పటికి, మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసై దక్కను కళాశాలలో చేరాడు. ఆసంవత్సరంలోనే తిలక్ తండ్రి మరణించాడు. తండ్రి మరి కొద్ది నెలల్లో చనిపోతాడనగా, తిలక్ వివాహం జరిగింది. తిలక్ పదవ ఏటనే తల్లి గతించింది. పిన్న వయస్సులోనే తిలక్ తన తల్లి దండ్రుల్ని కోల్పోయాడు.

అయినా తిలక్ తన చదువు పైన ఏ మాత్రం అశ్రద్ధ చూపించలేదు. గ్రుడ్డిగా నమ్మడం, మూఢాచారాలు తిలక్‌కి గిట్టేవికావు. మొదటి నుండి స్వతంత్ర భావాలతో పెరిగాడు. చదువుకొనే రోజుల్లో ఆయన వ్యాయామానికి ప్రాముఖ్యత నిచ్చేవాడు. కాలేజీలో చదివేనాటికి దృఢమైన శరీరం పొందగలిగాడు. ఆరోగ్యం విద్య ప్రతి మనిషిని ప్రయోజకుడ్ని చేస్తాయని ఆయన నమ్మేవాడు.

చదువు పూర్తి అయ్యాక తన కర్తవ్యాని గురించిన ఆలోచన తిలక్‌లో ప్రారంభమైంది. అతనికి మంచి స్నేహితుడైన అగర్కార్‌తో కలిసి భవిష్యత్తును గురించి చర్చించేవాడు. అప్పట్లో దేశ పరిస్థితిని గురించి, రాజకీయాల గురించి తిలక్ తీవ్రంగా ఆలోచిస్తూ వుండేవాడు.

1877లో తిలక్ బి.ఏ.లో గణితశాస్త్రంలో ప్రథమ శ్రేణిలో ప్యాసైనాడు. తరువాత రెండు సంవత్సరాల్లో ఎల్.ఎల్.బి. కూడా ప్యాసయినాడు.

ఒకవైపు దేశ పరిస్థితి, రాజకీయాలపట్ల ఆసక్తి, మరొక వైపు తన కర్తవ్యం గురించే ఆలోచనలు తిలక్‌లో అధికం కాసాగాయి.

1880లో తన స్నేహితుడైన అగర్కార్‌తో కలిసి తిలక్ ఒక పాఠశాలను నెలకొల్పాడు. కొద్ది కాలం తర్వాత ఉన్నత చదువు కోసం అగర్కార్ వెళ్లిపోయాడు. తిలక్ నిరుత్సాహపడకుండా చిప్లంకర్, నామ్‌జోషి మహాదేవ్ భిల్లాన్ తదితరుల సహకారంతో పాఠశాలను అభివృద్ధి పరిచాడు. క్రమంగా విద్యార్థుల సంఖ్య పెరిగింది. ఆ విధంగా నిరంతర కృషితో నాలుగు సంవత్సరాల్లో పూనాలో ప్రభుత్వం వారిచే నడపబడే పాఠశాల స్థాయికి, తిలక్ తన విద్యా సంస్థను తీర్చిదిద్దాడు. 1882లో అతని సహచరుడు చిప్లంకర్ చనిపోవడంతో తిలక్ చాలా బాధపడ్డాడు.

కొంతకాలానికి తిలక్ దృష్టి పత్రికా రంగం పైకి మరలింది. బ్రిటిష ప్రభుత్వం అక్రమాల, ప్రజల యిబ్బందులు, ప్రభుత్వ అక్రమాల్ని ఎదిరించే సంఘటనల్ని ఆనాటి పత్రికలు ప్రచురించేవి కావు. ప్రభుత్వానికి వంతపాడే ధోరణే ఎక్కువగా వుండేది. ఈ పరిస్థితిని తిలక్ గమనించి, నిర్భయంగా ప్రభుత్వ అన్యాయాల్ని ఎదిరించి, ప్రజలకు అండగా నిలిచే పత్రికలను నెలకొల్పాలని ఆలోచించాడు.

'మరాఠా' అనే పత్రికను తిలక్ నెలకొల్పాడు. అతని స్నేహితుడు అగర్కార్ కేసరి అనే పత్రికను స్థాపించాడు. వీరిద్దరూ కలసి కట్టుగా ఒకే ఆలోచన, ఆశయం కలిగి వున్నందున పత్రికల్ని సమర్థవంతంగా ప్రభుత్వానికి వ్యతిరేకంగా, ప్రజలకు అనుకూలంగా నడపడం సాగించారు.

అప్పట్లో కొల్హాపూర్ సంస్థానంలోని రాజరిక కుటుంబం మధ్య జరిగిన రగడను తిలక్ ఉన్నది ఉన్నట్టుగా రాసి సంచలనం సృష్టించాడు. రాజమాత మూలంగా అప్పటి కొల్హాపూర్ మైనరు రాజుకు జరుగుతున్న అన్యాయాల్ని తిలక్ బయట పెట్టాడు. తన కుటుంబ రహస్యాలు బయటకిడ్చాడనే నేరం మోపి రాజమాతకోర్టులో తిలక్‌పైన పరువు నష్టం కేసు వేసింది. రాజకుటుంబానికి అనుకూలంగా వుండే జడ్జి 1887 జూలై 17న తిలక్‌కు నాలుగు మాసాల జైలు శిక్ష విధించాడు. ఈ సంఘటనతో తిలక్ దేశం నలుమూలల ప్రజానీకానికి తొలిసారిగా పరిచయం అయ్యాడు. నిర్భయంగా నిజాన్ని బయటపెట్టే నిజాయితీ గల సంపాదకునిగా తిలక్ ప్రజల చేత ప్రశంసింపబడినాడు.

తాను స్థాపించిన పాఠశాలను కళాశాలగా రూపొందించేందుకు తిలక్ కృషి చేశాడు. బొంబాయి గవర్నరు జేమ్స్ ఫెర్గూసన్ సహాయసహకారాలతో తిలక్ 1885 జనవరి 2వ తేదీ సర్ ఫెర్గూసన్ కళాశాలగా దక్కను విద్యాసంస్థను మార్పు చేశాడు. తిలక్ కళాశాలలో గణిత శాస్త్రాచార్యునిగా పనిచేసాడు. ఈ కళాశాల అభివృద్ధికి పాటుపడిన వారిలో గోపాలకృష్ణ గోఖలే కూడా వున్నారు. సార్వజనిక

సభ కార్యదర్శిగా అప్పుడే గోపాలకృష్ణ గోఖలే ఎన్నుకోబడినాడు. కొంతకాలానికి ముక్కుకు సూటిగా వ్యవహరిస్తూ నిజాయితీతో వుండే తిలక్ దక్కన్ విద్యా సంస్థ నిర్వాహకులలో సరిపడక బయటకు వచ్చేసాడు.

"మరాఠా", కేసరి పత్రికలకు ప్రజల ఆదరణ అయితే వుంది గానీ, ఆర్థికంగా పత్రికలు నిర్వహణ తిలక్‌కు కష్టంగా వుండేది. 1886లో తిలక్ పత్రికలను తన అభిప్రాయాలకు అనుగుణంగా నడిచే మరొకరికి దాఖలు పర్చడం జరిగింది. అయితే 1887 లో తిలక్ తిరిగి కేసరి పత్రిక సంపాదకత్వ బాధ్యతను స్వీకరించాడు.

తిలక్ జాతీయవాది. తన దేశంపట్ల, తన జాతిపట్ల తిలక్ అభిమానంతో,- గర్విస్తు వుండేవాడు. అప్పట్లో విదేశీ మిషనరీలు కొనసాగించే మతం మార్పిడి ధోరణులు, క్రైస్తవ ప్రచారాల్ని తిలక్ యీసడించుకొనేవాడు. 'బ్రహ్మసమాజం' దేశంలో అప్పటికి బహుళ వ్యాప్తిలో వుంది. ఆర్య సమాజం ఏర్పడి హైందవ సమాజంలో విన్నూత్న భావాలతో ముందుకు సాగుతోంది.

పండిత రమాబాయి అనే ఆమె క్రైస్తవ మతంలో చేరడమే గాకుండా 'శారదా సదన' అనే ఒక పాఠశాల నడుపుతూ తన వద్దకు వచ్చే విద్యార్థినులను ఆ మతంలో చేరవలసిందిగా ప్రోత్సహించేది. పండిత రమాబాయి కార్యకలాపాలను, విదేశీ మిషనరీల అఘాయిత్యాలను తిలక్ ఎదుర్కొన్నాడు. 'స్త్రీలు ఎంత చదువుకున్నా, పండితులు అయినా స్త్రీ విద్య పేరుతో సంఘాన్ని కలుషితం చేయడం సహించరాని దంటూ పండిట్ రమాబాయి చర్యలు హిందువులకూ, హిందూ మతానికే సిగ్గుచేటని బాలగంగాధర తిలక్ ఆమె చర్యలను ఖండించాడు. ఈ కారణంగా తిలక్‌కి స్త్రీలు విద్యావంతులుగా రూపొందడం యిష్టంలేదని అపవాదు వచ్చింది.

అంటరాని తనానికి వ్యతిరేకంగా తిలక్ పోరాడాడు. "నిజంగా అంటరానితనం అనేది దేవుని దృష్టిలో లేదు. ఒక కళ వుంటే ఆ దేవునితో నాకు ఎటువంటి సంబంధంలేదు' అని తిలక్ స్పష్టం చేసాడు.

కొన్నాళ్లకు తిలక్ పూనా పట్టణం కౌన్సిలర్‌గానూ, బొంబాయి యూనివర్శిటీ సెనేట్ సభ్యుడిగానూ, బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యునిగానూ ఎన్నుకోబడినాడు. అప్పుడే సార్వజనిక సభ నిర్వహణ ఆయన చేతికి వచ్చింది.

1896లో గొప్ప కరువు వచ్చింది. పంటలులేక జీవించటం కష్టంగా వున్న రోజుల్లో తిలక్ రైతుల పక్షాన ప్రభుత్వంతో మాట్లాడి వారికి ఎంతగానో సహాయ పడినాడు. ఈ దశలోనే తిలక 'ఓరియన్' అనే గ్రంథం రాసాడు.

1895 నాటికి సార్వజనిక సభను తిలక్ తీర్చిదిద్ది ప్రజల సంస్థగా దానిని

రూపొందించాడు. బాలగంగాధర తిలక్ రాజకీయాల్లో ప్రవేశించిన అయిదు సంవత్సరాల నాటికి గానీ కాంగ్రెసు జాతీయ సంస్థ ఏర్పడలేదు. యీ అయిదేళ్లు కూడా తిలక్ కాంగ్రెసు సమావేశాలకుగానీ, సభలకు గానీ వెళ్లేవాడు కాదు.

1889లో జరిగిన బొంబాయి కాంగ్రెసు మహాసభకు తిలక్ హాజరైనాడు. ఆ సంవత్సరమే గోపాలక్రిష్ణ గోఖలే, లాలాలజపతిరాయ్ వంటి నాయకులు వేదికల మీద ప్రసంగించారు.

తిలక్ కాంగ్రెసు సమావేశాలను గురించి రాస్తూ, కాంగ్రెసు పార్టీ రాజకీయంగా ముందుకు పోవాలనీ, గాజకీయ సంస్కరణలను సాధించాలని తెలియజేస్తూ వుండేవాడు. 1889 నుండి తిలక్ ప్రతి సంవత్సరం కాంగ్రెసు మహాసభలకు హాజరవుతూ వుండేవాడు.

1892లో నాగపూర్ కాంగ్రెసు మహాసభలో 'ఆయుధాల చట్టం' యొక్క తీర్మానాన్ని ప్రవేశపెట్టే గౌరవం తిలక్‌కు దక్కింది.

మహారాష్ట్రలో జాతి ఐక్యతకు, సంఘటితంగా రూపొందించడానికి తిలక్ విశేషంగా కృషిచేసాడు. తిలక్ పండితుడు విద్యావేత్త. భారతీయ సమాజం పట్ల ఎనలేని గౌరవ విశ్వాసాలు కలవాడు.

ఆర్యుల పూర్వనివాసం గురించి, వేద ప్రామాణ్యాన్ని గురించి విపులంగా పరిశోధించి గ్రంధాలు రచించాడు. మాతృదేశంపట్ల ఎనలేని విశ్వాసాలు కలవాడు.

ఛత్రపతి శివాజీ ఉత్సవాలను వైభవంగా జరిపించే కార్యక్రమాలకు శ్రీకారం చుట్టిన వాడు తిలక్. మహారాష్ట్ర వీరునిగా శివాజీని చిత్రిస్తూ, శివాజీ వీరత్వాన్ని, దేశభక్తినీ ప్రజలకు తెలయపరుస్తూ శివాజీ ఉత్సవాలు జరిపించేవాడు. గణపతి పూజలను కూడా తిలక్ పెద్ద ఎత్తున జరిపేందుకు కారకుడైనాడు. శివాజీ ఉత్సవాలు, గణపతి పూజలు జరిపిస్తూ ప్రజలకు దేశం పట్ల భక్తినీ, జాతీయతను కలిగిస్తూ వారిలో జాతీయతాభిమానాన్ని పెంపొందించాడు. నేడు మహారాష్ట్రలో గణపతి పూజలు పెద్ద ఎత్తున జరగడానికి ఆనాటి తిలక్ కృషి ప్రధాన కారణం.

1890లో హిందువులకూ, మహమ్మదీయులకూ పెద్ద ఎత్తున మత కలహాలు జరిగాయి. 1893 దాకా జరిగిన మతకలహాల్లో బొంబాయిలో పెద్ద ఎత్తున ఆస్తి ప్రాణనష్టాలు జరిగినాయి. ఆ సందర్భంలో తిలక్ రూపొందించిన గణపతి పూజలు, శివాజీ వేడుకలు హిందువుల్లో ఐక్యతకు ప్రాతిపదిక అయ్యాయి.

ఈ సందర్భంలోనే ఉత్సవ సమయంలో శివాజీ పౌరుషం, అఫ్జల్‌ఖాన్‌ను శివాజీ వధించిన ఘట్టం గురించి బహిరంగ సభలో తిలక్ వుపన్యాసం యిచ్చి ప్రజల్ని రెచ్చగొట్టాడనీ కేసరి పత్రికలో వ్యాసాలు రాసాడనీ నేరం మోపి బ్రిటిషు ప్రభుత్వం తిలక్ పైన రాజ ద్రోహ నేరం మోపింది.

1896లో మహారాష్ట్రలో మరొకసారి కరువు రక్కసి విరుచుకుపడి పంటలు లేవు. రైతులు విపరీతంగా బాధలకు గురి అయ్యారు. తిలక్ రాష్ట్రం అంతటా పర్యటించి, బహిరంగ సభల ద్వారా వుపన్యాసాలిస్తూ, సార్వజనిక సభలోని యువకులను కరువు ప్రాంతాలకు పంపి, అక్కడ రైతులు పడే భాధలు, కరువువల్ల కలిగిన నష్టాల వివరాలను తెప్పించి, కేసరి పత్రికలో ప్రచురిస్తూ రైతులకు అండగా నిలిచాడు. రైతులకు సహాయ పడవలసిందిగా ప్రభుత్వంతో వాదించేవాడు. ప్రభుత్వం అక్రమాల్ని, కరువు వాత పడ్డ రైతుల్ని పన్నులు కట్టాల్సిందిగా ప్రభుత్వం జరిపే అక్రమాల్ని బయటపెడుతూ మహారాష్ట్ర భాషలోకి తర్జుమా చేసి, కరపత్రాలు వేసి ప్రజలకి పంచిపెట్టి రైతులకు ధైర్యం చెబుతూ వుండేవాడు.

తిలక్ రైతులను సంఘటిత పరిచి జరిపే ఉద్యమం మూలంగా ప్రజల్లో ఉద్రేకం పెరిగి బ్రిటిషు ప్రభుత్వం పట్ల వ్యతిరేకత పెరిగి గుంపులు గుంపులుగా ప్రజలు గుమికూడుతూ ప్రభుత్వానికి, వ్యతిరేకంగా ఎదురు నిలిచారు. రైతులు పన్నులు చెల్లించరాదనీ, ప్రభుత్వాన్ని ఎదిరించాలని రైతులకు బోధించడం జరిగింది.

తిలక్ అనుచరులు బహిరంగంగా రైతులకు అనుకూలంగా ఉద్యమాలు లేవదీసారు. ప్రభుత్వం తిలక్ అనుచరులను అరెస్టు చేయడం మొదలెట్టింది.

" ప్రభుత్వం అక్రమాలను ప్రజలకి వివరించి చెప్పి, రైతులను సంఘటిత పరిచిన ఉద్యమానికి బాధ్యుడను నేను. నా అనుచరులు నేను చెప్పినట్టు చేసారు. కనుక యీ విషయంలో నా అనుచరుల్ని అరెస్టు చేయడం మానుకొని నన్నే అరెస్టు చేయండి తిలక్ బ్రిటిషు ప్రభుత్వాన్ని సవాల్ చేసాడు. ఈ సందర్భంలో తిలక్ నడిపిన ప్రజా ఉద్యమాల్లో కలెక్టరు కూడా దిగివచ్చి తిలక్ ప్రధాన అనుచరుడైన పంజపే, తదితరులను విడుదల చేసారు. ఈ సంఘటన తిలక్ రాజకీయ జీవితంలో ప్రధాన ఘట్టంగా నిలిచింది. తిలక్ నడిపిన రైతు ఉద్యమ ప్రభావం దేశం మొత్తం మీద ప్రసరించింది.

1897లో పూనాలో ప్లేగు వ్యాధి వ్యాపించింది. ప్రతిరోజూ వందలాది మంది ప్లేగు వ్యాధికి బలి అయ్యేవారు. ప్లేగు వ్యాధిని అణచి వేసే మిషతో ప్రభుత్వం ప్రజల యిళ్లల్లో చొరబడి అకృత్యాలు జరపడం చేసేది. ప్రభుత్వం అధికార్లు ఎంతో అమానుషంగా ప్రవర్తించేవారు. ఈ సందర్భంలో తిలక్ వారి అనుచరులూ ప్లేగు వ్యాధికి భయపడకుండా రోగులకు సహాయపడుతూ ప్రాణాలకు తెగించి వారికి సహాయం చేసారు.

అతి కష్టం మీద ప్లేగు వ్యాధి అణిగిపోయింది. ఒకనాడు విక్టోరియా రాణి యిచ్చిన విందుకు హాజరై తిరిగి వస్తున్నప్పుడు యీ ప్లేగు వ్యాధి విషయంలో రోగులను నిర్ధారణ చేసే అధికారినీ అతడి స్నేహితుడినీ ఎవరో హత్య చేసారు.

ఈ హత్యలను బ్రాహ్మణులే చేయించారనీ, వారే బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయాలని చాలాకాలం నుంచీ ప్రయత్నిస్తున్నారనీ. వారిలో చదువుకొన్న వారే యీ విధమైన తిరుగుబాటును చేయిస్తున్నారనీ ప్రభుత్వానికి కొందరు పనికట్టుకొని ప్రచారం చేసి పెట్టారు. ఈ హత్యలో తిలక్‌కు కూడా భాగముందనే అభిప్రాయంతో బ్రిటిషు ప్రభుత్వం 1897 జూన్ 22న రాజద్రోహం నేరంక్రింద తిలక్‌ని అరెస్టు చేసింది. కేసరి పత్రిక ద్వారా తిలక్ ప్రజల్ని రెచ్చగొడుతున్నాడనీ, అందువల్లనే ప్రజలు రెచ్చిపోయి ప్రభుత్వానికి వ్యతిరేకమైన పనులు చేస్తున్నారనీ ప్రభుత్వం ఆరోపణలు చేసింది. తిలక్ అరెస్టు అయ్యారని తెలియగానే రైతులంతా కదిలి వచ్చారు. ఏభై వేల రూపాయలు విరాళాలు వసూలు చేసి, ఆ డబ్బుతో తిలక్ తరుపున వాదించే యిద్దరు ప్లీడర్లను బొంబాయి హైకోర్టుకు పంపారు. చివరకు అగష్టు 4న బాలగంగాధర తిలక్‌ను జామీనుమీద ప్రభుత్వం విడుదల చేసింది. అయినప్పటికీ విచారణలో ప్రభుత్వం తిలక్‌కు 18 నెలల కఠిన ఖైదు శిక్షను విధించింది.

తిలక్‌కు శిక్షపడిందనే వార్త మహారాష్ట్రం అంతటా దావానలంలా వ్యాపించింది. కాంగ్రెసు అధ్యక్షుడు సురేంద్రనాథ్ బెనర్జీ అమృతసర్ కాంగ్రెసు సమావేశంలో తిలక్‌ను ప్రభుత్వం ఖైదు చేసినందుకు ప్రభుత్వాన్ని అభిశంసించాడు. భారతదేశంలో తిలక్‌ను బంధించి బ్రిటిషు ప్రభుత్వం పత్రికా స్వాతంత్ర్యాన్ని కాలరాచిందంటూ దాదాబాయి నౌరోజి బ్రిటిషు ప్రభుత్వాన్ని విమర్శించాడు.

జైలు జీవితం తిలక్ ఆరోగ్యాన్ని పూర్తిగా హరించి వేసింది. నాలుగు నెలలకే తిలక్ బాగా నీరసించి పోయాడు. బొంబాయిలో తిరిగి ప్లేగు వ్యాధి వ్యాపించడంతో తిలక్‌ను బొంబాయి నుండి పూనా పట్టణంలోని ఎరవాడ జైలుకి ప్రభుత్వం తరలించింది.

తిలక్‌ను వెంటనే విడుదల చేయవలసిందిగా ప్రజలలో అల్లరి ప్రారంభమైంది. ప్రొఫెసర్ మాక్సుముల్లర్ కూడా ప్రజా ఉద్యమంలో చేరాడు. తిలక్‌ను వెంటనే విడుదల చేయవలసిందిగా సర్ విలియం హంటర్, సర్ రిచర్డ్‌గర్త్, దాదాబాయి నౌరోజి, ఆర్.సి. దత్తు, ప్రొఫెసర్ మాక్సుముల్లర్ తదితర మేధావులు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ సంతకాలు చేసారు. చివరకు కొన్ని షరతుల మీద ప్రభుత్వం తిలక్‌ను విడుదల చేసింది.

జైలునుంచి 1898 సెప్టెంబర్ 6వ తేదీ తిలక్ విడుదలయినప్పుడు, పూర్తిగా ఆరోగ్యం చెడి, నీరసంతో బయట కడుగు పెట్టాడు. ప్రజలు వేల సంఖ్యలో తిలక్‌ను చూసేందుకు ఆయన నివాసానికి విచ్చేసారు. దేశం నలుమూలనుంచీ అభిమానులు, ప్రజలు ఉత్తరాలు ద్వారా, టెలిగ్రాముల ద్వారా తిలక్‌ను అభినందిస్తూ తమ ఆనందాన్ని తెలియపరిచారు. కొంతకాలం ఆరోగ్యం బాగుపడేందుకు తిలక్ కుటుంబంతో సహాసింహగఢ్ వెళ్లాడు.

1904లో డిసెంబరులో జరిగిన బొంబాయి కాంగ్రెసు మహాసభకు తిలక్ హాజరైనాడు. కలకత్తా కాంగ్రెసు మహాసభలలో ఇండియాకు స్వరాజ్యం కావాలని వాదించబడింది. "స్వరాజ్యం మన జన్మ హక్కు" అని తిలక్ గర్జించాడు. ఆ సందర్భంలో ఏర్పాటు చేయబడిన సభకు లక్షలాది మంది ప్రజలు హాజరైనారు. ప్రభుత్వానికి సహాయ నిరాకరణం చేయాలని చెప్పినప్పుడు ప్రజలు పెద్దపెట్టున హర్షధ్వానాలు చేసారు. తిలక్ పక్షం కాంగ్రెసు మహాసభలో ప్రభుత్వానికి పూర్తి సహాయ నిరాకరణం ద్వారా నిరసన తెలియజేయాలని వాదించారు.

1905లో బెంగాల్ విభజన చేయబడింది. దేశమంతా బెంగాల్ విభజనను వ్యతిరేకించింది. తిలక్ బెంగాల్ విభజనను తీవ్రంగా వ్యతిరేకించాడు.

విదేశీ వస్తువు బహిష్కారం స్వదేశీ ఉద్యమం దేశమంతటా ప్రచారం చేయబడింది. బ్రిటిషు వారి వస్తువులను వాడరాదనీ, విదేశీ దుస్తులు ధరించరాదనీ ముతక వస్త్రాలయినా చేనేత దుస్తులు ధరించాలనీ కాంగ్రెసు మహాసభలో తీర్మానం చేయబడింది.

తిలక్ 'కేసరి' పత్రిక ద్వారా విదేశీ వస్తు బహిష్కారాన్ని ప్రజలలో ప్రచారం చేస్తూ వ్యాసాలు వ్రాసాడు. సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ప్రజల్లో ప్రచారం గావించాడు. బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల్లో జాతీయ భావనలను కలిగించాడు.

1907 లో జరిగిన సూరత్ కాంగ్రెసు మహాసభ చారిత్రాత్మకమైన నిర్ణయాలను చేయుటలో, ఆ సభలో అతివాదులుగా, మితవాదులుగా కాంగ్రెసు సంస్థ రెండుగా చీలిపోయింది. తిలక్ అతివాదుల నాయకుడిగా సూరత్ సభలో మితవాదులను ఎదుర్కొన్నాడు.

1908లో బెంగాల్‌లో ఒక బాంబు ప్రేలుడు కేసులో ముజఫర్‌పూర్‌లో జిల్లా జడ్జి అవినీతి పనులకు ఓర్వలేక అతని మీద బాంబు ప్రయోగించటం జరిగింది. అతను బాంబు నుండి తప్పించుకున్నాడు. కానీ యిద్దరు ఆంగ్లేయ యువకులు మరణించారు. ఈ విషయంపై ఎవరు మాట్లాడినా, పత్రికలో వ్యాసాలు రాసినా, దేశం నుండి బహిష్కరిస్తామని బ్రిటీషు ప్రభుత్వం ప్రకటించింది.

అయినా ఆ బెదరింపులకు భయపడకుండా "దేశదౌర్భాగ్యం" అనే శీర్షికతో కేసరి పత్రికలో బాలగంగాధర్ తిలక్ కేసును గురించి ప్రచారం. వేసాడు. బ్రిటిషు ప్రభుత్వం 1908 జూన్ 24న తిలక్‌ను అరెస్టు చేసింది. కేసు విచారణలో తిలక్ స్వయంగా వాదించుకున్నాడు.

తనను అరెస్టు చేసినందుకు కాకుండా భారత దేశం యొక్క దాస్య విముక్తి కోసం పోరాడే భారతీయ ప్రతినిధిగా, ఆయన న్యాయస్థానంలో బోనులో నిలబడి ప్రభుత్వం అక్రమాలను గురించి నిర్మొహమాటంగా జడ్జీ ఎదుట 2 గంటల సేపు వాదించాడు. తిలక్ వాదన విన్న వారంతా ఆయన దేశభక్తికి, నాయశాస్త్రంలో ఆయనకుగల అనుభవానికి ముగ్ధులయ్యారు. న్యాయవిచారణ ముగిసి చివరకి తిలక్‌కు ఏడు సంవత్సరాల ప్రవాస శిక్ష విధించబడింది. వేయి రూపాయల జరిమానా కూడా విధించబడింది.

తిలక్‌కు దేశ బహిష్కారం విధించబడిందనే వార్త తెలియగానే ప్రజలు కోపోద్రిక్తులయ్యారు. సమ్మెలు జరిగాయి. కార్మికులు, రైతులు దౌర్జన్యానికి దిగి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడారు. పోలీసు కాల్పులు జరిగాయి. కాల్పుల్లో ఎందరో చనిపోయారు. వందలాది మంది గాయపడ్డారు.

బ్రిటిషు ప్రభుత్వం తిలక్‌ను బర్మాలోని మాండలే జైలుకు పంపిది. అక్కడ జైలులో వున్నప్పుడు బాలగంగాధర తిలక్ ఎన్నో గ్రంధాలు రచించాడు. పూర్తిగా శిక్షాకాలం ముగిసాక 1914 జూన్ 16న తిలక్ విడుదల చేయబడినాడు.

తిలక్ జైలు నుంచి విడుదలయిన నాటికి దేశంలో రాజకీయ పరిస్థితుల్లో మార్పులు వచ్చినట్టు ఆయన గ్రహించాడు. జాతీయ కాంగ్రెసు పూర్తిగా మితవాదుల చేతుల్లోకి పోయింది.

తిలక్ విడుదలైనప్పటికీ ఆయనపై పోలీసు నిఘా ఎక్కువైంది. ఆయన కొరకు వచ్చే అభిమానులు, ప్రజలను గురించి ప్రభుత్వం ఆరాలు తీసి వారిని వేధించ సాగింది.

కాంగ్రెసులో ఐకమత్యానికి తిలక్ కృషి చేయసాగాడు. 1914లో ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ఈ యుద్ధంలో బ్రిటిషు ప్రభుత్వం పాల్గొన్నది. ఇండియాలో కాంగ్రెసు అతివాదులు బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా అలజడులు కలిగిస్తారనే ఉద్దేశంతో తిలక్‌ను ఇండియాలో వుండడం ప్రమాదకరంగా భావించి 1918 సెప్టెంబరు 24న బ్రిటన్ తరలించారు. ఇంగ్లండులో తిలక్ భారత స్వాతంత్ర్యం కోసం పోరాడాడు. తన సిద్ధాంతాల కోసం పోరాడాడు. తన సిద్ధాంతాలను అక్కడ ప్రజల్లో వివరించాడు. తిరిగి 1919 నవంబరు 6న ప్రభుత్వం తిలక్‌ను ఇండియాకు పంపింది.

తిలక్ ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. తిలక్ ఇండియాకు తిరిగి వచ్చేటప్పటికి నేషనల్ కాంగ్రెసుకు గాంధిజీ నాయకత్వం వహించాడు. గాంధీజీ నాయకత్వా[illegible] బాలగంగాధర తిలక్ హర్షించాడు.

లోకమాన్య బాలగంగాధర తిలక్ 1920 అగస్టు 1న గుండెపోటు[illegible] మరణించాడు.

భారత జాతీయ పోరాటంలో ఉజ్జ్వలమైన కాంతితో వెలుగొందిన జా[illegible] నాయకుడు కరువైనాడని ప్రజానీకం విషాదంలో మునిగిపోయింది.

లోకమాన్య బాలగంగాధర తిలక్ అగ్నిపర్వతం లాంటి వాడని జాతీ[illegible] నాయకులు కీర్తించారు. ఆ అగ్నిపర్వతం ఆరిపోయింది.

# శ్రీ బిపిన్ చంద్రపాల్

– "వందేమాతరం

మనదే రాజ్యం" అంటూ బ్రిటిషు ప్రభుత్వం గుండెల మీద భేరీనాదాన్ని మ్రోగించి వందేమాతరం జాతీయ నినాదాన్ని దేశ ప్రజలకి అందించిన జాతీయవాది శ్రీ బిపిన్ చంద్రపాల్.

1858 నవంబర్ 7 న బిపిన్ చంద్రపాల్ సామాన్యమైన మధ్యతరగతి యింట జన్మించాడు. ఆయన తండ్రి సిల్హాట్‌లో సనాతన సాంప్రదాయానికి చెందిన ఒక పాతకాలపు వకీలు.

చిన్నతనం నుంచీ పాల్ స్వతంత్ర భావాలతో, విప్లవ పూరితమైన ఆశయాలతో వుండేవాడు. అప్పట్లో బెంగాల్‌లో బ్రహ్మసమాజం సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమంలా వ్యాపించి వుంది. రాజారామ్‌మోహన్‌రాయ్ చేత స్థాపించబడిన బ్రహ్మసమాజంలో బిపిన్ చంద్రపాల్ చేరాడు.

కలవారి యింట పుట్టిన నాటి చాలా మంది జాతీయ నాయకుల్లాగా శ్రీ బిపిన్ ఉన్నత విద్య నభ్యసించలేకపోయాడు. కానీ 20 ఏళ్ల వయస్సు నాటికి ఇంగ్లీషు బెంగాలీ భాషల్లో అపారమైన పాండిత్యాన్ని సంపాయించాడు. చిన్నతనం నుంచీ రాజకీయాల్లో ఆసక్తి కలిగి వుండేవాడు.

అప్పట్లో బహుళ ప్రచారంలో వున్న 'బంగబాసి', బంగదర్శన్ వంటి బెంగాలీ పత్రికలకూ, "ది బెంగాలీ పబ్లిక్ ఒపీనియన్" వంటి ఇంగ్లీషు పత్రికల్లోనూ తరచూ వ్యాసాలు వ్రాస్తూ వుండేవాడు.

కేశవ చంద్రసేన్ నాయకత్వంలో సాగుతున్న బ్రహ్మసమాజ ఉద్యమ ప్రభావం ఆయనపై గాఢంగా పనిచేసింది. వ్యక్తి స్వేచ్ఛకీ, సర్వసమానత్వానికీ, బ్రహ్మసమాజం అధిక ప్రాధాన్యత నిచ్చేది. అందుచే బిపిన్ చంద్రపాల్‌లో పొదుకుంటున్న స్వేచ్ఛా పిపాసకు బ్రహ్మసమాజం అద్దం పట్టింది.

అప్పుడప్పుడే దేశంలో రాజకీయ చైతన్యం అంకురిస్తూ, బిపిన్ చంద్రపాల్ వంటి యువకుల్లో నాటుకొని మొలకెత్తుతోంది. ఆతొలి రోజుల్లో ఆనందమోహన బోసు, సురేంద్రనాథ్ బెనర్జీ మహాశయులు నడుపుతున్న 'ఇండియన్ అసోసియేషన్' కార్యకలాపాలు బిపిన్ చంద్రపాల్ వ్యక్తిత్వానికి రూపు రేఖలు దిద్దాయి.

బ్రహ్మసమాజం నాయకుడూ సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసుడూ అయిన పండిత శివనాథశాస్త్రి కుమార్తెను బిపిన్ చంద్రపాల్ వివాహమాడాడు.

కేవలం ఇంటర్మీడియట్ చదువుకే పరిమితమైన కారణంగా శ్రీ బిపిన్ బ్రతుకు తెరువు కోసం విద్యార్థులకు ట్యూషన్లు చెబుతూ బడిపంతులుగా జీవనం గడుపుతూ వచ్చాడు.

వృత్తిరీత్యా బడిపంతులుగా వుంటున్న ప్రవృత్తి మాత్రం రచనా వ్యాసంగం వైపే పరుగులు తీసేది.

శ్రీబిపిన్ చంద్రపాల్ మంచివక్త. అసాధారణమైన వక్తృత్వ పటిమ గలవాడు.

లాహోర్ నుండి వెలువడే "దిట్రిబ్యూన్" అనే పత్రికలో సహాయ సంపాదక పదవి లభించడంతో శ్రీ బిపిన్‌కు తొలిసారిగా మంచి అవకాశం లభించినట్లయింది. అచిరకాలంలోనే ఆయన ప్రముఖ పత్రికా రచయితగా పేరు తెచ్చుకున్నాడు.

లాహోర్‌లో కొంతకాలం ఉద్యోగాన్ని నిర్వహించి, తిరిగి ఆయన కలకత్తా చేరుకున్నాడు. ఎందుకంటే ఆయనకు కలకత్తా పబ్లిక్ లైబ్రరీలో లైబ్రరీయన్‌గా వుద్యోగం లభించింది. తదుపరి అదే లైబ్రరీకి సెక్రటరీగా నియమింపబడినాడు.

1898లో తొలిసారిగా ఇంగ్లండు వెళ్లి అక్కడ హిందూ మతాన్ని గురించి ఉపన్యసించే అవకాశం లభించింది. ది బ్రిటిషు యూనిటేరియన్ సొసైటీవారు అందుకు కావలసిన ఏర్పాట్లు చేసారు. బ్రిటిషు మిత్రుల సహకారంతోనే అమెరికానుంచి లెక్చర్‌టూర్ కి ఆయనకు ఆహ్వానం వచ్చింది.

అమెరికాలో ఉపన్యాసాలు యిస్తూ పర్యటిస్తున్న రోజుల్లో ఒక అమెరికన్ నాయకుని వ్యాఖ్యానం బిపిన్ చంద్రపాల్ రాజకీయ జీవితాన్ని ముందుకు నడిపించింది. "నీ దేశం దాస్యంలో మ్రగ్గుతోంది. యితర దేశాల్లో పర్యటిస్తూ, వుపన్యాసాలు యివ్వడం సమంజసం కాదు. బానిసత్వంలో వున్న నీవు చెప్పే మాటకి అంతగా విలువ వుండదు."

ఈ మాటలు బిపిన్ చంద్రపాల్ మస్తిష్కం మీద బాగా పనిచేసాయి. అమెరికా నుంచి తిరిగిరాగానే బిపిన్ చంద్రపాల్ భారత స్వాతంత్ర్యోద్యమానికి పూర్తిగా అంకితమైనాడు.

'న్యూ ఇండియా' అనే వార పత్రికను స్థాపించి, జాతీయోద్యమంలో కాంగ్రెసు సంస్థను పోరాట శక్తిగా రూపొందించాల్సిన ఆవశ్యకతను గురించి వారం వారం వ్యాసాలు వ్రాసేవాడు. సదస్సులు, సభలను నిర్వహించి కాంగ్రెసు ఆశయాలను ప్రజల్లో ప్రచారం చేసేవాడు.

అప్పట్లో వైస్రాయిగా వున్న లార్డ్ కర్జన్ 1905లో బెంగాల్ రాష్ట్రాన్ని రెండుగా విభజించాడు. ఈ చర్యవల్ల బెంగాల్ ప్రజలనే రెండుగా చీల్చినట్లయింది.

బెంగాల్ అంతటా తీవ్ర నిరసన పాటించబడింది. బెంగాలీలలో తీవ్రా అసంతృప్తి చెలరేగింది.

లార్డ్ కర్జన్ చేసిన బెంగాల్ విభజనను బిపిన్ చంద్రపాల్ తీవ్రంగా ఎదుర్కొన్నాడు. బెంగాల్ విభజన దేశ ప్రజలనే కదిలించింది. ఇండియాలో బ్రిటిషు ప్రభుత్వం భారతీయుల్లో ఒక జాతిప్రజలనే ముక్కలు ముక్కలుగా విభజించే దుష్ట చర్యల్ని దేశ ప్రజలంతా గర్హించారు. జాతీయ భావన దేశమంతటా అలుముకుంది. ఈ దశలో స్వదేశీ ఉద్యమం దేశంలో బలపడింది.

1906లో జరిగిన కలకత్తా కాంగ్రెసు మహాసభలో బిపిన్ చంద్రపాల్ స్వదేశీ అనే పదానికి మరింత విపులమైన అర్థాన్ని వివరిస్తూ, ఒక జాతీయ శక్తిగా దానిని మలచవలసిన ఆవశ్యకతను నొక్కి చెప్పాడు.

(1) స్వదేశీ వస్తువుల పట్ల అభిమానం (2) విదేశీ వస్తు బహిష్కారం (3) జాతీయ విద్యా బోధనలతో కూడిన మూడు అంశాల కార్యక్రమాన్ని ఆయన కాంగ్రెసు మహాసభలో ప్రవేశపెట్టాడు. కాంగ్రెసు వాదులందరూ బిపిన్ చంద్రపాల్ రూపొందించిన స్వదేశీ ఉద్యమ స్వరూపాన్ని హర్షించి దేశ వ్యాపితంగా ముందుకు తీసుకుపోవాలని తీర్మానించారు.

బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా విస్తృత ప్రాతిపదికతో కూడిన జాతీయ ఉద్యమానికి పిలుపిస్తూ, దేశ ప్రజల్ని ముందుకు నడిపించడంలో బాలగంగాధరతిలక్, లాలాలజపతిరాయ్‌లతో భుజం కలిపి బిపిన్ చంద్రపాల్ ముందుకు రావడంతో యీ ముగ్గురూ లాల్ -బాల్ - పాల్ పేరిట జాతీయ త్రిమూర్తులుగా ప్రసిద్ధి కెక్కారు.

1907లో సూరత్‌లో కాంగెసు మహాసభలు జరిగాయి. సూరత్ సభలు చారిత్ర్మాకమైన పాత్రను నిర్వహించాయి. ఈ సభలలోనే కాంగ్రెసు నాయకుల మధ్య అతివాదులు, మితవాదుల పేరిట చరిత్ర ప్రసిద్ధమైన చీలిక ఏర్పడింది. ఈ దశలో బాల గంగాధర తిలక్ ఆధ్వర్యంలో ఏర్పడిన అతివాదవర్గంలో బిపిన్ చంద్రపాల్ చేరి ముఖ్యపాత్ర నిర్వహించి, మితవాదులను తీవ్రంగా ఎదుర్కొన్నాడు.

అదేకాలంలో బెంగాల్ రాష్ట్రంలో స్వదేశీ ఉద్యమాన్ని ప్రచారం చేసేందుకు అరవింద ఘోష్ ఆరంభించిన 'వందేమాతరం' అనే ఇంగ్లీషు పత్రికను 'జుగాంతర్' అనే బెంగాలి పత్రికను నడపడంలో బిపిన్ చంద్రపాల్ ఆయనకు కుడి భుజంగా వున్నాడు. బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పత్రికల్లో వ్యాసాలు వ్రాసినందుకు అరవింద ఘోష్ పైన బ్రిటిషు ప్రభుత్వం కేసు బనాయించింది. ఈ కేసులో

అరవింద్ ఘోష్‌కు అనుకూలంగా సాక్ష్యం యిచ్చాడనే నేరం మీద బ్రిటిష్ ప్రభుత్వం బిపిన్ చంద్రపాల్‌కు ఏడు నెలల కారాగారశిక్ష విధించింది.

సరిగ్గా యిదే సమయంలో బంకిమ్‌చంద్ర ఛటర్జీ 'ఆనందమఠం' అనే నవలను రచించాడు. ఈ నవలలో 'వందేమాతరం' పేరిట ఆయన రచించి పెట్టిన గీతం దేశ ప్రజల్ని మంత్ర ముగ్ధుల్ని చేసింది.

"సుజలాం, సుఫలాం
సస్యశ్యామలం, మాతరం
. . . . . . . . . . . .
. . . . . . . . . . . .
ధరణీం, భారణీం మాతరం
వందేమాతరం"

యీగేయంలో భారతమాతను భక్తిపూర్వకంగా వర్ణిస్తూ, కీర్తిస్తూ రాయబడిన చరణాలు దేశభక్తి ప్రపూరితంగా వుండి, దేశప్రజల నాలుకమీద నాట్యం చేసాయి. యీ గీతం స్ఫూర్తితోనే వందేమాతరం ఉద్యమం దేశం నలుమూలలా ప్రతిధ్వనించింది.

దాదాబాయి నౌరోజీ తదితర వృద్ధతరం జాతీయ నాయకులు స్వదేశీ ఉద్యమాన్ని బాగా ప్రోత్సహించారు. విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ వస్తువుల వాడకం దేశమంతటా ఒక ఉద్యమంగా సాగింది.

జాతీయోద్యమంలో దౌర్జన్య చర్యల్ని పురిగొల్పిన అరవిందఘోష్‌తో భుజం కలిపిన బిపిన్ చంద్రపాల్ కారాగార శిక్ష అనుభవించి జైలునుండి విడుదలైనాడు.

జైలు నుంచి బయటకు రాగానే బిపిన్ చంద్రపాల్ సుడిగాలిలా దేశమంతటా పర్యటించి, జలపాతం వంటి హోరుతో కూడిన తన వుపన్యాసాల ద్వారా దేశ ప్రజల్ని ఉద్రేతలూగించాడు.

బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర పర్యటనలో రాజమండ్రిలో బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగింది. ఈ సభలో బిపిన్ చంద్రపాల్ సింహ గర్జనలతో బ్రిటిషు ప్రభుత్వాన్ని తీవ్రంగా దుయ్యబడుతూ చేసిన ప్రసంగం ప్రజల్ని ఉద్రేతలూగించింది.

ఇదే సభలో ప్రసిద్ధ రచయిత కవి శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు ఉప్పొంగి అప్పటికప్పుడే ఆశువుగా యీ క్రింది పద్యం చెప్పాడు.

'భరతఖండంబు చక్కని పాడియావు
భారతీయులు లేగదూడవైపు ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూలాలు బిగియబట్టి"

చిలకమర్తి ప్రసంగంలో ఆశువుగా చెప్పిన యీ పద్యం రాష్ట్రం అంతటా తెలుగు ప్రజలకు భక్తి గీతంలా అప్పట్లో ఉత్సాహాన్నిచ్చింది.

బిపిన్ చంద్రపాల్ ఆంధ్రలో వివిధ సభలలో యిచ్చిన ఉత్తేజపూరితమైన ఉపన్యాసాలకు ప్రభావితులై వేలాదిమంది విద్యార్థులు తమ కాలేజీ చదువులకు స్వస్తి చెప్పి స్వాతంత్ర్యోద్యమంలోకి ఉరికారు.

మచిలీపట్టణంలో జరిగిన సభలో బిపిన్ చంద్రపాల్ చేసిన ఉపన్యాసానికి ఉత్తేజితులై భోగరాజు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు వంటి యువకులు జాతీయ సమరానికి ఆయత్తమై జాతీయ విద్యా బోధనకు నడుం బిగించి బందరులో జాతీయ కళాశాలను స్థాపించారు. నాటికీ, నేటికీ బందరు జాతీయ కళాశాల జాతీయోద్యమానికి ప్రతిబింబంగా నిలిచివుంది.

మద్రాసు మెరీనా బీచ్‌లో బహిరంగ సభ ఏర్పాటు చేయబడింది. మహాసభ ప్రజలలో కిటకిటలాడిపోయింది. ఈ సభలో సముద్రం అలలతో, హెూరుతో పోటీ పడుతూ సాగిన బిపిన్ చంద్రపాల్ వుపన్యాసం అనర్గళంగా ఉత్తేజకరంగా ప్రజల్ని చైతన్య పరిచింది.

దక్షిణ భారత దేశ పర్యటనలో బిపిన్ చంద్రపాల్ చేసిన వుపన్యాసాలు బ్రిటన్‌లోని బ్రిటిషు ప్రభుత్వానికి దడ పుట్టించాయి. లండన్‌లోని "దిటైమ్స్" వంటి పత్రికలు ఆయన వుపన్యాసాలపైన వ్యాఖ్యానాల్ని చేసాయి. బ్రిటిషు ప్రభుత్వం మద్రాసులో ఆయనను అరెస్టు చేయాలని ప్రయత్నించింది.

ఆనాటి అడ్వకేట్ జనరల్ సర్ వి.భాష్యం అయ్యంగార్ జోక్యం చేసుకొని "బిపిన్ చంద్రపాల్ గారి ఉపన్యాసాలు ప్రజల్ని రెచ్చగొట్టే విధంగా వుండవచ్చు గానీ, రాజద్రోహ పూరితం కావు" అని బ్రిటిషు ప్రభుత్వానికి నచ్చ చెప్పాడు. దానితో ఆయనను మద్రాసు ప్రెసిడెన్సీ నుంచి బ్రిటిషు ప్రభుత్వం బహిష్కరించింది.

బిపిన్ చంద్రపాల్ గారి దక్షిణ భారత పర్యటన జాతీయోద్యమంలో తొలి ఘట్టంగా, ప్రజల్లో దేశభక్తిని యినుమడింపజేసి, ప్రజల్ని చైతన్య వంతుల్ని చేసింది. ప్రజల్లో సంఘటిత శక్తిని పెంపొందించింది. విద్యావంతుల్ని, మేధావుల్ని కదిలించి జాతియోద్యమంలో కర్తవ్యపరాయణుల్ని చేసింది.

1920 తర్వాత కాంగ్రెసు సంస్థకు మహాత్మాగాంధి నాయకత్వం వహించాడు. అప్పటికే బాలగంగాధర తిలక్ దివంగతుడై నాడు.

గాంధీజీ రూపొందించిన సహాయ నిరాకరణ వుద్యమం, సత్యాగ్రహాలు, నిరసనదీక్షల వంటి మితవాద పద్ధతులతో అతివాద భావాలతో నిండిన బిపిన్ చంద్రపాల్ కలిసి ముందుకు సాగలేకపోయాడు.

వ్యాసాల ద్వారా, పత్రికల ద్వారా జాతీయోద్యమానికి అంకితమై, జీవితమంతా పోరాడిన బిపిన్ చంద్రపాల్ 1932 లో పరమపదించాడు. భారతస్వాతంత్ర్య పోరాటంలో ఆయన జీవితం సముజ్జ్వల ఘట్టంగా వెలుగొందినది.

# జాతిపిత
# మహాత్మా గాంధీజీ

మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ 1869 అక్టోబరు 2న నేటి గుజరాతులోని పోర్‌బందర్‌లో జన్మించాడు. గాంధీజీ తాతగారైన ఉత్తమ్‌చంద్, తండ్రి కరంచంద్ పోర్ బందరు సంస్థానానికి ముఖ్యమంత్రులుగా వుండేవారు. గాంధీజీ తండ్రి కరమ్‌చంద్ ఉత్తముడు, ధైర్యశాలి, సత్యసంధుడు, తల్లి పుతలీబాయికి అమితమైన దైవభక్తి వుండేది. ప్రతిదినం పూజ చేసుకొని సూర్య దర్శనం అయితేనే గానీ ఆరోజు భోజనం చేసేదికాదు.

మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీకి కూడా తల్లి దండ్రులలోని గుణాలు వారసత్వంగా అబ్బినవి. చిన్నప్పటినుంచీ క్రమశిక్షణతో, సాంప్రదాయికంగా పెరిగి పెద్దవాడయ్యాడు. పాఠశాలలో తోటి విద్యార్థుల మధ్య విలక్షణంగా మెలగేవాడు. ఒకసారి మోహనదాసు సత్యహరిశ్చంద్ర నాటకం చూసాడు. ఆడినమాట నిలబెట్టుకునేందుకు హరిశ్చంద్రుడు రాజ్యాన్నే త్యాగం చేసిన ఘటన గాంధీ మనస్సులో బలంగా నాటుకుంది. ఆనాటి నుండి సత్యం పలకాలి అని గాంధీజీ నిశ్చయించుకున్నాడు.

కరమ్‌చంద్ గాంధీ బక్కపలచగా వుండేవాడు. పాఠశాలలో తనకంటే బలంగా, దృఢంగా వుండే కుర్రవాళ్లను చూసి, తనుకూడా ఆవిధంగా దృఢంగా వుండాలని భావించేవాడు. దాని వల్ల ధైర్యం వస్తుందని తలంచాడు. కానీ ఎలా ? ఒక రోజు తన స్నేహితున్ని యీ విషయాన్ని గురించి ప్రస్తావించాడు. "నేను మాంసం తింటాను. అందువల్ల బలంగా, ధైర్యంగా వుండ గలుగుతున్నాను" అని ఆ స్నేహితుడు బదులు చెప్పాడు. తను యింత వరకు మాంసాహారాన్ని తిని వుండలేదు. ఇంట్లో శాఖాహారమే అలవాటు. ఒకరోజు మోహన్ దాస్ స్నేహితుని ద్వారా తెప్పించుకొని మాంసం తిన్నాడు. కాని ఆ రోజంతా మోహన్ దాస్ మనస్సు కలతగానే వుంది. ఏదో జంతువు తన కడుపులో వుండి అరుస్తున్నట్టుగానే భావించి, మనస్సు వికలం అయింది. మాంసాహారం నిషిద్ధం. ఇక జీవితంలో దాన్నెప్పుడూ తినకూడదని ప్రతిజ్ఞ చేసుకున్నాడు.

గాంధీకి 13వ యేటనే కస్తూరిబాతో వివాహం జరిగింది. మోహన్‌దాస్ గాంధీకి తల్లిదండ్రులంటే అమితమైన ప్రేమ, గౌరవాలు వుండేవి. తన 16వ ఏట ఆయన తండ్రిని కోల్పోయాడు.

హైస్కూలు చదువు పూర్తి అయ్యింది. తన తండ్రిగారు చేసిన ఉద్యోగం చేయాలంటే లాయరు కావాలని తెలుసుకున్నాడు. బారిష్టరు చదవాలంటే అప్పట్లో ఇంగ్లండు వెళ్లవలసివుంది. తల్లిగారితో సంప్రతించి, ఇంగ్లండులో చదువుకు సహాయం పొందడానికి మోహన్ దాస్ గాంధీ, తన బాబాయిగారి వూరు వెళ్లాడు. అయితే తల్లి పుతలీబాయికి యిష్టమైతేనే, మోహన్ దాస్ లండను వెళ్లడానికి సహాయం చేస్తాననీ, తన బాబాయి గారు చెప్పగా, మోహన్‌దాస్ యింటికి వచ్చి తల్లిగారిని వప్పించాడు.

"కానీ, నాయనా! ఇంగ్లండు వెళ్లి చెడిపోతావని నాకు భయంగా వుంది" అంది తల్లి. "లేదమ్మా! నేనెప్పటికీ చెడుపనులు చేయను" అని తల్లివద్ద ప్రమాణం చేసాడు. "స్త్రీ, మద్య, మాంసాహారాలను ముట్టను" అని చెప్పాడు.

సాంప్రదాయిక, గౌరవ కుటుంబంలో జన్మించి, తల్లి, దండ్రుల కనుసన్నలలో పెరిగి, చురుకుదనం, తెలివి తేటల్ని సంతరించుకొన్న మోహనదాసు ఉన్నత విద్య కొరకు బారిష్టరు చదవడానికి లండన్ బయలు దేరాడు.

మోహన్‌దాస్ లండన్‌లో తనవ్యక్తిత్వాన్ని నిలబెట్టుకునేందుకు ఉన్నతమైన అభిరుచుల్ని ఆచరిస్తే వుండేవాడు. శాకాహార సమాజంలో చేరి, దాని కార్యకలాపాల్లో పాల్గొనేవాడు. ఎన్నో చారిత్రక, రాజకీయ గ్రంధాలను చదివి ప్రపంచ పోకడలను అర్థం చేసుకున్నాడు. మహా పురుషుల జీవిత చరిత్రలను అధ్యయనం చేసాడు.

లండన్‌లో చదివే రోజుల్లోనే మోహన్‌దాసు గాంధీ తొలిసారిగా భగవద్గీతను చదివాడు. గీతా సందేశం ఆయన మనస్సులో హత్తుకుపోయింది. క్రమశిక్షణతో నిరాడంబరంగా జీవించడం అలవాటు చేసుకున్నాడు.

బారిష్టరు చదివి మోహన్‌దాస్ ఇండియాకు తిరిగి వచ్చాడు. అన్నగారు రేవులోనే ఎదురువచ్చి "అమ్మ చనిపోయింది" అని పిడుగులాంటి వార్త తెలిపాడు. మోహన్‌దాస్ గాంధీ చాలాసేపు దుఃఖించాడు.

గాంధీ స్వదేశంలో లాయర్‌గా రాణించలేకపోయాడు. సందర్భానుసారంగా మాట్లాడటం, ఎదుటి వాళ్లను చిత్తు చేయడానికి ఎత్తుగడలు వేయడం, తదితరమైన లాయరుకు వుండవలసిన లక్షణాలను గాంధీజీ వంట పట్టించుకోకపోవడమే అందుకు కారణం.

కొంత కాలానికి ఒక భారతీయ కంపెనీ యజమానులు ఆయనను ఒక కేసు మీద దక్షిణాఫ్రికాకు పంపారు. వారి కేసు పరిష్కారానికి గాంధీ కొంత కాలం దక్షిణాఫ్రికాలోని నేటాల్‌లో వుండవలసి వచ్చింది.

ఆఫ్రికా చేరుకున్న తరువాత మోహనదాస్ గాంధీ రైలులో ప్రిటోరియా బయలు దేరాడు. దారిలో ఒక స్టేషన్ వద్ద అనుకోని సంఘటన జరిగింది. గాంధీ కూర్చున్న రైలు పెట్టెలోకి కొందరు తెల్లజాతీయులు ఎక్కారు. వెంటనే వాళ్లు గాంధీని "బయటకు వెళ్లిపో" అని అరిచారు.

"అదేమిటి ? నావద్ద ఫస్టుక్లాసు టిక్కెట్టు వుంది గదా"

"షటప్! ఇది తెల్ల జాతీయులు ప్రయాణించవలసిన తరగతి పెట్టె. ఇందులో నల్లవారికి స్థానంలేదు. మాతో కలిసి కూర్చుని ప్రయాణం చేసేందుకు నల్లవారికి హక్కులేదు దిగు" అంటూ దబాయిస్తూ, పోలీసును పిలిచి గాంధీజీని బయటకు నెట్టించారు. ఈ సంఘటన గాంధీజీని పరిపరివిధాల ఆలోచింపజేసింది. ఆయన భవిష్య జీవితాన్ని మలుపు తిప్పిన సంఘటనకూడా యిదే.

దక్షిణాఫ్రికాలోని నల్లవారు ఎలాంటి అవమానాలకు గురి అవుతున్నారో, అక్కడే జరిగిన మరొక సంఘటన ద్వారా గాంధీ బాగా అవగతం చేసుకున్నాడు. ఇది కూడా స్వీయానుభవమే.

ప్రిటోరియా వెళ్లడానికు బయలు దేరిన అంచె గుర్రాల బగ్గీలో గాంధీజీ ప్రయాణం సాగించాడు. బండిలోపల శ్వేత జాతీయుల సరసన గాంధీకిస్థానం దొరకలేదు. బండితోలెవాడి ప్రక్కన కూర్చోమన్నారు. మరి కొంతసేపు గడిచాక తొట్టిలో వాడి కాళ్ల వద్ద కూర్చోమని ఆజ్ఞాపించారు.

"నేను యిక్కడ నుండి కదలను. నేను కూడా కిరాయియిస్తున్నాను. క్రింద ఎందుకు కూర్చోవాలి" అని మోహన్ దాస్ గాంధీ ఎదురు తిరిగాడు.

"నల్లతోలుగాడిదా! నీకింతపొగరా!" అంటూ మోహన్‌దాస్ పై శ్వేత జాతీయులు దౌర్జన్యం జరిపారు. ఎవరో పెద్దమనిషి జోక్యంతో అప్పటికి గాంధీ బయటపడ్డాడు. దక్షిణాఫ్రికాలోని భారతీయుల దుస్థితికి గాంధీజీ తీవ్రంగా ఆవేదన చెందాడు. గాంధీ ప్రిటోరియాలోని భారతీయులను సమావేశపరిచాడు.

అక్కడి బారతీయులకు గాంధీ కొన్ని సలహాలు, సూచనల్ని యిచ్చాడు. ఇతరులు మనల్ని గౌరవించాలంటే, మనం ఆత్మ గౌరవాన్ని అలవరచుకోవాలి. రుజువర్తనంతో జీవించాలి. పరిశుభ్రతను అలవాటు చేసుకోవాలి. మనల్లోని కులభేదాలను వదిలివేయాలి. స్థానిక భాషయైన ఇంగ్లీషును నేర్చుకోవాలి."

గాంధీ వుపన్యాసాలు అక్కడి భారతీయులకు బాగా నచ్చాయి. "యువకుడు అయిన గాంధీజీ అద్భుతమైన వ్యక్తి" అంటూ ప్రశంసించారు.

కేసు పూర్తయి గాంధీ ఇండియా తిరుగు ముఖం పట్టబోయే సమయంలో

దక్షిణాఫ్రికా భారతీయులు గాంధీజీని మరికొంతకాలం అక్కడే వుండి తమ న్యాయమైన హక్కుల సాధనకు సహాయ పడవలసిందిగా కోరారు.

దక్షిణాఫ్రికాలో భారతీయులకు ఓటు హక్కు నిరాకరించబడింది. అంతే గాకుండా అక్కడి భారతీయులకు మరొక సమస్యకూడా ఎదురైంది. ఇండియా నుండినేటాలుకు అయిదేళ్ల కంట్రాక్టు పైన కూలీలను దిగుమతి చేసుకుంటారు. ఈ అయిదేళ్ల తర్వాత అక్కడ వుండాలనుకునేవారు తలకు మూడు పౌన్లు పన్ను చెల్లించవలసి వుంది. అంటే ఆరు నెలల కూలీ డబ్బును పన్ను క్రింద చెల్లించాల్సి వచ్చేది. యిక మిగిలిన కూలీతో అక్కడ జీవనం గడపడం దుర్భరంగా వేండేది. "యీ అన్యాయాన్ని అరికట్టాలి. ఇందుకు మీరు సాగించే ఆందోళనలో నేను తోడ్పడతాను" అని గాంధీ అక్కడి భారతీయుల హక్కుల సాధన కొరకు పోరాడాడు.

ఎక్కువ కాలం దక్షిణాఫ్రికాలో వుండ నిశ్చయించుకొని, కుటుంబాన్ని కూడా వెంట తెచ్చుకొనేందుకు గాంధీజీ ఇండియా వచ్చాడు. ఇండియాలో గాంధీజీ కొన్ని బహిరంగ సభల్ని జరిపి దక్షిణాఫ్రికాలోని భారతీయుల కడగండ్లను కళ్లకు కట్టినట్లు వర్ణించాడు. ఆఫ్రికాలోని శ్వేతజాతి పాలకులు భారతీయులను హీనాతి హీనంగా చూస్తున్నారని ఉపన్యాసాలు యిచ్చాడు. గోఖలే వంటి జాతీయ నాయకులు గాంధీకి వత్తాసు యిచ్చారు.

గాంధీజీ దక్షిణాఫ్రికాకు తిరిగి వచ్చాడు. గాంధీజీ రాక విని తెల్లవారు అట్టుడికిపోయారు. ఆఫ్రికాలో వీధిలో నడిచిపోతున్న గాంధీజీని చూసిన కొందరు శ్వేత జాతీయులు "గాంధీ భారతదేశంలో మన పరువు మంట కలిసే విధంగా ఉపన్యాసాలు యిచ్చాడు, ఇదుగో, గాంధీ. తన్నండి. చితకబాదండి" అంటూ గాంధీపై దౌర్జన్యం జరిపారు. చుట్టూ శ్వేత జాతి జనం, ఒంటరిగా వున్న గాంధీజీపై చెప్పులతో, రాళ్లతో హింసించసాగారు. అప్పుడు ఒక పోలీసు సూపరింటెండెంట్ భార్య గాంధీజీకి అండగా నిలిచి కాపాడింది.

దక్షిణాఫ్రికాలో గాంధీ చాలా కాలం నివసించి, అక్కడి భారతీయుల హక్కుల కొరకు ఉద్యమాల్ని నడిపాడు. అక్కడి భారతీయులను సమీకరించి ఐక్యపరిచాడు. ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం జారీ చేసిన "గుర్తింపు కార్డు" పద్ధతిని వ్యతిరేకించి, అందుకు ఉద్యమాన్ని నడిపి విజయం సాధించాడు. అక్కడ జనరల్ స్మట్స్‌తో సంప్రతింపులు జరిపి, భారతీయుల హక్కుల సాధనకు కృషి చేశాడు. క్రైస్తవేతరుల వివాహాలు చెల్లనేరవని దక్షిణాఫ్రికా న్యాయస్థానం తీర్పు చెప్పినప్పుడు, భారతీయ గని కార్మికుల చేత గాంధీజీ సమ్మె చేయించాడు.

"మానవ స్వాతంత్ర్యం కొరకు, వ్యక్తి గౌరవం కొరకు మనం అవసరమైతే తుపాకులకు ఎదురొడ్డి నిలబడదాం" అంటూ గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయులలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించాడు. గాంధీ నడిపిన ఉద్యమాన్ని జనరల్ స్మట్స్ సైతం మెచ్చుకొని, న్యాయమైన భారతీయుల కోర్కెలను ఆమోదించక తప్పలేదు. తల పన్ను రద్దు చేయబడింది. భారతీయుల వివాహాలు చట్ట సమ్మతమైనవిగా గుర్తించబడతాయని జనరల్ స్మట్స్ ప్రకటించి, ఆచరణలో పెట్టాడు.

1906లో దక్షిణాఫ్రికా భారతీయుల హక్కుల కొరకు గాంధీజీ దక్షిణాఫ్రికాలో ఉద్యమాన్ని మొదలుపెట్టి 1915 వరకు సాగించి, భారతీయుల హక్కుల్ని సాధించాడు. దశాబ్దంపాటు పరాయి దేశంలో తోటి భారతీయుల హక్కుల కొరకు గాంధీజీ అక్కడే, వారితో పాటే వుంటూ అహింసాయుత పద్ధతులతో విజయం సాధించాడు.

గాంధీజీ జీవితంలో దక్షిణాఫ్రికా నివాసం అనుకోకుండా జరిగింది. ఒక కేసు కొరకు వెళ్లిన గాంధీజీ, రాజకీయ, సాంఘిక ఉద్యమాల్ని అనివార్య పరిస్థితుల్లో, తనకు స్వయంగా జరిగిన పరాభవానికి పరాకాష్టగా చేపట్టి, పది రోజుల పర్యటనను, పది సంవత్సరాల సుదీర్ఘ కాలాన్ని దక్షిణాఫ్రికాలో గడపవలసి వచ్చింది.

1915 జనవరిలో గాంధీజీ బొంబాయి చేరుకున్నాడు. దక్షిణాఫ్రికాలో భారతీయుల హక్కుల సాధనకు తాను నడిపిన ఉద్యమాల పట్ల గాంధీజీ సంతృప్తి చెందాడు.

బొంబాయిలో ఇండియా గేటు వద్ద గాంధీజీ ఓడ దిగారు. అప్పటి దాకా వైస్రాయిలకు మాత్రమే ఆ గౌరవం లభించేది. అటు పిమ్మట గోఖలేను కలుసుకోవటానికి గాంధీజీ పూనా వెళ్లాడు. గోఖలే సాదరంగా గాంధీజీని ఆహ్వానించాడు. "మీరు ఒక ఏడాది పాటు మౌనంగా వుండి దేశ రాజకీయాల్ని అతి జాగ్రత్తగా గమనిస్తూ వుండండి. ఆ తర్వాత కర్తవ్యాన్ని నిర్ణయించుకోండి" అని గోఖలే సలహా యిచ్చాడు.

దక్షిణాఫ్రికా భారతీయుల హక్కుల కొరకు పోరాడిన నాయకునిగా గాంధీజీ పట్ల భారతదేశంలో గౌరవ భావం యినుమడించి వుంది. గాంధీజీ శాంతినికేతనం వెళ్లి రవీంద్రనాధ్ ఠాగూర్‌ను కలుసుకున్నాడు. అక్కడ వంటశాలలో గాంధీజీ స్వయం సేవ పద్ధతిని ప్రవేశ పెట్టాడు. ఈ ప్రయోగమే స్వరాజ్య సాధనకు బీజప్రాయమైంది. మద్రాసులో గాంధీ, కస్తూరిబాయిలకు ఘనసన్మానం జరిగింది. దక్షిణాఫ్రికాలో గాంధీజీ సేవల్ని ప్రజలు వేనోళ్ల కొనియాడారు.

అహమ్మదాబాద్ సమీపంలో కోచ్రాబ్ వద్ద గాంధీజీ సబర్మతి సత్యాగ్రహ ఆశ్రమాన్ని నెలకొల్పి అక్కడే నివాసాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ప్రజాసేవ

చేయగోరే కార్యకర్తలకు గాంధీజీ యిలా బోధించేవారు "సత్యం, అహింస, బ్రహ్మచర్యం, మితభోజనం అలవరచుకోవాలి".

1916లో బెనారస్ హిందూ యూనివర్శిటీ ప్రారంభోత్సవానికి పండిత మదన్‌మోహన్ మాలవ్యా గాంధీజీని ఆహ్వానించాడు.

భారత స్వాతంత్ర సాధనకు జాతీయోద్యమం ముమ్మరంగా జరుగుతున్న రోజులవి. 1885లో స్థాపించబడిన జాతీయ కాంగ్రెసు స్వాతంత్ర్య సమరాన్ని నిర్వహిస్తూ వుంది. భారత ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్న ఏకైక సంస్థ కాంగ్రెస్సే, అయినప్పటికీ లక్ష్య సాధనకు ఒక నిర్దిష్ట కార్యాచరణ లేకపోవడం పెద్ద లోపంగా కనిపిస్తున్నది. అప్పట్లో కాంగ్రెసు మహానాయకుడిగా రూపుదిద్దుకుంటున్న బాలగంగాధరతిలక్ అనారోగ్యం పాలయ్యాడు. యీ సమయంలో కాంగ్రెసును నడిపించడానికి ఒక జాతీయ నాయకుడు అవసరమైనాడు. దక్షిణాఫ్రికాలో ఆయన సృష్టించిన సంచలనం ప్రపంచం దృష్టిని ఆకర్షించింది.

గాంధీజీ సరియైన సమయంలో దక్షిణాఫ్రికానుండి భారతదేశానికి వచ్చాడు. ఆ సందర్భంలో గోఖలే మాట్లాడుతూ "గాంధీజీలో నేటి జాతీయ ఉద్యమాన్ని నడపగల నాయకత్వ లక్షణాలు వున్నాయి" అని ప్రకటించారు. అంతేకాదు, ఆయనలో మామూలు మనుషులను కూడా మహానాయకులుగా తీర్చి దిద్దగల శక్తి వుంది అని అన్నాడు.

సరిగ్గా గోఖలే వ్యాఖ్యానించినట్టు కాంగ్రెసులో, భారత రాజకీయాల్లో అనతికాలంలోనే గాంధీజీ బ్రహ్మాండమైన మార్పు తెచ్చాడు. అప్పటి దాకా పట్టణాలలో కొద్దిమంది మేధావులకు, నాయకులకే పరిమితమైన కాంగ్రెసు సంస్థను గాంధీజీ ప్రజల వద్దకు నడిపించాడు. సామాన్యులను, మధ్యతరగతి ప్రజలను కాంగ్రెసు సంస్థలో భాగస్వాములుగా చేర్చి, కాంగ్రెసు సంస్థను ప్రజల సంస్థగా తీర్చిదిద్దాడు. భారత జాతీయోద్యమంలో యిది గొప్ప మలుపు.

బ్రిటీషు ప్రభుత్వంపై సాయుధ పోరాటం జరపడం భారతీయులకు వినాశహేతువు కాగలదని గాంధీ గ్రహించారు. అందువలననే ఆయన "సత్యాగ్రహం" అనే ఒక వినూత్న పద్ధతిని జాతీయోద్యమంలో ప్రవేశపెట్టారు. ప్రపంచ రాజకీయ వ్యవస్థలోనే యీ ప్రక్రియ విలక్షణంతో కూడుకొని, తదుపరి కాలాల్లో రాజకీయ వేత్తల, మేధావుల ప్రశంసలకు పాత్రమైంది. 1919 మార్చి 1వ తేదీన సత్యాగ్రహ కార్యక్రమాన్ని ప్రకటించి, మార్చి 2వ తేదీన కాంగ్రెసువాదుల చేత సత్యాగ్రహ శపథం చేయించాడు.

మద్రాసులో గాంధీజీ ఒకసారి చక్రవర్తుల రాజగోపాలాచారికి అతిధిగా

వున్నప్పుడు, రాత్రి సమయంలో విశ్రాంతి వేళలో ఆయనకు చక్కని ఆలోచన వచ్చింది. అదే హర్తాళ్ కార్యక్రమం. బ్రిటీషువారి పాలనకు నిరసన తెలియజేసే విధానమే 'హర్తాళ్' అని పిలువబడుతుంది. ఈ కొత్తరకం ఉద్యమాన్ని గాంధీజీ ప్రకటించినప్పుడు, మోతీలాల్ నెహ్రూ "దేశ రాజకీయాల్లో గాంధీజీ ఒక నవ జీవన శక్తిని ప్రవేశ పెట్టారు. ఈ శక్తి గ్రామీణ, పట్టణ ప్రజలను జాతీయ ఉద్యమంలోకి దింపుతుంది" అని కొనియాడారు.

గాంధీజీ ప్రతిపాదించిన సత్యాగ్రహం, హర్తాళ్, సహాయనిరాకరణ ఉద్యమాల్లో లక్షలు, కోట్ల సంఖ్యలో పాల్గొని బ్రిటీషువారి నిరంకుశ చర్యల్ని నిరాయుధులుగా ఎదిరించారు.

గాంధీజీ నివాసమైన సబర్మతి ఆశ్రమం దేశ రాజకీయాలకు నిలయంగా మారింది. బ్రిటీష ప్రభుత్వాన్ని ఎదిరించేందుకు రూపొందించే ప్రతికార్యక్రమాన్ని గాంధీజీయే నిర్ణయిస్తున్నారు. నిర్దిష్టమైన ప్రణాళికలతో, వ్యూహంతో సత్యాగ్రహ కార్యక్రమాలు అమలు పరచబడుతున్నాయి.

రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా పంజాబ్‌లోని అమృత్‌సర్‌లో జలియన్‌వాలాబాగ్ అనే చోట ప్రజలు సమావేశాన్ని జరుపుతున్న సమయంలో జనరల్ డయ్యర్ ఎట్టి హెచ్చరిక లేకుండా కాల్పులకు ఆర్డరు జారీ చేసాడు. బయటకు వెళ్లేందుకు ఒక చిన్న ద్వారం మాత్రమే గల జలియన్‌వాలా భాగ్‌లో దాదాపు యిరవై వేల వరకు సమావేశమై వున్నారు. పోలీసు కాల్పుల్లో దాదాపు నాలుగు వందల మంది మరణించారు. వేయికిపైగా గాయపడ్డారు. జలియన్‌వాలా భాగ్ దురంతంతో దేశం అట్టుడికిపోయింది. గాంధీజీక తీరని సంతాపం కలిగింది.

బ్రిటీష ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల్ని సమీకరించడం అవసరం అని భావించిన గాంధీజీ దేశ పర్యటన మొదలెట్టాడు. ప్రతి చోటా లక్షలాది మంది ప్రజలు గాంధీజీని దర్శించి, ఆయన సందేశం విన్నారు. జాతీయ స్వాతంత్ర్యం ఉద్యమానికి నిధులు కావాలని ప్రజలే దాతలుగా విరాళాలివ్వమని గాంధీజీ కోరగానే ప్రజలందరూ ధనిక పేద తారతమ్యం లేకుండా పెద్ద ఎత్తున విరాళాలను గాంధీజీకి సమర్పించారు. మహిళలు తమ మెడలోని మంగళ సూత్రాలతో సహా దానం చేసిన సంఘటనలెన్నో వున్నాయి.

1920, 21లో గాంధీజీ బ్రిటీషువారికి భారతీయులెవరూ సహకరించరాదనీ, సహాయ నిరాకరణ ఉద్యమాన్ని మొదలుపెట్టాడు. సహాయ నిరాకరణ ఉద్యమానికి ప్రజలు మనస్ఫూర్తిగా సహకరించారు. ప్రతి చోట దేశం నలుమూలలా బ్రిటీషువారికి వ్యతిరేకంగా సభలు జరుపబడ్డాయి. న్యాయవాదులు కోర్టుల్ని బహిష్కరించారు.

ఉద్యోగస్థులు కార్యాలయాలను విడిచిపెట్టారు. గ్రామోద్యోగులు తమ ఉద్యోగాలకు రాజీనామాలిచ్చారు. విదేశీ వస్తు బహిష్కార ఉద్యమం పెద్ద ఎత్తున సాగించబడింది. విలువైన విదేశీ వస్త్రాలను, వస్తువులను దేశమంతటా నడిబజార్లో పడవేసి తగలబెట్టడం జరిగింది.

గాంధీజీ చేపట్టిన సహాయ నిరాకరణ ఉద్యమం దేశ వ్యాప్తంగా ప్రజలందరి చేత అమలు పరచబడింది. లక్షలాది, కోట్లాది మంది ప్రజలు స్వరాజ్య ఉద్యమంలోకి ఉవ్వెత్తున ప్రవేశించారు. గాంధీజీ దూరదృష్టిగల యీ కార్యక్రమాలవల్ల ప్రజలందరిలో జాతీయ భావం, దేశభక్తి నాటుకొని, ప్రజలందరూ తరతమభేదం లేకుండా జాతీయోద్యమంలో భాగస్వాములై తమ వంతు త్యాగాలను చేసారు. ఈ ఘనత గాంధీజీదే.

ఇతరులకు చెప్పే సూత్రాలను, గాంధీజీ స్వయంగా తాను మనసా, వాచా, కర్మణా అనుసరించేవాడు, ఇదీ గాంధీజీలో వున్న ప్రత్యేకత, గాంధీజీ నిరాడంబర జీవితాన్ని ఆచరించేవాడు, రుషిలాంటి జీవితం ఆయనది.

కొల్లాయిగట్టితేనేమీ,

మా గాంధి మాలడై తిరిగితేనేమీ! అంటూ ప్రజలు గాంధీజీని గురించి పాటలు పాడుకున్నారు. కేవలం కొల్లాయిగుడ్డ మొలకి ధరించి, పైన ఒక పంచె కప్పుకొని, పిలక, చేతకర్ర యిదీ గాంధీజీ వస్త్రధారణ, అతి నిరాడంబరమైన జీవితం ఆయనది.

ఆయన సతీమణి కస్తూరిబా కూడా. భర్తను అనుసరించి వుండేది. ఆమె కూడా ఆయనతో పాటే ఆశ్రమ జీవితాన్నే జీవితాంతమూ గడిపింది.

అహమ్మదాబాద్ సమీపంలోని సబర్మతి ఆశ్రమంలోనూ వార్ధా వద్ద నిర్మించిన సేవాగ్రాం ఆశ్రమంలోనూ గాంధీజీ ఆశ్రమ పద్ధతులనే ప్రవేశపెట్టాడు. ఆశ్రమ వాసులందరూ నియమంతో కూడిన, నిరాండబర జీవితాన్నే ఆచరించాలి. ఉదయం నిద్రలేవగానే ప్రార్థన, తర్వాత సూత్ర యజ్ఞం పాటించాలి. సూత్రయజ్ఞం అనగా చరఖామీద నూలు వడకడం, మితాహారం తోటపని, గీతా పారాయణం యిలా వుంటుంది ఆశ్రమజీవితం. సంపన్న కుటుంబంలో పుట్టిన గాంధీజీ, కస్తూరిబాకూడా స్వయంగా తాము ఆచరించి, యితరులకు ఆదర్శప్రాయులయ్యారు. నిరాండంబరమైన ఆశ్రమ జీవితమే గాంధీజీపట్ల కోట్లాది భారతీయులకు పూజ్యభావం ఏర్పడింది. అందుకే ఆయన జాతిపితగా, బాపూజీగా ప్రజలచే పిలవబడినాడు.

రౌండుటేబుల్ సమావేశాల్లో గాంధీజీ పాల్గొనేందుకు లండన్ వెళ్లినప్పుడు కూడా యిదే వేషధారణతో లండన్ వీధుల్లో పర్యటిస్తూ వున్నప్పుడు విదేశీయులు

లండన్ ప్రజలు అమిత ఆశ్చర్యంతో, ఆనందంతో గాంధీజీకి స్వాగతం పలికారు. "గుడ్‌మార్నింగ్, గాంధీజీ" అంటూ లండన్‌లోని యువతీయువకులు, మేధావులు, గాంధీజీని పలకరించడమే గొప్పగా భావించారు.

గాంధీజీ జీవితాన్ని పరిశీలించిన వారికి, ఆయన రాజకీయవాది మాత్రం కాదు అని అర్థం అవుతుంది. గాంధీజీ సంఘ సంస్కరణవేత్త. రాజకీయాలకంటే, సాంఘిక సమస్యలే భారతదేశంలో ప్రథమ స్థానంలో వుంటాయి. అంటరాని తనం, కులవ్యవస్థ, మద్యపాన దురాచారం, సాంఘిక దురాచారాలుగా ప్రజల్లో వ్రేళ్లూదుస్కొని వున్నాయి. ఇట్టి పరిస్థితుల్లో జాతీయోద్యమంతో పాటు, సాంఘికదురాచారముల మీద కూడా దృష్టిని కేంద్రీకరించి, ఏకకాలంలో ప్రజల్లో ప్రచారం చేయడం అవసరమని గాంధీజీ గ్రహించాడు. అదీగాక అప్పటికే భారతదేశంలో హిందువులతో పాటు, ముస్లింలు, క్రైస్తవులు, గణనీయమైన ప్రతిపత్తిని కలిగివున్నందున, తరచుగా మతకలహాలు విజృంభించి భిన్న మతాల మధ్య ఘర్షణ జరుగుతూ వస్తున్నాయి.

గాంధీజీ జాతీయోద్యమంతో పాటు, సాంఘిక సమస్యల పట్ల కూడా తన కృషిని కేంద్రీకరించాడు. దేశంలోని లక్షలాది చేనేత పనివారి జీవితాలు ఆర్థికంగా దెబ్బతిన్నాయి. మాంచెస్టరు మిల్లు వస్త్రాల ధాటికి, చేనేత పరిశ్రమ మూలనబడింది. స్వదేశీ వస్త్ర ధారణను గాంధీజీ ప్రోత్సహించాడు. ఖద్దరును ప్రతి ఒక్కరూ ధరించాలని కట్టడిచేసాడు. ఖద్దరు ప్రచారం కాంగ్రెసు కార్యక్రమాల్లో నొకదాన్నిగా రూపొందించాడు. తాను ప్రతిరోజూ చేతి రాట్నం మీద నూలు వడికేవాడు. ఒక కేసులో గాంధీజీ కోర్టుకు హాజరు కావలసి వచ్చింది. న్యాయస్థానం ఎదుట తనవృత్తి నేతపనిగా పేర్కొన్నాడు. గ్రామీణ చేతి పనులు సమృద్ధిగా నెలకొనాలని గాంధీజీ కోరేవాడు. భారతదేశంలోని గ్రామాలు స్వయం పోషకత్వం చెందినప్పుడే దేశం ఆర్థికంగా పరిపుష్టి చెందగలదని గాంధీజీ అనేవాడు. అందువలన గ్రామీణ చేతివృత్తుల్ని ప్రోత్సహించేవాడు. దేశానికి గ్రామాలే ఆయువు పట్టులని గాంధీజీ విశ్వాసం.

**హరిజనోద్ధరణ :** మొదటి రౌండు టేబిల్ సమావేశంలోనే దేశంలో భిన్న జాతుల మధ్య..భిన్న మతాల మధ్య కక్షల్ని పెంచి, తమ పబ్బం గడుపుకోవాలని విభజించు పాలించు సూత్రాన్ని అమలు జరిపారు. ముస్లింలు జిన్నా నాయకత్వంలో తమకు ప్రత్యేక దేశం కావాలని డిమాండ్ చేయసాగారు. వీరితో పాటు అస్పృశ్యుల్ని కూడా హిందువులకు వ్యతిరేకంగా బ్రిటిషువాళ్లు రెచ్చగొట్టడం ప్రారంభించారు. కొందరు దళితనాయకులు ముస్లింల మాదిరిగానే తమకు కూడా ప్రత్యేక నియోజక వర్గాలను కేటాయించవలసిందిగా కోరడం జరిగింది.

గాంధీజీ వీరి వాదనను అంగీకరించలేదు. అంటరానితనం మహాపాపమని, దానిని పాటించరాదనీ, అస్పృశ్యులు హరిజనులనీ, తమ సోదరులేననీ, వీరిని హిందువు నుండి వేరు చేసి చూడరాదనీ, గాంధీజీ వాదించాడు. హరిజనులు హిందువులే, వారిని తమలో ఒకరిగా మాత్రమే చూడాలనీ సవర్ణులుకూడా హరిజనులను సాటి వారిగా భావించి, అంటరాని తనాన్ని విడనాడి, హరిజనులను కూడా దేవాలయ ప్రవేశం కల్పించి, ఏనాడో హైందవంలో ఏర్పడిన కుల వ్యవస్థను విడనాడి, హరిజనుల యెడల చూపిన అస్పృశ్యతా విధానాన్ని తొలగించి కులాలతో నిమిత్తం లేని హిందూ సమాజం నెలకొనేలా ప్రతి ఒక్కరూ పాటుపడాలనీ, యిది మనందరి విధి అనీ గాంధీజీ ప్రబోధించాడు. యిందుకు గాంధీజీ "హరిజన" అనే పత్రికను స్థాపించాడు.

ప్రత్యేక నియోజక వర్గాలు ఎన్నికలలో ఏర్పాటు చేయలాని దళితనాయకులు కోరగా, అందుకు గాంధీజీ నిరాహార దీక్ష చేసి ఆ విధానాన్ని అమలు కాకుండా చేసాడు. కాంగ్రెసు కార్యాక్రమాల్లో హరిజనోద్ధరణ, అంటరాని తనానికి వ్యతిరేకంగా పోరాటం, హరిజనులకు దేవాలయ ప్రవేశం అనే అంశాలను చేర్చి, వీటిని ప్రజల్లో ప్రతి కాంగ్రెసు కార్యకర్త ప్రచారం చేయాలని ఆదేశించాడు. హరిజనులతో కలిసి సహపంక్తి భోజనాలు చేయడం భంగీకాలనీల్లో కాంగ్రెసు కార్యకర్తలు నివసించడాన్ని గాంధీజీ ప్రోత్సహించాడు.

చేనేత పరిశ్రమకు ప్రోత్సహం, ఖద్దరు వాడకం, నూలు తీయడం, రాట్నం వడకటం, హరిజనోద్ధరణ, అంటరాని తనానికి వ్యతిరేకంగా పోరాటం, హరిజనులకు దేవాలయ ప్రవేశం, గ్రామీణ వృత్తులను ప్రోత్సహించడం గ్రామ స్వయం పోషకత్వం మద్యపానానికి వ్యతిరేకంగా ప్రచారం చేయడం తదితర సాంఘిక కార్యక్రమాలను గాంధీజీ నిర్వచించి, సూత్రీకరించి, సిద్ధాంతబద్ధంగా, ఆచరణాత్మకంగా అమలు జరిపించేందుకు, వీటిని కాంగ్రెసు పార్టీ కార్యక్రమాలుగా చేర్చి ప్రచారం చేసినాడు. సంక్షిప్తంగా చెప్పాలంటే గాంధీజీ ఆశయాలుగా వీటన్నింటిని పేర్కొనవచ్చును.

జాతీయోద్యమ కార్యక్రమాలు ప్రధాన కార్యక్రమాలుగా సాగుతూనే వున్నాయి. దేశస్వాతంత్ర సాధన కోసం సత్యాగ్రహం, హర్తాళ్, నిరాహారదీక్ష ప్రధాన ఆయుధాలుగా చేసుకొని, అహింసాయుతంగా గాంధీజీ బ్రిటిషు ప్రభుత్వంపై ఉద్యమాన్ని నడుపుతూ వచ్చాడు. "లక్ష్యం ఎంత ఉన్నతమయిందో, దాని కోసం చేపట్టే పద్ధతి కూడా అంతే ఉన్నతంగా వుండాలని" గాంధీజీ బోధించాడు.

రైతుల సమస్యలపై కూడా గాంధీజీ అహింసా విధానంతో ఉద్యమాలను నిర్వహింపచేసాడు. బీహారులోని చంపారన్ పోరాటం ఒకటి భూమి పన్ను నూటికి

22 వంతులు పెంచినందుకు నిరసనగా 1928 ఫిబ్రవరిలో గాంధీజీ బార్డోలీలో సత్యాగ్రహం ప్రారంభించారు. ఈ సత్యాగ్రహానికి సర్దార్ పటేల్ నాయకత్వం వహించారు.

గాంధీజీ దేశ పర్యటన గావిస్తూ రెండుమార్లు ఆంధ్రపర్యటన గావించారు. 1921 మార్చి 31, ఏప్రిల్ 1న విజయవాడలో జరిగిన ఎ.ఐ.సి.సి. సభలు ఒక ప్రత్యేకతను సంతరించుకున్నాయి.

**జాతీయ పతాకం ఆవిష్కరణ :** విజయవాడ సభలలో గాంధీజీ ప్రత్యేక ఆకర్షణ అని చెప్ప వచ్చును. యీ కాంగ్రెసే సభలకు ప్రజలకు లక్షలాదిగా విచ్చేసారు. ఈ సభలలో విజయవాడ వాస్తవ్యులు శ్రీ పింగళి వెంకయ్యగారు కాంగ్రెసు పతాకాన్ని రూపొందించి గాంధీజీకి సమర్పించాడు. ఎరుపు, తెలుపు, ఆకుపచ్చరంగులతో, మధ్య రాట్నం గుర్తుతో కాంగ్రెసు పతాకం ఏర్పడింది. యిదే పతాకాన్ని 31-12-1929లో కాంగ్రెసు నూతన అధ్యక్షునిగా ఎన్నికైనప్పుడు పండిట్ నెహ్రూ అర్ధరాత్రి రావీనది ఒడ్డున జాతీయ పతాకంను ఆవిష్కరించాడు. జనవరి 26 నుండి ప్రతి సంవత్సరం యిక మీదట స్వాతంత్ర్య దినోత్సవాలను జరుపవలసిందిగా గాంధీజీ ఆదేశించారు.

**సైమన్ గోబాక్ :** సర్‌జాన్ సైమన్ నాయకత్వాన బ్రిటిష్ కమీషన్ ఇండియాకు పంపబడింది. దేశంలోని స్థితగతులన్నీ పరిశీలించి అవసరమైన రాజకీయ సంస్కరణలను ఆ కమీషన్ సూచించడానికి లండన్ నుండి సైమన్ కమీషన వచ్చింది. అయితే ఆ కమిటీలో భారతీయులెవరూ లేకపోవడంవల్ల. భారతదేశంలోని స్థితిగతులను గురించి ఏ మాత్రం పరిచయంలేని బ్రిటిషువారితో కూడిన కమీషన్ వల్ల ఎట్టి వుపయోగం ఉండబోదనీ, వారి సూచనలు ఆమోదయోగ్యం కావనీ చెప్పి, గాంధీజీ సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా ఉద్యమం నిర్వహించవలసిందిగా ఆదేశించాడు. గాంధీజీ ఆదేశాన్ని పాటించి దేశవ్యాప్తంగా సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా హర్తాళ్‌లు జరిగాయి. సైమన్‌గోబ్యాక్ అంటూ దేశప్రజలు గర్జించారు.

**ఉప్పు సత్యాగ్రహం :** బ్రిటిషు పరిపాలనకు వ్యతిరేకంగా దేశవ్యాపితంగా ఉద్యమం, తీవ్రతరం చెసేందుకు 1930లో గాంధీజీ ఉప్పు సత్యాగ్రమాన్ని నిర్వహించాడు. అప్పట్లో ఉప్పు సరఫరా ప్రభుత్వ గుత్త వ్యాపారంగా వుండేది. కనుక ప్రభుత్వ వ్యతిరేక చర్యగా ఉప్పును తయారు చేయాలి. దేశ ప్రజలందరికీ గాంధీజీ పిలుపునిచ్చి, తాను స్వయంగా 241 మైళ్ళ యాత్ర నిర్వహించి దండి వద్ద ఉప్పు తయారు చేసి అరెస్టు అయ్యారు. 24 రోజుల పాదయాత్రచేసి సముద్రపు ఒడ్డున వున్న దండి వద్ద గాంధీజీ ఉప్పు గడ్డను చేతికి తీసుకొని చట్టాన్ని ఉల్లంఘించడం

ద్వారా, దేశమంతా ఉత్తేజితమైంది. లక్షలాది మహిళాకార్యకర్తలు ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. జైళ్లు నిండి పోయాయి. దేశం అట్టుడికి పోయింది. బీహారులో పోలీసులు ఉప్పు సత్యాగ్రహులపై పాశవికంగా దాడి చేసారు. సరోజినీనాయుడు, మణిలాల్ గాంధీవంటి మహిళాకార్యకర్తలు సైతం అరెస్టు అయినారు.

1921 సహాయ నిరాకరణ ఉద్యమంలోనూ, 1930 ఉప్పు సత్యాగ్రహంలోనూ దేశ వ్యాపితంగా ప్రజలు సంఘుతటితమైనారు. ప్రజల్లో జాతీయత, దేశభక్తి పాదుకున్నాయి. బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను ఒక్క త్రాటి మీదకు తెచ్చిన ఘనత గాంధీజీదే.

**క్విట్ ఇండియా :** దేశ వ్యాపితంగా క్విట్ ఇండియా ఉద్యమాన్ని గాంధీజీ నిర్వహించారు. బ్రిటిషు వారిని దేశం విడిచి వెళ్లిపోవలసిందిగా కోరుతూ "క్విట్ ఇండియా" నినాదాన్ని గాంధీజీ ప్రజల కందించాడు. 1941లో వ్యక్తి సత్యాగ్రహం ద్వారా దేశవ్యాపితంగా కార్యకర్తలు కాంగ్రెసు నాయకులు అరెస్టు అయ్యారు. బ్రిటిషు ప్రభుత్వం గాంధీజీని అరెస్టు చేసి, పూనా వద్ద ఆగాఖాన్ భవనంలో ఖైదీగా వుంచారు. మహాత్ముడు అరెస్టు అయిన మరుక్షణమే దేశమంతటా గగ్గోలు పుట్టింది. ప్రభుత్వ భవనాలను, బ్రిటిషు ప్రభుత్వానికి చిహ్నంగా కనిపించిన ప్రతి వస్తువునూ ప్రజలు తగల బెట్టారు. "డూ! ఆర్ డై" గాంధీజీ సింహగర్జన చేసారు" విజయమో, వీరస్వర్గమో" ఉద్యమించండి అంటూ కాంగ్రెసు సంస్థ ఆదేశం. దేశం అట్టుడికి పోయింది. జైలులోనే గాంధీజీ ఉపవాసదీక్ష ప్రారంభించాడు. 21 రోజులు ఉపవాస దీక్ష సాగింది. ఇంతలో కస్తూరిబాయి తీవ్రమైన జబ్బుచేసి చనిపోయింది. గాంధీజీ ఆమెకు స్వయంగా ఆస్థితిలోనే సపర్యలు చేసాడు. కానీ తుదకు కస్తూరిబా భర్త ఒడిలోనే కన్ను మూసింది. "బా" లేకుండా ఎలా జీవించాలో తెలియడంలేదు" 62 ఏళ్లు తోడు నీడగా కలిసి జీవించాము" అంటూ గాంధీజీ ఆవేదన చెందారు.

గాంధీజీ జీవితంలో ఉపవాసాలతో, జైళ్లలోనూ ఎక్కువ కాలం గడిచి పోయింది. గాంధీ ఇండియాలో 2089 రోజులూ, ఆఫ్రికాలో 249 రోజులూ జైళ్లలో గడిపాడు.

నిరాడంబరమైన ఆశ్రమ జీవితం, ఉపవాసాలూ, గాంధీ జీవితంలో ఒక భాగమై పోయాయి. సరోజినీ నాయుడు ఒక సభలో గాంధీజీని ప్రశంసిస్తూ "మహాత్ముడు" అని ప్రకటించింది.

బ్రిటిషు వారిచే ప్రోత్సహింపబడిన ముస్లింలీగు ప్రత్యేక దేశం కోసం డిమాండ్ చేయసాగింది. మహమ్మదాలీ జిన్నా నాయకత్వంలో ముస్లింలీగు

కార్యకలాపాలు కాంగ్రెసుకూ, గాంధీజీకి తలనొప్పిగా పరిణమించాయి. "హిందూ ముస్లిం భాయి భాయి" అంటూ గాంధీజీ ఎంతగా నినదించినా, జిన్నా కలిసి రావడం లేదు. దేశంలో మతకలహాలు చెలరేగి హిందూ, ముస్లింలు ఒకర్నొకరు చంపుకొనే సమయంలో గాంధీజీ మతకలహాల నివారణకు ఉపవాస దీక్ష చేసాడు. సరిహద్దు గాంధీగా పిలవబడుతున్న ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ వెంట గాంధీజీ సరిహద్దు రాష్ట్రాన్ని సందర్శించారు. ప్రతి సభలోనూ హిందూ, ముస్లింలు సోదరులేననీ రామ్ రహీం కు భేదం లేదనీ ఉద్బోధిస్తూ వుండేవాడు. దేశాన్ని విభజించడానికి వీల్లేదు. "నాదేహాన్ని నరికి, దేశ విభజన చేయండి" అని గాంధీజీ ఆవేదన చెందాడు. మతసామరస్యానికి గాంధీజీ ఎంతగానో కృషి చేసాడు. జిన్నాతో సమావేశమై దేశ విభజన జరగకుండా ఉండేందుకు గాంధీజీ ఎంతగానో శ్రమించాడు. కానీ జిన్నా ససేమిరా కాదన్నాడు. "ముస్లింలు స్వంత సంస్కృతి కలిగిన ప్రత్యేక జాతి. హిందువులు ముస్లింలను అణగద్రొక్కుతున్నారు. అందువల్ల మాకు పాకిస్తాన్ కావాలి" అని జిన్నా వాదించాడు.

"జిన్నా! ముందు బ్రిటిషు వాళ్లను పోనీయ్. తర్వాత మనలో మనం సంప్రతించుకుందాం" అని గాంధీజీ నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. సంప్రతింపులు తెగలేదు. బ్రిటన్‌లో లేబరు పార్టీ అధికారంలోకి వచ్చింది. అట్లీ ప్రధానమంత్రి అయినాడు. బ్రిటిష్ ప్రభుత్వంలో మార్పు వచ్చింది. ఇండియాకు స్వాతంత్ర్యం యివ్వకుండా యిక ఆపలేమని బ్రిటిషు ప్రభుత్వం గమనించింది. "ఇండియాలో ఎన్నికలు జరుపుతామని" అట్లీ ప్రకటించాడు. హిందూ, ముస్లింల మధ్య సఖ్యత అవసరం అని బ్రిటిషు ప్రభుత్వం ప్రకటించింది.

1946లో ఎన్నికలు జరిగాయి. దేశంలో ఇంచుమించు చాలా ప్రాంతాలలో కాంగ్రెసు గెలిచింది. కానీ ముస్లిం ప్రాంతాలలో ముస్లింలీగు గెలిచింది. తిరిగి దేశంలో హిందూ ముస్లిం సమస్య అలాగే వుండిపోయింది. పాకిస్తాన్ ఏర్పడడానికి గాంధీజీ ఒప్పుకుంటే వ్యవహారం అంతా పదినిమిషాల్లో ముగిసి బ్రిటిషు వాళ్లు దేశం విడిచి వెళ్లిపోతారు అనే ప్రచారం ఎక్కువైంది. "భారత మాతను ముక్కలుగా నరకడానికి ఎంత మాత్రం అంగీకరించను" అని గాంధీజీ పట్టుబట్టాడు.

ఇండియాకు ఏ పద్ధతిలో స్వాతంత్ర్యం యివ్వవచ్చునో నిర్ణయించడానికి ముగ్గురు సభ్యులతో కూడిన ప్రతినిధి వర్గాన్ని బ్రిటన్ ప్రధాని అట్లీ ఇండియాకు పంపాడు. "పాకిస్తాన్ ఏర్పడడమే పరిష్కార మార్గం" అంటూ ఆ ప్రతినిధి వర్గం సూచించింది.

అప్పుడు ఇండియాలో వైస్రాయిగా వున్న లార్డ్ వేవెల్ యిలా ప్రకటించాడు "కాంగ్రెసూ, ముస్లింలీగు సమాధానానికి రాలేక పోతున్నాయి. గనుక కొత్త తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయబోతున్నాను. ఇండియాను నూతన రాజ్యాంగానికి రచించే నిమిత్తం రాజ్యాంగ పరిషత్తు ఏర్పడుతుంది" అంటూ వివరించి జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా భారత ప్రభుత్వం ఏర్పడింది. తాత్కాలికంగా ఏర్పడిన యీ ప్రభుత్వంలో ముస్లిం లీగు చేరలేదు. సరిగదా దేశవ్యాపితంగా అల్లర్లు సృష్టించి, మత కలహాలను రేపింది. కలకత్తాలో భయంకరంగా అల్లర్లు జరిగాయి. హిందూ ముస్లింల కొట్లాటల్లో 5000 మంది మరణించారు. పదిహేను వేల మంది గాయపడ్డారు. కలకత్తా ఘటనలకు ప్రతీకారంగా తూర్పు బెంగాల్‌లో నౌఖాలీ, టిప్పెరాలాలలో ముస్లింలు హిందువులను చిత్రవధ చేయడం, మతం మార్పించడం చేయసాగారు. బొంబాయి, పంజాబు బీహారులలో కూడా మతకలహాలు చెలరేగాయి. దేశంలో అంతర్యుద్ధం ప్రారంభమైంది. నౌఖాలీ, టిప్పెరాలలో గాంధీజీ శాంతి యాత్ర జరిపాడు. "ఎవరిమీద నాకెలాంటి వైరభావంలేదు. నేనంటే మంచి అభిప్రాయం లేని వారి మధ్య కూడా నిశ్చింతంగా తిరగగలుగుతున్నాను" అని గాంధీజీ ప్రజలకు బోధించాడు. హిందూ, ముస్లింలు ప్రశాంతంగా వుండాలని చెప్పాడు. తన పరివారమంతా మతకలహాలు జరుగుతున్న గ్రామాలలో మకాం పెట్టి శాంతి నెలకొల్పాలని గాంధిజీ ఆదేశించాడు. రోజుకొక వూరు వంతున గాంధీజీ పాదయాత్ర నిర్వహించాడు. యీ సందర్భంలో గాంధీజీ 49 గ్రామాలలో 116 మైళ్లు పాదయాత్ర చేసి, తదుపరి బీహారు వెళ్లాడు. అక్కడ మత కలహాలు జరిగిన ప్రాంతాలలో గాంధీజీ పర్యటించాడు.

సరిగ్గా యీ పరిస్థితుల్లో లార్డ్ మౌంట్ బాటెన్ ఇండియాకు గవర్నరు జనరలుగా వచ్చాడు. జాతీయ నాయకులందరితోను సంప్రతించాడు. నెహ్రూ, పటేల్ వంటి నాయకులు కూడా దేశ విభజన జరగనిదే ఇండియాకు స్వతంత్ర్యం రాదని గ్రహించి, దేశ విభజనకు అంగీకరించారు.

"రాజకీయ స్వాతంత్ర్యం కంటే సత్యం, అహింసలే నాకు ముఖ్యం. విభజన జరిగిన భారత దేశంలో నాబోంట్లకు స్థానం లేదు" అంటూ గాంధీజీ బాధపడ్డాడు.

1947 అగస్టు 15న ఇండియా స్వతంత్ర దేశమైంది. అప్పుడే పాకిస్తాన్ కూడా అవతరించింది. సరిగ్గా యీ సమయంలో తిరిగి దేశంలో మతకలహాలు చెలరేగాయి. పంజాబ్‌లో పెద్ద ఎత్తున దౌర్జన్యాలు ప్రారంభమైనాయి. పశ్చిమ పాకిస్తాన్ నుండి లక్షలాది మంది సిక్కులూ, హిందువులూ ఇండియాకు శరణార్థులై వచ్చారు. గాంధీజీ నిరసనవ్రతం ప్రారంభించారు.

భారత ప్రభుత్వం నుండి 55 కోట్లు పాకిస్తాన్‌కు రావాలని, తమవాటాగా మాకు అందజేయాలనీ ముస్లింలు వాదనను గాంధీజీ అంగీకరించి, యిందువల్ల మతకలహాలు అంతరించిపోతాయనే భావాన్ని వెల్లడించాడు. భారత ప్రభుత్వం చేత ఆసొమ్మును పాకిస్తాన్‌కు గాంధీజీ యిప్పించాడు. కానీ పాకిస్తాన్‌కు ఇండియా చేత 55 కోట్ల రూపాయలను యిప్పించాడని హిందువులలోని అతివాదులకు గాంధీజీ మీద ఆగ్రహం కలిగింది. అంతేగాకుండా ఢిల్లీలోనూ, బీహారులోనూ ముస్లింలను గాంధీజీ రక్షించాడనీ, ముస్లింలచేత చంపబడిన హిందువులను గురించి గాంధీజీ పట్టించుకోవడం లేదని కూడా గాంధీజీ మీద హైందవ అతివాద యువకులు బాగా కోపం పెంచుకొని వున్నారు. "గాంధీజీ ముస్లింల పక్షపాతి" అని కూడా వారు దురభిప్రాయపడినారు. "దేశం గాంధీజీ వల్ల నాశనమై పోతూంది. హిందూమతాన్ని కాపాడాలి" అని హిందు అతివాద యువకులు తీవ్ర ఆవేశంలో వుండేవారు.

1948 జనవరి 30!

గాంధీజీ ఆనాడు ప్రార్థనా సమావేశానికి రావడం కొద్దిగా ఆలస్యమైంది. అప్పట్లో ఢిల్లీలో బిర్లాహౌస్‌లో గాంధీజీ వుండేవారు. ప్రతిరోజూ సాయంత్రం 5గంటలకు ప్రార్థనాస్థలంలో అక్కడికి చేరిన వారందరితో కలిసి గాంధీజీ ప్రార్థన చేసేవారు.

ఆరోజు కొంచెం ఆలస్యంగా ప్రార్థనా స్థలానికి రాగానే, పూనానుండి వచ్చిన నాథూరామ్ గాడ్సే అనే యువకుడు లేచి, ముందుకు వంగి, గాంధీజీకి నమస్కరించి పిస్తోలుతో గాంధీజీని కాల్చాడు.

"హేరామ్" అంటూ గాంధీజీ నెత్తురోడుతూ క్రింద కుప్పకూలిపోయాడు. గాంధీజీ ప్రాణాలు అనంతవాయువుల్లో లీనమయ్యాయి.

గాంధీజీ యికలేడు.

మహాత్ముడు, జాతిపిత, బాపూజీ అని అనుయాయులతో ప్రజలతో, ప్రతి ఒక్కరితో ఆప్యాయంగా, పూజ్యభావంతో పిలిపించుకున్న గాంధీజీ ఏ దేశం కోసం తాను అహర్నిశలు శ్రమించాడో, ఆదేశ సమస్యల సంధికాలంలో తన జీవితాన్నే బలియిచ్చాడు. ప్రజల కోసం జీవించాడు. దేశం కోసం శ్రమించాడు. సత్యం, అహింసలకోసం పాటు పడ్డాడు. తాను నమ్మిన సిద్ధాంతంతో ఎక్కడా రాజీపడలేదు. ఆఖరికి తన జీవిత చరమ ఘట్టంలో కూడా ఆశయ, ఆదర్శాల సాఫల్యత కోసమే తన ప్రాణాల నర్పించాడు.

ఈ సందర్భంలో ప్రతి రోజూ ప్రార్థనా సమయంలో గాంధీజీ ఆలాపించే గీతంతోనే యీ కథను ముగిద్దాం!

"రఘుపతి రాఘవ రాజారాం పతిత పావన సీతారామ్
ఈశ్వర అల్లాతేరేనామ్ సబ్‌కో సన్మతి దే భగవాన్"

# జాతీయవాది కార్మిక నాయకుడు శ్రీ చిదంబరం పిళ్లై

"తొలుత దేశసేవ, తర్వాత వ్యక్తిగత ప్రయోజనం" అని విశ్వసించిన సుప్రసిద్ధ దేశభక్తుడు శ్రీ వి.జి. చిదంబరం పిళ్లై.

తమిళనాట జాతీయభావాల్ని పరివ్యాప్తం చేసిన, స్వాతంత్ర్య పోరాటాన్ని ముందుకు తీసుకొని పోయిన జాతీయనాయకులెందరో కలరు. వారిలో అగ్రబాగాన నిలిచిన చిదంబరం పిళ్లై తిరునల్వేలి జిల్లాలోని 'ఓడియపిదరమ్' అనే కుగ్రామంలో 1872లో జన్మించాడు. తండ్రి లోకనాద పిళ్లై. తల్లి పారమాయీ అమ్మయార్

కొన్నాళ్లు ట్యుటికొరన్‌లోనూ, మరికొన్నాళ్లు తిరునల్వేలిలోనూ ఆయన విద్యాభ్యాసం గావించారు. హైస్కూల్ చదువు పూర్తి అయ్యాక, న్యాయశాస్త్రంలో పట్టాపొంది. 1895లో ట్యూటికొరన్‌లో లాయర్‌గా ప్రాక్టీసు ప్రారంభించాడు. ఆయన తండ్రి లోకనాథం పిళ్లై కూడా లాయరే!

చిదంబరం పిళ్లై లాయరుగా తన పార్టీలపట్ల ఎంతో సానుభూతిని చూపేవారు. హుందాతనంతోనూ, యుక్తియుక్తమైన వాదంతోనూ, ఛలోక్తులతోనూ కోర్టులో అందరి ప్రశంసల్నీ పొందేవాడు. బీదా, బిక్కీ వద్ద ఎలాంటి ఫీజు పుచ్చుకోకుండా వారి కేసుల్ని వాదించి పెట్టేవారు. గవర్నమెంటు జులుం, నిరంకుశత్వానికి గురి అయిన కేసులలో ఆయన ఎప్పుడూ గవర్నమెంటుకు వ్యతిరేక పక్షాన్నే నిలబడి పోరాడేవాడు.

అప్పట్లో బ్రిటిషు వారిపట్ల వ్యతిరేక భావం భారతదేశం అంతటా తీవ్రంగా వ్యక్తమై వుంది. దేశ స్వాతంత్ర్యం కొరకు, ప్రజల హక్కులు సాధించేందుకు జాతీయ నాయకులంతా తీవ్రంగా పోరాడుతూ జాతీయోద్యమాన్ని బలోపేతం చేస్తున్నారు.

రాజకీయరంగంలో శ్రీ చిదంబరం పిళ్లై అతివాద భావాలు గలవాడు. బ్రిటిషు సామ్రాజ్యంవాదంపై రాజీలేని పోరాటాన్ని జరపాలని వాదించేవాడు.

1907లో సూరత్‌లో జరిగిన చరిత్రాత్మకమైన కాంగ్రెసు మహాసభకు చిదంబరం పిళ్లై హజరయ్యాడు. సునిశితమైన ఆయన బుద్ధి సూక్ష్మత ఉరకలు వేసే ఆయనలోని ఉత్సాహాన్ని చూసి లజపతిరాయ్, అరవిందఘోష్‌వంటి పెద్దలు ముగ్ధులైనారు.

సూరత్ సమావేశంలో కాంగ్రెసు సంస్థలు అతివాదులు, మితవాదుల పేరిట రెండు చీలికలైంది. బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్, అరవిందఘోష్, లాలాలజపతిరాయ వంటి అతివాద నాయకుల సరసన చేరి, చిదంబరం పిళ్లై అతివాద ఉద్యమంలో అగ్రశ్రేణిలో నిలిచాడు.

సుబ్రహ్మణ్యశివ, నీలకంఠ బ్రహ్మచారి, వి.వి. యస్. అయ్యర్‌లతో పాటుగా చిదంబరం పిళ్లై తమిళనాట జాతీయోద్యమంలో తీవ్రవాద భావాలతో తమ కార్యక్రమాలను కొనసాగించారు. ఆయన ఉపన్యాసాలు బ్రిటిషు ప్రభుత్వానికి గుండె బెదురు పుట్టించాయి. సెగలుకక్కే అగ్ని పర్వతంలాగా ఆయన బ్రిటిషు వారికి కనిపించేవాడు.

అసాధారణమైన దేశభక్తి, గుండె నిబ్బరం, వీరోచితమైన త్యాగబుద్ధి ఆయన సొత్తు. తమిళ ప్రాంతాలలో జాతీయోద్యమానికి ఆయన పట్టుగొమ్మగా నిలిచారు.

ఆరోజుల్లో ఇండియా ఓడ వర్తకం అంతా బ్రిటిషు కంపెనీల చేతుల్లోనే వుండేది. ట్యూటికొరన్ చిన్న రేవు పట్టణమే అయినా సముద్ర ప్రయాణీకుల రద్దీ, సరుకుల రవాణా ఎక్కువ రద్దీగా వుండేది. సరకుల చేరవేతకు బ్రిటిషు కంపెనీలు ఎక్కువ ఛార్జీలను వసూలు చేసేవి. ఈ ఛార్జీలు భారతీయ వర్తకులకు భాదకరంగా వుండేవి. ఈ విషమ పరిస్థితులన్నింటినీ చిదంబరం పిళ్లై జాగ్రత్తగా గమనించేవాడు. భారతీయ వర్తకుల నష్టాలను బాగా అర్థం చేసుకున్నాడు. బ్రిటిషు కంపెనీల కుత్సిత, కుటిల ప్రయత్నాలకు అడ్డుకట్ట వేయాలనుకున్నాడు.

స్థానిక భారతీయ వర్తకులనందర్నీ సమావేశపరచి, వారి సహకారంతో చిదంబరం పిళ్లై "స్వదేశీ స్టీమ నేవిగేషన్" అనే కంపెనీని స్థాపించారు. తమకు పోటీగా భారతీయులు నెలకొల్పిన యీ కంపెనీ నడవకుండా వుండేదుకు ఆసమయంలో బ్రిటిషు కంపెనీలు తీవ్రంగా ప్రతిఘటించాయి.

పదిరూపాయల షేర్లతో మొత్తం పదిలక్షల పెట్టుబడితో స్వదేశీ స్టీమ నేవిగేషన్ సంస్థ స్థాపించబడింది. ప్రజల సానుభూతి, స్థానికవర్తకుల ప్రోద్బలమూ ఆకంపెనీకి వుండేవి. బ్రిటిషు కంపెనీల గుత్తాధిపత్యాన్ని ఎదుర్కోవడమే చిదంబరంపిళ్లై లక్ష్యంగా వుండేది. పరాయిదేశం నుండి వచ్చి, భారత దేశంపై పెత్తనంగావిస్తూ, భారతీయుల్నే బానిసలుగా చేసిన బ్రిటిషు వారి కుటిల రాజనీతిని అంతమొందించడమే ధ్యేయంగా చిదంబరం పిళ్లై ప్రయోగాత్మకంగా బ్రిటిషు కంపెనీలకు పోటీగా, స్వదేశీ కంపెనీని నెలకొల్పాడు.

స్వదేశీ ఉద్యమం చిదంబరం పిళ్లై పైన బలంగా పనిచేసింది. అంతేగాక సూరత్‌సభల తర్వాత వందేమాతరం ఉద్యమం దేశంలో ఉవ్వెత్తున లేచింది.

జాతీయ భావం, దేశభక్తి దేశం అంతటా పెల్లుబికిన ఆ సమయంలో చిదంబరం పిళ్లై కంపెనీ స్థాపన ఆయనలోని జాతీయ భావానికి ప్రతిబింబంగా నిలిచింది.

తమిళనాడులో సముద్రతీరాన వున్న ట్యూటికారన్ పట్టణ ప్రముఖ నాయకులల్లో ఒకరైన చిదంబరం పిళ్లై స్థానిక ప్రజలలో అపారమైన పలుకుబడిని సంపాదించాడు. జాతీయ పోరాట కార్యక్రమాలను రూపొందించి, ప్రజలను చైతన్య పరిచి ముందుకు నడిపించడంలో చిదంబరం పిళ్లై మరుకైన పాత్ర వహించేవారు.

స్వదేశీ స్టీమ్ నావిగేషన్ కంపెనీ స్థాపించిన తరువాత బ్రిటిషు వారి కోపానికి చిదంబరం పిళ్లై మరింతగా గురిఅయినాడు. అప్పటి దాకా గుత్తాదికారం అనుభవిస్తూ వచ్చిన బ్రిటిషు కంపెనీలు కక్షకట్టి స్వదేశీ కంపెనీని అణచివేసే ప్రయాత్నాలను మొదలెట్టాయి. బాగా అభివృద్ధి చెంది, తగినంత ఆర్థిక సౌష్టవం కలిగి వున్న బ్రిటీషు కంపెనీల ఆధ్వర్యంలో పొగ ఓడలు అనేకం వుండేవి. కానీ చిదంబరం పిళ్లై నడిపే స్వదేశీ కంపెనీ కేవలం రెండే రెండు ఓడల్ని కలిగివుంది. అయినప్పటికీ స్వదేశీ కంపెనీ నదురూ బెదురూ లేకుండా బ్రిటిషు కంపెనీల సవాల్‌ను ధైర్యంగా ఎదుర్కొని వ్యాపారంలో నిలబడి కొనసాగుతూ వుంది.

అయినప్పటికీ బ్రిటిషు కంపెనీలు కొత్త రకమైన ఎత్తుడగలను ప్రయోగించి స్వదేశీ కంపెనీని అణగద్రొక్కే ప్రయత్నాలను చేస్తూనే వున్నాయి. అప్పట్లో బ్రిటిషు కంపెనీలు ట్యూటికారన్ నుండి సిలోన్‌లోని కొలంబోకు వసూలు చేసే ప్రయాణీకుల ఛార్జీ అయిదు రూపాయలుండేది. ఒక్కసారిగా యీ ఛార్జీని బ్రిటిషు కంపెనీలు ముప్పావలాకు తగ్గించాయి. స్వదేశీ కంపెనీని వ్యాపార రంగం నుంచి తరిమి కొట్టే ప్రయత్నాలలో యిది ఒకటి. అందుకోసం అన్ని రకాల క్షుద్రమైన పద్ధతులకు బ్రిటిషు కంపెనీలు దిగజారాయి.

చిందంబరం పిళ్లై ధైర్యశాలి. అచంచలమైన దేశభక్తుడు. కనుక బ్రిటిషు కంపెనీల ఎత్తుగడలను ఎదుర్కొన్నాడు. అయితే బ్రిటిషు అధికారుల సహాయం సానుభూతి బ్రిటిషు కంపెనీలకు మాత్రమే వుండేవి. బ్రిటిషు కంపెనీలకు పోటీగా వెలకొల్పిన స్వదేశీ రవాణా కంపెనీ పట్ల బ్రిటిషు అధికార్లు సైతం కక్షకట్టి దానికి అనేక ప్రతిబంధకాల్ని కల్పించసాగారు. అయితే ఎంతగా పోరాడినా చిందబరం పిళ్లై ప్రయత్నాలు ఫలించలేదు. స్వదేశీ కంపెనీని మూసివేయవలసి వచ్చింది.

బ్రిటిషు గుత్తాదిపత్యానికి వ్యతిరేకంగా భారతీయ నౌకా వాణిజ్యాన్ని రూపొందించి స్వదేశీ సంస్థలకు శ్రీకారం చుట్టిన చిదంబరం పిళ్లే ప్రయత్నం వృధాకాలేదు. అనంతర కాలంలో భారతీయ వర్తకులు నౌకా వ్యాపారంలో

నిల్రదొక్కుకునేందుకు దోహదం చేసింది. భారతీయ వర్తకుల్లో జాతీయ భావం పెల్లుబికింది.

స్వదేశీ కంపెనీ మూతపడడంతో చిదంబరం పిళ్లై నిరుత్సాహపడలేదు. విదేశీ యాజమానుల దోపిడికి గురిఅవుతున్న భారతీయ కార్మికుల హక్కుల సాధనకు చిదంబరం పిళ్లై నడుం బిగించాడు. భారతీయ కార్మికులను సంఘటిత పరిచాడు.

బ్రిటీష ప్రభుత్వం చిదంబరం పిళ్లై మీద కక్ష వహించి, ఆయనను ఒక రాజద్రోహ నేరంలో యిరికించి యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. ఆయన ఓర్పుతో, ధైర్యంతో జైలు శిక్షను అనుభవించసాగాడు. అలాంటి నిరాశాపూరిత వాతావరణంలో కూడా ఆయన ఆత్మస్థైర్యాన్ని కోల్పోలేదు.

చిందంబరం పిళ్లైకు విధించిన శిక్ష అన్యాయంగా విధించబడిందని భావించిన ఆనాటి "ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేట్" జాన్‌మర్లీ స్వయంగా జోక్యం కలిగించుకుని పునర్విచారణ కోసం ఆ కేసును మద్రాసు హైకోర్టుకు పంపాడు. హైకోర్టు వారు యావజ్జీవ శిక్షను ఆరేళ్ల కఠిన కారాగార శిక్షగా తగ్గించారు. మంచి ప్రవర్తన కారణంగా ఆరేళ్ల శిక్షను మరి కొంత గ్గింది. 1911లో ఇంగ్లడు రాజు పట్టాభిషేకం సందర్భంగా ఆయన విడుదల చేయబడినాడు.

అయితే బ్రిటిష ప్రభుత్వం ఆయన ప్లీడరీ పట్టాని రద్దు చేసింది. ఆయన ప్రాక్టీసు చేసే అవకాశం లేకుండా పోయింది. జీవనోపాధి కరువైంది తిరిగి అతి ప్రయత్నం మీద ప్లీడరీ గిరీ ఆయనకు పునరుద్ధరింపబడింది. కొంత కాలానికి తిరిగి ఆయన ప్రాక్టీసు మొదలెట్టారు. దానితో పాటు ఆయన సంఘ సంక్షేమ కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన్నారు. తదుపరి ఆయన ట్రేడ్ యూనియన్ రంగంలో అడుగుపెట్టారు. మద్రాసులోని పెరంబూర్ రైల్వే వర్కర్సు యూనియన్‌కి అధ్యక్షులైనారు. దేశ రాజకీయ రంగంలో ఆయన అరవింద ఘోష్‌కు అతిసన్నిహితులుగా వుండేవారు.

చిదంబరం పిళ్లై పత్రికా రంగంలో అడుగుపెట్టారు. కొన్నాళ్లు "వివేకవాణి" 'హిందూనేషన్' పత్రికలకు సంపాదకత్వ బాధ్యతను చేపట్టారు. ప్రజల్లో జాతీయ భావాలను పెంపొందించారు.

జైళ్లలోనూ, బయటాకూడా బ్రిటిష ప్రభుత్వం చిదంబరం పిళ్లైను నానా యాతల్ని పెట్టింది. దాని ఫలితంగా ఆయన ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. 1936లో ఆయన స్వర్గస్తులయ్యారు.

తన ఐశ్వర్యం, మేధస్సు, శక్తియుక్తులన్నింటినీ దేశసేవలో తృణప్రాయంగా అర్పించిన ధన్యజీవి చిదంబరం పిళ్లై. తమిళ స్వాతంత్ర్య సమర యోధుల్లో చిదంబరం పిళ్లై అజరామత మైన స్థానాన్ని అలంకరించాడు. భావిభారత పౌరులకు ఆయన జీవితం స్ఫూర్తిదాయకం. అనుసరణీయం. అయన ధన్యజీవి.

# నైటింగేల్ (కవికోకిల) శ్రీమతి సరోజినీ దేవి నాయుడు

జాతీయ పోరాట కాలంలో అఖిల భారత స్థాయిలో కాంగ్రెసు సంస్థ అధ్యక్ష పదవిని అలంకరించిన యిద్దరు మహిళల్లో శ్రీమతి సరోజినీ నాయుడు ఒకరు. 1917లో అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షురాలిగా శ్రీమతి అనిబిసెంటు ఎన్నికయ్యింది. ఈమె ఐరిష్ వనిత. భారతదేశంలో స్థిరపడి భారతీయురాలిగా, యీ దేశ స్వాతంత్ర్యం కొరకు పోరాడిన విదేశీ వనిత. తన జీవిత కాలమంతా భారతదేశ సౌభాగ్యానికి కృషి చేసి, తుదకు మద్రాసులో అడయారు వద్ద దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించి, అక్కడే దివంగతురాలైంది.

శ్రీమతి సరోజిని సాంప్రదాయిక బెంగాలీ బ్రాహ్మణ కన్య. ఈమె తండ్రి అఘోరనాధ చటోపాధ్యాయ, వీరు బెంగాలీలు. కలకత్తానుండి అఘోరనాధ చటోపాధ్యాయ కుటుంబం హైద్రాబాద్‌కు తరలి వచ్చింది.

హైద్రాబాద్‌లో చాదర్‌ఘాట్‌లో వున్న నిజాం ఉన్నత కళాశాలలో అఘోరనాధ చటోపాధ్యాయ ఉపాధ్యాయునిగా వుండేవారు.

రాజరామ్ మోహనరాయ్ చేత ప్రారంభించబడిన బ్రహ్మసమాజం దేశవ్యాపితంగా విస్తరించి, అనేకమంది మేధావులు, విద్యావంతులచేత ఆకర్షించబడింది. హైందవ సమాజంలో పాతుకపోయిన ఛాందస, మూఢాచారాల్ని నిర్మూలించి, ఏకేశ్వరోపాసన ప్రతిపదికగా స్థాపించబడిన బ్రహ్మ సమాజంలో కులాలతో, శాకలతోనిమిత్తం లేకుండా సంస్కరణ దృష్టికల వాళ్లెందరో సభ్యులుగా చేరారు. బ్రహ్మ సమాజం ఆధ్వర్యంలో కులాంతర, మతాంతర వివాహాలు జరిగాయి. అంటరానితనానికి వ్యతిరేకంగా వుద్యమం సాగింది. మద్యపానానికి వ్యతిరేకంగా ప్రచారం చేయబడింది. కులం, వర్గం, వర్ణం లేని విశాల భావాలతో కూడిన మానవతావాద ఉద్యమమైన బ్రహ్మ సమాజం దేశంలో ఎందరినో ప్రభావితుల్ని చేసింది.

ఆంధ్రలో రాజమహేంద్రవరం కేంద్రంగా సంఘ సంస్కరణలకు శ్రీకారం చుట్టిన నవయుగ వైతాళికుడైన శ్రీకందుకూరి వీరేశలింగంగారు, రఘుపతి వేంకటరత్నంనాయుడు, కోకా సుబ్బారావు తదితరులు బ్రహ్మసమాజ ఆదర్శాలకు కృషి చేసారు.

రాజారామ్ మోహనరాయ్ కలకత్తా నివాసి. బ్రహ్మసమాజం అవతరణ కలకత్తాలోని చిత్‌పూర్ వీధిలో 1928లో శ్రీరాజారామ్‌మోహనరాయచే నెలకొల్ప బడింది. మేధావంతులు, విద్యావంతులైన బెంగాలీలు అన్ని రంగాల్లోనూ ముందంజలో వుండేవారు.

కలకత్తా నుంచి హైద్రాబాద్‌కు తరలి వచ్చిన అఘోరనాధ్ చటోపాధ్యాయ కుటుంబం కూడా బ్రహ్మ సమాజలో చేరి దాని విస్తరణకు పాటు పడినవారే.

సరోజినీ దేవి కవికోకిల అని బిరుదుపొందింది. రవీంద్రనాధ్ ఠాగూర్‌చే ప్రశంసింపబడిన సరోజినీదేవి ఆంగ్లంలో బెంగాలీలో ఎన్నో కవితలను రచించడమే గాకుండా, కోకిల స్వరంతో గానం చేయగల గాయని, ఆమె గాన మాధుర్యం కోకిలను గుర్తు చేయగలదు. అందువల్ల ఆమెకు కవికోకిల (నైటింగేల్) అని బిరుదు యివ్వబడింది.

ఆంధ్రదేశంతో ఆమె జీవితం పెనవేసుకపోయింది. చివరకు ఆమె ఆంధ్రులకు కోడలు అయింది. మదరాసు నగరంలో డాక్టరుగా వున్న శ్రీ ముత్యాల గోవిందరాజుల నాయుడి గారితో సుప్రసిద్ధ కవయిత్రి సరోజినీదేవికి బ్రహ్మ సమాజం ఆధ్వర్యంలో వర్ణాంతర, రాష్ట్రాంతర వివాహం జరిగింది. డాక్టర్ ముత్యాల గోవిందరాజుల నాయుడు తెలుగు బ్రాహ్మణేతరుడు. వీరి వివాహానికి పెద్దగా శ్రీ కందుకూరి వీరేశలింగంగారు ఆధ్వర్యం వహించాడు. నవయుగాంధ్ర వైతాళికుడు, నవ్యాంధ్ర పితామహుడైన శ్రీ కందుకూరి వీరేశలింగం గారి ఆధ్వర్యంలో యీ వివాహం ఆదర్శవంతంగా 1998లో జరిగింది. బెంగాలీ కన్య సరోజినీ దేవి తర్వాత శ్రీమతి సరోజినీ నాయుడిగా పిలువబడింది.

తదనంతరం శ్రీమతి సరోజినీనాయుడు జాతీయోద్యమంలో ప్రముఖపాత్ర వహించింది. అప్పట్లో శ్రీయుతులు గోపాలక్రిష్ణగోఖలే, దాదాబాయి నౌరోజీ, డాక్టర్ రాస్ బిహారీ ఘోష్, పండిత మదన మోహన్ మాలవ్యా, సత్యేంద్ర ప్రసన్న సిన్హా, శ్రీమతి అనిబిసెంట్, మహాత్మాగాంధీజి, పండిట్ మోతీలాల్‌నెహ్రూ, దేశబంధు చిత్తరంజన్‌దాస్, జాతీయ నాయకులుగా ఉద్యమాన్ని నడుపుతూ కాంగ్రెసు మహాసభలకి అధ్యక్షత వహించి, జాతీయ కాంగ్రెసును నడుపుతూ వుండేవారు.

1924లో అఖిల భారత కాంగ్రెసు మహాసభ బెల్గాంలో జరిగినప్పుడు మహాసభ అధ్యక్షులుగా గాంధీజీ ఎన్నికైనారు. ఆ మరుసటి సంవత్సరమే 1925లో కాన్పూర్‌లో అఖిల భారత కాంగ్రెసు సభ జరిగినప్పుడు, శ్రీమతి సరోజినీనాయుడు కాన్పూర్ సభకు అధ్యక్షురాలిగా ఎంపిక అయ్యింది.

దిగ్గిగంతులైన జాతీయ నాయకుల సరసన శ్రీమతి సరోజినీనాయుడు అఖిల భారత కాంగ్రెసు స్థాయిలో జాతీయ నాయకురాలిగా జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించింది. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షురాలిగా ఎన్నికైన

సుప్రసిద్ధ మహిళగా ఆమె ఖ్యాతి గాంచింది.

గాంధీజీ నాయకత్వంలో సాగిన జాతీయ పోరాటంలో సహాయ నిరాకరణ ఉద్యమంలోనూ, ఉప్పుసత్యాగ్రహంలోనూ, క్విట్ ఇండియా ఉద్యమంలోనూ చురుకుగా పాల్గొని అనేకమార్లు జైలుకెళ్లింది. బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ధైర్యంతో పోరాడింది.

శ్రీమతి సరోజినీ నాయుడు భారతదేశం గర్వించదగిన దేశభక్తురాలు. సుప్రసిద్ధ కవయిత్రి, గానకోకిల, సంఘ సంస్కరణవాది. విదుషీమణి.

శ్రీమతి సరోజినీనాయుడు కుమార్తె కుమారి పద్మజానాయుడు. రాజకీయాల్లో జీవితం పండిన శీమతి సరోజిని నాయుడు తన కుమార్తెను ఆదర్శవంతంగా పెంచి, పెద్ద చేసింది.

దేశానికి స్వతంత్రం లభించిన తరువాత స్వతంత్ర భారత దేశానికి జవహర్లాల్ నెహ్రు ప్రధాన మంత్రి అయినాడు. నెహ్రు హయాంలో కుమారి పద్మజా నాయుడు గవర్నరుగా ఉన్నత పదవిని నిర్వహించింది.

నెహ్రుతో సరోజినీ నాయుడి కుటుంబానికి సన్నిహిత సంబంధాలు ఉండేవి. దేశానికి సరోజినీ నాయుడు చేసిన సేవలు జవహర్లాల్ నెహ్రూను ఆకట్టుకున్నాయి. అందువల్లనే కుమారి పద్మజానాయుడికి తన పరిపాలనలో గవర్నరు పదవిని అప్పగించి మన్నన చేసాడు.

సరోజినీనాయుడి సోదరుడే హరీంద్రనాధచటోనాధ్యాయ, హారీన్ అని పిలవబడే హరీంద్రనాధ్ చటోపాధ్యయ కూడా గొప్ప కవి. అభ్యుదయ భావాలు గలవాడు. ఈయన విజయవాడ నియోజక వర్గం నుండి కమ్యూనిస్టుల సహకారంతో పార్లమెంటుకు ఎన్నుకోబడినాడు.

సరోజినీనాయుడి కుమారుడు డాక్టర్ జయసూర్య హైద్రాబాద్ నగరంలో సుప్రసిద్ధ వైద్యునిగా వైద్యరంగంలో సేవల్ని అందిచాడు. వీరు పట్టణ ప్రముఖుల్లో ఒకరుగా వుండి, హైద్రాబాద్ నగరాభివృద్ధికి కృషి చేసాడు.

ఎక్కడో బెంగాల్‌లో పుట్టి, ఆంధ్రులకు కోడలుగా వచ్చి ఆత్మీయ నాయకురాలిగా పేరుగాంచి, దేశరాజకీయాల్లో ప్రముఖ పాత్రవహించి కవయిత్రిగా, కవికోకిల బిరుదు వహించిన శ్రీమతి సరోజినీ నాయుడు జీవితం మహిళాలోకానికే ఆదర్శప్రాయమైంది.

హైద్రాబాద్ నివాసిగా ఆమె హైద్రాబాద్ సికింద్రాబాద్ జంటనగరాల ప్రజల అభిమానానికి పాత్రురాలైంది. అందుకే సికింద్రాబాద్‌లో ఒక వీధికి సరోజినీదేవి రోడ్డుగా నామకరణం చేయబడింది. నగరంలో పేరుపొందిన సరోజినీ కంటి ఆసుపత్రి జగమెరిగినదే. శ్రీమతి సరోజినీ దేవి జీవితం ఆంధ్రుల జీవితంతో పెనవేసుకొని వున్నది. ఆమె జీవితం ధన్యమైంది.

# మన్యం వీరుడు అల్లూరి సీతారామరాజు

భారతదేశం బానిసత్వంలో మగ్గుతున్న రోజులవి. తెల్ల దొరలు యిష్టారాజ్యంగా, తమ దోపిడీని కొనసాగిస్తూ, నిరంకుశ చట్టాలతో పరిపాలిస్తున్న కాలమది. స్వదేశంలోనే భారతీయులు బానిసలుగా పడివుంటూ, జీవించే హక్కులను, పనిచేసుకొనే హక్కులను కూడా పరాయి పాలకుల దయాధర్మాలపై ఆధారపడి పొందవలసిన దౌర్భాగ్య పరిస్థితులు దేశమంతటా ఏర్పడి వున్నాయి.

దేశంలోని విద్యావంతులు, మేధావులు, చైతన్యవంతులైన ప్రజలు స్వాతంత్ర్యం కోసం పోరాటం కొనసాగిస్తూ వుండగా, జాతీయభావం అప్పుడప్పుడే ప్రజల్లో మొలకలెత్తి, విప్పారుతోంది. ఉద్రేకవంతులైన యువకిశోరాలు జూలు విప్పుకొని తెల్లదొరల గుండెలమీదికి పంజా విసురుతున్న సంఘటనలు అక్కడక్కడా ఎగసిపడుతున్నాయి.

గాంధీ, తిలక్, చిత్తరంజన్‌దాస్, బిపిన్ చంద్రపాల్, నేతాజీ వంటి దేశభక్తులు ప్రజల్లో జాతీయ భావాల్ని కలిగిస్తూ, జాతీయ పోరాటాన్ని ముందుకు నడిపిస్తున్నారు.

ఇట్టి చారిత్రక సంధికాలంలో, ఆంధ్ర దేశంలో, గోదావరీ నదీ తీరంలో అల్లూరి సీతారామరాజు ప్రభవించాడు. పవిత్రమైన దేశమాత దాస్యశృంఖలాలను బ్రద్ధలు చేసేందుకు అవసరమైన ఒక చారిత్రిక కర్తవ్యం అల్లూరి సీతారామరాజును తన పొత్తిళ్లల్లో పెంచి పెద్దచేసింది.

నేటి పశ్చిమ గోదావరిజిల్లా, భీమవరం సమీపంలోని మోగల్లు గ్రామం అల్లూరి కుటుంబీకుల జన్మస్థానం, అది క్షత్రియ కుటుంబం. అల్లూరివారి పూర్వ కుటుంబకులు గుంటూరు జిల్లాలోని చిలకలూరిపేట సమీపంలోని బొప్పూడి ప్రాంతం నుండి గోదావరినదీ తీరానికి వలస పోయినట్లు కొందరు చెబుతున్నారు.

అల్లూరి వెంకట్రామ రాజు, సూర్యనారాయణమ్మ దంపతులకు శ్రీరామరాజు 1897 జూలై 4వ తేదీన జన్మించాడు. వెంకట్రామరాజుగారు అయిదుగురు అన్నదమ్ములలో రెండవవారు. అయనకు రామచంద్రరాజు అనే అన్నగారు రామకృష్ణరాజు, రంగరాజు, రామభద్రరాజు అనే ముగ్గురు తమ్ముళ్లు వుండేవారు.

శ్రీరామరాజు పినతండ్రులలో నొకరైన రామకృష్ణంరాజుగారు ప్రభుత్వోద్యోగాలలో ఉన్నత పదవులను అధిష్టించి, చివరకు డిప్యూటీ కలెక్టరుగా 1925లో

ఉద్యోగ విరమణ చేసారు. మరొక పినతండ్రి రంగరాజుగారు జాతీయ భావాలు గలవాడు. ఆయన గాంధీ మహాత్ముని దక్షిణాఫ్రికా సత్యాగ్రహ ఉద్యమానికి కొంతమంది మిత్రులతో కలిసి కొంత సొమ్ము విరాళంగా సేకరించి పంపారు. రామకృష్ణరాజుగారు కూడా జాతీయ భావాలు గలవారు. సంఘసంస్కరణాభిలాషి. ఉద్యోగ విరమణ చేసిన తరువాత ఖద్దరు పరిశ్రమ, ప్రకృతి చికిత్సాలయాన్ని, హరిజన సేవా సంఘాన్ని స్థాపించి సంఘసేవ చేసేవారు. క్షత్రియ బాల వితంతువులకు పునర్వివాహాలు చేయించిన సంఘసంస్కర్తగా ఆయనకు పేరుండేది.

శ్రీ రామరాజు తండ్రి వెంకటూమరాజుగారు స్కూలు ఫైనలు వరకు చదువుకొన్నారు. సంస్కృతంలో కూడా ఆయనకు మంచి ప్రవేశం వుంది. వెంకట్రామరాజు గారికి ఫోటోగ్రఫీ అంటే చాలాయిష్టం. అందువలన బొంబాయి వెళ్లి అక్కడ ఫోటోగ్రఫీని నేర్చుకొని స్వస్థానానికి చేరుకున్నారు. నరసాపురం, తణుకు ఇతరచోట్ల ఫోటోస్టుడియోలు నెలకొల్పి, చివరకు రాజమండ్రి వచ్చి, ఫోటోగ్రాఫర్ వృత్తిని కొనసాగించాడు. ప్రభుత్వం కోరికపై రాజమండ్రిలోని సెంట్రల్ జైలులో ఫోటోలను తీసి అందజేస్తూ వుండేవాడు.

వెంకట్రామారాజు గారు గొప్ప జాతీయవాది. జాతీయోధ్యమంలో పాల్గొన్నాడు. 'వందేమాతరం' వంటి గీతాలతో ఆయన యిల్లు కళకళలాడుతూ వుండేది. చిత్రకారుడు కూడా అయినందున బాలగంగాధరతిలక్, లాలాలజపతిరాయ్, గాంధీజీ మొదలైన జాతీయనాయకుల ఫోటోలు తీసి, చిత్రించి ప్రదర్శిస్తూ వుండేవారు.

జాతీయభావాలు, సంఘసంస్కరణాభిలాష, సాంఘిక సేవా కార్యక్రమాలు వెల్లివిరిసిన తాతతండ్రుల కుటుంబంలో జన్మించినందున శ్రీరామరాజు చిన్నప్పటి నుండి ఉత్తమ భావాలతో పెరిగారు. సంస్కృతం, తెలుగు భాషలు పరిడవిల్లిన కుటుంబంలో పుట్టి పెరగడం వల్ల, శ్రీరామరాజుకు ఆ భాషలపట్ల మమకారం ఏర్పడింది. ఆంగ్ల భాషపై నిరసన భావం ఆయనలో ఏర్పడింది. అందువలనే ఆయన ఏ పాఠశాలలో కూడా ఎక్కువ కాలం ఆంగ్ల విద్యను అభ్యసించలేకపోయాడు.

రాజమహేంద్రవరం, చుట్టు ప్రక్కల గ్రామాలలో మంచి ఫోటోగ్రాఫర్‌గా పేరు తెచ్చుకొని, చక్కని చిత్రకారుడిగా ప్రసిద్ధి చెందిన శ్రీ వెంకట్రామరాజుగారు కలరా వ్యాధితో హఠాత్తుగా మరణించారు. శ్రీరామరాజుకు తండ్రిచనిపోయేనాటికి పదేళ్ల వయస్సు. తల్లిదండ్రులకు శ్రీరామరాజు జ్యేష్టపుత్రుడు. చెల్లెలు సీతమ్మ, తమ్ముడు సత్యనారాయణరాజు చంటి బిడ్డలు. శ్రీరామరాజు ఆ సమయంలో మొదటిఫారం చదువుతున్నాడు. తల్లి సూర్యనారాయణమ్మపై పిల్లల సంరక్షణ,

కుటుంబభారం పడింది. బిడ్డల తిండి బట్ట, చదువులకు ఆమె బాధ్యత వహించవలసి వచ్చింది. శ్రీ రామరాజు బాల్య జీవితంలో యిది అనుకోని సంఘటన, తండ్రి మరణంతో శ్రీరామరాజు చిన్న వయస్సులోనే బీదరికపు బాధల్ని అనుభించవలసి వచ్చింది.

భర్తచనిపోయిన తరువాత, నారాయణమ్మగారు భీమవరంవద్ద నున్న కొవ్వాడలో చెల్లెలు యింటికి చేరింది. శ్రీ రామరాజును భీమవరం బోర్డు మిడిల్ స్కూలులో మొదటి ఫారంలో చేర్పించింది. శ్రీ రామరాజుకు ఆంగ్ల విద్యపై ఆసక్తిలేదు. ఆదీగాక రోజూ రెండు మైళ్లు నడిచివెళ్లి చదువుకోవాల్సి వచ్చింది. అయిష్టంగానే భీమవరం స్కూలుకు వెళ్లి వస్తూ వుండేవాడు.

ఇంతలో పిన తండ్రి రామకృష్ణరాజుగారు రామచంద్రపురం మేజిస్ట్రేటుగా వచ్చి, నారాయణమ్మ గాని బిడ్డలతో సహా తన వద్దకు రప్పించుకొని, శ్రీరామరాజును రెండవ ఫారంలో చేర్పించారు. ఆ సంపత్సరం రామరాజు బాగా చదివి రెండవ ఫారం ప్యాసైనాడు. మరుసటి సంవత్సరం రామకృష్ణరాజుగారికి కాకినాడ బదిలీ అయింది. అక్కడ రామరాజు మూడవ ఫారం ప్యాసయ్యాడు. పిమ్మట విశాఖపట్నంలోని మిషన్‌స్కూల్లో నాల్గవ ఫారంలో రామరాజును చేర్పించారు. కానీ విశాఖపట్నంలో ఆట్టే చదువు సాగలేదు. రామరాజుకు కలరా వచ్చి జబ్బు చేసింది. తదుపరి నరసాపురంలో నాలుగవ ఫారం చదవడమే గాక, దాన్ని పూర్తిచేయలేకపోయాడు.

పినతండ్రి రామకృష్ణరాజు గారు ఉద్యోగరీత్యా అనేక పట్టణాలకు బదిలీ అవుతూ వుండడంవల్ల, ఆయనతో పాటు తిరుగుతూ వున్న రామరాజుకు ఆయా పట్టణాలతో పరిచయం ఏర్పడి లోకజ్ఞానం, అవగాహన పెరిగింది.

శ్రీరామరాజుకు చదువుపట్ల కంటే ఇతర వ్యాసంగాలపట్ల మక్కువ ఎక్కువగా వుండేది. వూళ్లు తిరగడం, వంటరిగా వుంటూ ఆలోచిస్తూ గడపడం, ఆయనకు యిష్టంగా వుండేది.

కొవ్వాడ గ్రామంలో వుంటూ వుండగా, సమీప గ్రామంలో బంధుజనులతో ఆయనకు పరిచయాలు ఏర్పడ్డాయి. అందువల్ల తరుచుగా చించివాడ (నరసాపురం తాలుకా) వెళ్లివస్తుండేవాడు. ఆ గ్రామ మునసబుగారికి ఒక మంచిగుర్రం వుండేది. అది అలవికాని గుర్రం. అయినా రామరాజు పట్టుదలతో నేర్పుగా దాన్ని స్వాధీనం చేసుకొని, స్వారీ చేయడం నేర్చుకున్నాడు.

రాజమహేంద్రవరంలో విద్యాభ్యాసం చేసే రోజుల్లో తమకుటుంబ బంధువైన అల్లూరి రామరాజుగారి యింట్లో శ్రీరామరాజునివసిస్తూ వుండేవాడు. రామరాజుగారు యోగాభ్యాసం చేస్తూ వుండేవాడు. ఆయన గొప్ప వేదాంతికూడా. ఆయనవద్ద

శ్రీ రామరాజు వేదాంతాన్ని, యోగాభ్యాస్యాన్ని నేర్చుకున్నాడు.

కాకినాడ పట్టణ జీవితమంతా నాటకప్రదర్శనలు, వ్యాయామ క్రీడలతో గడిచింది. అక్కడ వున్న తాలింకానాలో బస్కీలు, దండీలు, కర్రతిప్పడం, కత్తి సాము వంటి విధ్యలను నేర్చుకున్నాడు.

తుని రాజాగారి ఆస్థాన కవీశ్వరుడు నీలాద్రిరాజుగారింట్లో కొంతకాలం శ్రీరామరాజు వుండటం జరిగింది. నీలాద్రిరాజుగారి వద్ద శ్రీరామరాజు కవిత్వం కావ్యాలు చదవడం, పద్యాలు రాయడం నేర్చుకున్నాడు. నీలాద్రిరాజుగారు జ్యోతిష్కుడు కూడా అయినందున, శ్రీరామరాజు ఆయనవ జ్యోతిష్యం నేర్చుకున్నాడు.

విశాఖపట్నంలో విద్యనభ్యసిస్తున్న రోజుల్లో శ్రీరామరాజు జీవితంలో ఎప్పటికీ మరచిపోలేని సంఘటన జరిగింది. ఆ సంఘటన ఆయన జీవితంలో గొప్ప ప్రభావాన్ని కలిగించింది. పాఠశాలలో శ్రీరామరాజు ప్రతి ఒక్కరికీ అభిమాన పాత్రుడిగా వుండేవాడు. ఠీవిగా, హుందాగా వుండే రామరాజు సున్నితమనస్కుడు కూడా. సీత అనే సంపన్నుని కుమార్తై ఆయన తరగతిలో వుండేది. ఆమెకు రామారాజు అంటే అవ్యాజానురాగం ఏర్పడింది. ఆమె చక్కని చుక్క. పైగా సంపన్నుల బిడ్డ. రామరాజుతో ఆమె కల్పించుకొని మాట్లాడుతూ, సన్నిహితంగా వుండేది. శ్రీ రామరాజు కూడా సీత అంటే యిష్టం ఏర్పడింది. ఇద్దరూ ఒకరిని విడిచి మరొకరు వుండలేక పోయారు. అయితే శ్రీ రామరాజుకు సీతపట్ల కేవలం అభిమానం మాత్రమే వుండేది. కానీ ఒకనాడు సీత తన మనస్సులోని కోర్కెను వెల్లడించి, తనను వివాహంచేసుకోవాలని అడిగింది. అది గగనకుసుమం వంటిదనీ, యిద్దరి మధ్యా అంతస్థులు, కులం, అడ్డువచ్చి పెద్దలు వివాహానికి అంగీకరించరనీ సీతకు నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. కానీ సీత యీ ఎడబాటుకు తట్టుకోలేకపోయింది. చివరికి యీ భగ్నప్రేమ కారణంగా సీత చనిపోయింది. సీతమరణం శ్రీరామరాజును ఎంతగానో బాధపెట్టింది. తన ఎడబాటు వల్ల సీత జీవితం మరొకరితో సుఖంగా గడుస్తుందని ఆశించిన శ్రీరామరాజు మానసికంగా వికలుడై, తనపేరుకు ముందు సీత పేరు వుండేట్టు మార్చుకొని, అప్పటి నుండి 'సీతారామరాజు'గా వ్యవహరింపబడినాడు.

బాల్యం, విద్యార్థి దశ అంతా యీ విధంగా సీతారామరాజు జీవితకాలంలో అస్తవ్యస్తంగా, దురదృష్టకరంగా సాగివచ్చింది. బాల్యంలోనే తండ్రిమరణం, పేదరికం, బంధువులపై ఆధారపడి జీవించవలసి రావడం, సీతారామరాజు మనస్సును కలతపెట్టాయి. తనకు అత్యంత ఆప్తురాలిగా వున్న సీత మరణం ఆయనకు

జీవితంపైన విరక్తి కలిగించాయి.

సీతారామరాజు పట్టుదల, ధైర్యంగలవాడు. అందువలన జీవితంలో ఎంతలేసి కష్టాలు ఎదురైనా, వాటిని లెక్కచేసేవాడుకాదు. అంతే కాదు సర్వసాధారణమైన నిత్యప్రాపంచిక సుఖాల పట్ల మొదటినుంచీ నిర్లిప్త భావాన్నే కలిగి వుండేవాడు. తనకు తోచినట్టే నడుచుకొనేవాడు.

క్రమేణా సీతారామరాజులో వంటరితనం మరింతగా చోటు చేసుకున్నది. ఎప్పుడు గంభీర ముద్ర వహించి, ఆలోచిస్తూ వుండేవాడు.

రానురాను సీతారామరాజులో వైరాగ్యభావం పెరగసాగింది. నిష్క్రియాపరమైన వైరాగ్యం కాదు యిది. అన్వేషణాపూరితమైన ప్రయత్నం. జీవితానికి గల పరమార్థాన్ని తెలుసుకొనే తహతహ ఆయనలో అధికమైంది. అయితే గమ్యమే యింకా నిర్ధారణ కాలేదు.

తునిలోనూ, గోపాలపట్నంలోనూ పెదతల్లిగారింట తల్లితో కలిసి కొన్నాళ్లు సీతారామరాజు వుండవలసివచ్చినప్పుడు, ఆయనలో లీలగా ఆధ్యాత్మిక దృక్పథం చోటు చేసుకొన్నది. అక్కడ సీతమ్మవారి కొండ అనే చిన్న కొండ వున్నది. ఆ కొండపైన చిన్నగుడి వుంది. ఏకాంతం కోసం ఆరాటపడే సీతారామరాజు ఆ గుడిలో తరచుగా ధ్యానం చేస్తూ కాలం గడిపేవాడు.

సీతారామరాజుకు యుక్తవయస్సు వచ్చింది. కుటుంబ భారాన్ని వహించవలసిన సమయం ఆసన్నమైంది. ఏదైనా ఉద్యోగం చేసి, కుటుంబాన్ని పోషించవలసిందిగా తల్లి మొరపెట్టుకొనేది. కానీ సీతారామరాజుకు ఆవిధమైన జీవితం పట్ల యిష్టం వుండేది కాదు. ఇల్లు, కుటుంబం, సంపాదన అంతా తనకు బంధనాలుగా ఆయనకు తోచసాగాయి. ఇరకాటమైన పరిస్థితుల్లో తాను జీవిస్తూన్నట్లు సీతారామరాజుకు తోచసాగింది.

ఒకనాడు ఉద్యోగం సంపాదించుకు వస్తాను అని తల్లితో చెప్పి ఇంటి నుంచి బయటకు వచ్చాడు. ఇంటి నుంచి బయలు దేరిన సీతారామరాజు కొన్నాళ్లు దేశ పర్యటనలో వుండిపోయాడు. కాశీక్షేత్రం వెళ్లి, అక్కడి నుండి హరిద్వారం, బ్రహ్మకపాలం వరకు కాలినడకన పయనించి, హిమాలయ పర్వతాల్లో అపూర్వమైన అనుభూతి పొందుతూ, దారి వెంట వున్న ఆశ్రమాల్లో గడుపుతూ తిరిగాడు. ఈ పర్యటనలో సీతారామరాజు ఆధ్యాత్మికంగా, భౌతికంగా కూడా కొత్త వెలుగుల్ని సంతరించుకున్నాడు. యాత్ర మధ్యలో ప్రఖ్యాత విప్లవ వీరుడైన పృథ్వీసింగుతో ఆయనకు పరిచయం ఏర్పడింది. ఆయనతో కలిసి, సీతారామరాజు ఆనాటి విప్లవ వీరుల స్థావరమైన చిట్టిగాంగ్ వరకు పర్యటించి విప్లవవాదుల కార్యకలాపాలను

ఆకలింపు చేసుకొన్నాడు. పృధ్వీసింగ్‌తో కలిసి చేసిన పర్యటనతో సీతారామరాజు జీవితం కొత్తమలుపు తిరిగింది.

అక్కడనుండి మధ్యప్రదేశ్ అడవుల్లో పర్యటిస్తూ జరలీ, మల్కానగిరి, బస్తరు రాజ్యాలు తిరిగి గోదావరి జన్మస్థలమైన నాసికాత్రయంబకం చేరి, అక్కడ కొన్నాళ్లు గడిపి చివరకు విశాఖపట్నం చేరుకున్నాడు.

కృష్ణదేవి పేటకు సమీపంలోని తాడంకి నదికి దగ్గర్లో చిక్కాల గడ్డ కలిసే చోట, అచటి గ్రామస్తుల పరిచయం సీతారామరాజుకు ఏర్పడింది. సీతారామరాజు ముఖంలో గల వర్చస్సు, ప్రశాంతత, ఆలోచనా దృష్టిని గ్రహించిన కొందరు పెద్దలు, అక్కడ ఆయనకు రెండు యిళ్లు కట్టి యిచ్చారు. తనపై గంపెడాశ పెట్టుకొని వున్న తల్లికి, కుటుంబానికి కొంతవరకు సహాయపడడం తన కర్తవ్యంగా భావించిన సీతారామరాజు తల్లి, తమ్ముడు చెల్లెల్ని రావించి వారు నివసించడానికి ఒక యిల్లు, తనకు ప్రత్యేకంగా ఒక పాక కేటాయించుకొన్నాడు. అచ్చట గ్రామస్తుల సహకారంతో కుటుంబానికి ఏ లోటు లేకుండా గడిచి పోతున్నది.

ఆ ప్రాంతంలో వున్న ధారకొండ తపస్సు చేసుకోవడానికి సీతారామరాజుకు అనువుగా తోచింది. అందువలన ఆ పరిసరాలను తన కార్యక్రమాలకు అనువుగా ఏర్పాటు చేసుకోవాలని భావించాడు. ధారకొండలో ఎల్లప్పుడూ నీటి ధార ప్రవహిస్తూనే వుంటుంది. మామిడి, పనస, అరటి వృక్షాలతో ఆ ప్రాంతం ఎంతో నిర్మలంగా, కళకళలాడుతూ వుంటుంది. అచ్చట గ్రామస్తుల సహకారంతో ముప్పయి ఎకరాల భూమిని కూడా సీతారామరాజు సేకరించగలిగాడు. క్రమంగా ఆభూమిలో వ్యవసాయాన్ని ప్రారంభించాడు. సీతారామరాజు నివసిస్తున్న ప్రాంతానికి మరికొన్ని కుటుంబాలు వచ్చి చేరాయి. క్రమంగా అక్కడ ఒక చిన్న పల్లె వెలిసింది. దానికి శ్రీరామ విజయనగరం అని సీతారామరాజు పేరుపెట్టాడు.

వ్యవసాయం చేయడానికి చెల్లెలు భర్త దంతులూరి వెంకటపతిరాజుగారిని అక్కడే స్థిరపడేట్టు చేసాడు. దీనితో తల్లి గారి కుటుంబానికి మంచి ఆసరా దొరికినట్లయింది. వ్యవసాయకంగా తల్లి గారి కుటుంబం బాగా స్థిరపడింది. జన్మయిచ్చిన తల్లి రుణం యీవిధంగా తీర్చుకున్నానని సీతారామరాజు తృప్తి చెందాడు. యికమీదట తన కర్తవ్యం తాను నిర్వర్తించాలని భావించాడు.

ఉత్తరదేశయాత్ర, పృధ్వీసింగుతో పరిచయం, చిట్టగాంగ్‌సందర్శన, విప్లవవీరుల కార్యక్రమాలు, బస్తరు పర్యటనలో సీతారామరాజుకు మాతృదేశ దాస్యవిముక్తే తన కర్తవ్యంగా స్థిరమైన భారం రూపుదిద్దుకుంది. భారతమాత దాస్యశృంఖలాలు తెగిపోవాలి. మాతృభూమి స్వతంత్ర చెందాలి. అదే తన కర్తవ్యం, అని భావించిన

సీతారామరాజు ఇందుకు సాయుధ పోరాటమే ముఖ్యసాధనం అని గ్రహించాడు. ఈ ఆలోచనా క్రమంలో ఆయనకు మన్యప్రాంతం అనువుగా తోచింది. మన్యం అడవుల్లో, కొండల్లో, కోనల్లో స్థావరాలను ఏర్పాటు చేసుకోవాలనీ, అందుకు తగిన అనుచరుల్ని సంపాదించాలనీ తలంచాడు. అడవుల్లో కొండల్లో బ్రిటిషు ప్రభుత్వం మీద సాయుధపోరాటం చేసేందుకు అనువుగా వుంటుందనీ, అందుకు మన్యం అడవులు తగివున్నాయని భావించిన సీతారామరాజు మన్యం అడవుల్లో నివాసాన్ని ఏర్పాటు చేసుకున్నాడు.

మన్యప్రజలు అక్కడ పడుతున్న బాధల్ని గమనించిన సీతారామరాజు వారికి అండగా నిలిచాడు. సీతారామరాజుకు నైతిక గుణమైన పరోపకారం, సేవాభావం, దీనజన బాంధవ్యం ఆయనకు మన్యప్రజలలో అతికొద్ది కాలంలోనే సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి.

సీతారామరాజులో బహుముఖమైన శక్తియుక్తులు తన సుదీర్ఘమైన పర్యటనలలో, అనుభవంలో స్థిరంగా చోటు చేసుకొన్నాయి. జ్యోతిష్యం, సాముద్రికం, మూలికావైద్యం, ఆయనకు మన్యప్రజలతో అవినాభావ సంబంధాల్ని కలిగించాయి. క్రమబద్ధమైన జీవితానికి సీతారామరాజు పెట్టింది పేరు. ఆయన నిత్యకృత్యాలలో ఆచరించే కాళీఉపాసన, అగ్ని ఆరాధన, ధ్యానం, నియమబద్ధమైన జీవితాన్ని చూసి మన్యం ప్రజలు సీతారామరాజును దైవసమానంగా భావించేవారు. వారికి మందులిచ్చి, మాకులిచ్చి, జాతకం వ్రాసి, వారి నిత్యజీవనానికి సంబంధించిన నమ్మక, విశ్వాసాలకు అనుగుణంగా వారిని తీర్చి దిద్దుతూ, తీరిక సమయాల్లో రామాయణ, భారతగాథల్ని వినిపించి, వారిచేత జాతరలు చేయించి, మన్య ప్రజలను ఆకర్షించాడు. తాను యోగిగా జీవిస్తూ వారిలో తనపట్ల భక్తి విశ్వాసాలను సంతరింప జేసుకున్నాడు. మన్యంలో సీతారామరాజు కీర్తి ప్రతిష్టలు కొద్ది కాలంలో వ్యాపించాయి.

సీతారామరాజు పేరు మన్యప్రాంతంలో రామనామం అయింది. ఆయన వాక్కు మన్యప్రజలకు మంత్రపూరితమైన వేదవాక్కు.

మన్యప్రజల్ని బ్రిటిషు అధికార్లు, కంట్రాక్టర్లు, వారి తాబేదార్లు అనేక విధాలుగా దోపిడి చేస్తున్నారు. వారిని పలురకాల బాధలకు గురిచేసేవారు. ప్రజలు కష్టపడి పండించుకున్న పంటల్ని, పళ్లు, కాయల్ని పోలీసులు, ఉద్యోగులు, ఫారెస్టు ఉద్యోగులు, ముఠాదార్లు డబ్బు యివ్వకుండానే బెదరించి లాక్కుపోయేవారు. అడవుల నుండి మన్య ప్రజలు కష్టపడి సేకరించుకొనే కలపను అధికార్లు కైవసం చేసుకోనేవారు. కొండల్ని ఎక్కవలసి వచ్చినప్పుడు అధికారుల్ని డోలీలపై మోయవలసిన భారంకూడా ప్రజలదే. అందుకు ఎట్టి కూలీని వారికి యిచ్చేవారు కాదు.

ఆ రోజుల్లో కూలీలకిచ్చే ధర ఆరు అణాలు, అందులో రెండు అణాలు మాత్రమే కూలీల కిచ్చి, మిగిలిన నాలుగు అణాల్ని కాంట్రాక్టర్లు, ముఠాదార్లు కాజేసేవారు. ఇక బ్రిటిషు అధికార్ల దౌర్జన్యం చెప్పనలవికాదు.

వీటికి తోడు మన్యంలో పంటలు కూడా సరిగ్గా పండవు. అక్కడి ప్రజలు ఆకులు, అలము, దుంపలు, పళ్లు తిని బ్రతక వలసి వచ్చేది. సొరకాయ బుర్రలలో చింత అంబలి, మామిడి, జీడి అంబలి త్రాగి ప్రజలు జీవితాలను నిలబెట్టుకోవడం అక్కడ పరిపాటి అయింది. అందువల్ల ఎల్లప్పుడూ రోగాలతో అంటు వ్యాధులతో ప్రజలు బాధలు పడుతూ వుండేవారు. ఈ కష్టాలకు తోడు అటు అధికార్లు, పోలీసుల దౌర్జన్యాలు గోరుచుట్టుపై రోకలిపోటుగా వుండేవి. అంతేగాక త్రాగుడు అక్కడి ప్రజలకు నిత్యకృత్యంగా వుండేది. కల్లు, సారా త్రాగకుండా వుండలేరు.

ఇట్టి ధారుణమైన పరిస్థితులు నెలకొన్న మన్యప్రాంతంలోకి సీతారామరాజు ప్రవేశించాడు. ముందుగా అక్కడి ప్రజల నిత్య జీవితాల్లో మార్పుల్ని ప్రవేశ పెట్టాడు. త్రాగుడు మానాలని ప్రజలకు బోధించాడు. పోలీసులకు, అధికారులకు ఉచితంగా వెట్టిచాకిరీ చేయవద్దని చెప్పాడు. మూలికా వైద్యంతో ప్రజల జబ్బుల్ని నయం చేసేవాడు. ప్రజలందర్నీ కొద్దికాలంలోనే ఏకత్రాటి పైకి తెచ్చాడు.

మన్యం ప్రజల్ని నిత్యం పీడించే పోలీసులకు, అధికార్లకు, ఫారెస్టు సిబ్బందికి సీతారామరాజు కార్యక్రమాలు మ్రింగుడుపడలేదు. ప్రజలు పండించుకొనే పాలు, తేనె, పళ్లు మొదలైన వాటిని డబ్బు యివ్వనవసరం లేకుండా దోచుకొని పోయే అధికారుల ఆటలు కట్టాయి. అందువలన ప్రభుత్వ పాలక వర్గాలు, తాబేదారు ముఠాలు సీతారామరాజుపై పగబట్టినాయి.

సీతారామరాజు నిరాడంబరుడు. నిశ్చలమనస్కుడు నిండుకుండవలె తొణకడు, బెణకడు. ఆయన స్ఫురద్రూపి, బంగారు వన్నె శరీరచ్ఛాయ ఆయనది. విశాల నేత్రాలతో, నిండైన వ్యక్తిత్వంతో అలరారుతూ వుంటాడు. అంతేకాదు ఆయన విలువిద్యలో ఆరితేరినవాడు. సహజంగా విల్లు బాణాలను ఉపయోగించటంలో నేర్పరులైన కొండజాతి ప్రజలే ఆయన విలువిద్యా నైపుణ్యాన్ని చూసి ఆశ్చర్యపోయేవారు. గుర్రపు స్వారీ, కత్తిసామును ఆయన చిన్నతనంలోనే నేర్చుకున్నాడు. బల్లెం, ఈటె గురితప్పకుండా విసరడంలో ఆయన కడునేర్పరి. ఆధునిక ఆయుధాలైన తుపాకి, పిస్తోలు వుపయోగించడాన్ని ఆయన ఉత్తర దేశ పర్యటనలో విప్లవవీరుల సహచర్యంలో నేర్చుకున్నాడు.

మన్య ప్రజలను దోచుకోవడంలో అడ్డంకిగా వున్న సీతారామరాజుపైన ఫారెస్టు సిబ్బంధి, అధికార్లు, కంట్రాక్టర్లు పై అధికారులకు లేని పోనివి కల్పించి

చెప్పి, అభాండాలను మోపి సీతారామరాజుపట్ల వైరభావాన్ని పెంచారు. మన్య ప్రాంతాన్ని అంతా సీతారామరాజు అరాజకానికి గురిచేసాడనే భావాన్ని పై అధికారులకు కల్పించి పెట్టారు.

చింతపల్లి తాలూకా గూడెంలో బాస్టియన్ అనే తహసీల్దారు వుండేవాడు. అతనికి సంతానం పిళ్లై అను ఒక ఓవర్సీరు సహ ఉద్యోగిగా వుండేవాడు. వీరు యిద్దరూ మన్య ప్రజల ధన, మాన, ప్రాణాలను హరించడంలో నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తూ వుండేవారు. వీరికి ఆయా ప్రాంతంలోని కంట్రాక్టర్లు తాబేదార్లు చేయూత నిచ్చేవారు.

ఆరోజుల్లో మన్యంలో రాకపోకలకు సరియైన రహదార్లు లేవు. అడవులను నరికి బాటలు వేయాలి. అందుకు మన్యం ప్రజలు వెట్టి చాకిరీ చేయాలి. ఇందుకు మన్యం ప్రజలకు యివ్వడానికి నిర్ణయించిన కూలీ ఆరణాలు, అయితే ఆరణాలలో రెండు అణాలు మాత్రం వీరికి చెల్లించి, మిగతాసొమ్ము కంట్రాక్టర్లు దోపిడీ చేసేవారు. వీరి దురంతాలను చూసి చూడనట్లు వుండడానికి, బాస్టియన్‌కి విపరీతంగా లంచాలు యిచ్చేవారు. బాస్టియన్ స్వతహాగా క్రూరుడు త్రాగుబోతు, వ్యభిచారి. యిలాంటి అధికార్లు, కంట్రాక్టర్లు, పోలీసుల బారినుండి మన్య ప్రజలను కాపాడడానికి సీతారామరాజు వారికి అండగా నిలబడినాడు.

సహజంగా కొండ జాతి ప్రజలకు నిర్భయం, అమాయకత్వం అచంచలమైన విశ్వాసం పుట్టుకతో వస్తాయి. తన విప్లవ కార్యక్రమాలకు సీతారామరాజు కొండజాతి ప్రజల నుండే తగిన అనుచరుల్లో ఎంపిక చేసుకున్నాడు. అవిధంగా సీతారామరాజుకు తోడైన అనుచరుల్లో గంటందొర, మల్లుదొరలు ముఖ్యులు. గాం సోదరులు ఆప్రాంతంలోని బట్టిపానుకుల గ్రామ మునసబులు. వీరికి ఆప్రాంతంలో విశేషమైన పలుకుబడివుంది.

సీతారామరాజుకు వీరు అనుచరులని పసిగట్టిన బాస్టియన్ వారి భూములను లాగి వేసుకొని, వారిని ఉద్యోగాలనుంచి తొలగించాడు. దానితో గాంసోదరులు పట్టుదలతో సీతారామరాజుకు మరింత సన్నిహిత సహచరులుగా రూపొందినారు.

ముట్టడం వీరయ్య దొర గూడెం గ్రామ ముఠాదారు. అయితే వీరయ్య దొర సన్మార్గుడు. మిక్కిలి యోగ్యుడు. అంతకు మన్యంలో 1916లో జరిగిన లాగరాయ పితూరీలో యితని తండ్రి సొబిలిన్ దొర పాల్గొన్నాడని యితడు కూడా ఆ తిరుగుబాటులో వున్నవాడేనని సాకు జూపి. నేరంమోపి ప్రభుత్వం అతన్ని నిర్బంధించి, జైలులో పెట్టింది.

అగ్గిరాజ్ అసలు పేరు వేగిరాజు సత్యనారాయణరాజు భీమవరం తాలూకా కుముదవల్లి గ్రామనివాసి. బలశాలి, సాహసవంతుడు. తల్లిదండ్రుల్ని చిన్ననాడే కోల్పోయి. దేశసంచారం చేస్తూ వుండేవాడు. సీతారామరాజు సాహసచర్యల్ని విని, స్వయంగా మన్యంలో రాజును వెతుక్కుంటూ వచ్చిన సాహసి. గెరిల్లా పోరాటంలో ఆరితేరినవాడు గనుక, యితనిని అగ్గిరాజు అని పిలిచేవారు.

ఎండు పడాలు పెదవలస గ్రామ నాయకుడు. కంట్రాక్టర్ల దౌర్జన్యాలను ఎదిరించి ప్రజలకు అండగా నిలబడి పోరాడుతూ వుండేవాడు. గొప్ప విలుకాడు. వీరుకాక గోకిరీ ఎర్రేసు, పడాలు, ముత్యం దొర, సన్నవ ఈరుడు, తదితరులు సీతారామరాజుకు అనుచరులయ్యారు. వీరందరికీ మన్యం అనుపానాలు బాగా తెలుసు. కొండలెక్కడం, దిగడం వారికి వెన్నతో బెట్టిన విద్య.

ఇట్టి సాహసవంతులైన అనుచరవర్గంతో సీతారామరాజు "మిరపకాయటపా" ఉద్యమాన్ని నడిపాడు. ఉత్తరం రాసి, దానిని మిరపకాయకు కట్టి, విల్లంబుతో దానిని సరాసరి శత్రువు దగ్గరికి చేరవేసే పద్ధతినే మిరపకాయ టపా అంటారు. సీతారామరాజు యీ విధానాన్ని బ్రిటిషు అధికార్లకు, పోలీసులకు పంపేవాడు. ఈ ఉత్తరాలు అందుకున్న అధికార్లు, పోలీసులు హడలిపోతూ రాత్రింబవళ్లు నిద్రాహారాలు లేకుండా గడిపేవారు.

1922 అగస్టు 22న సీతారామరాజు కార్యక్రమాల్లో తొలి ఘట్టంగా చింతపల్లి పోలీసు స్టేషన్ ముట్టడింపబడింది. రంపచోడవరం ఏజన్సీలో చింతపల్లి ఒక కీలక స్థావరం. ఈ స్థావరంపై సీతారామరాజు మూడు వందల మంది అనుచరులతో గాంసోదరులు, గోకిరి ఎర్రేసు, తదితరులను వెంటబెట్టుకొని చింతపల్లి పోలీసు స్టేషన్‌పై మెరుపు దాడి చేసాడు. స్టేషన్‌లో వున్న ముగ్గురు పోలీసులు కొయ్యబారి అచేతనంగా నిలబడిపోయారు. రాజు అనుచరులు పోలీసుల్ని స్తంభాలకు కట్టి వేసారు. స్టేషనలో వున్న ఆయుధ సామాగ్రిని తీసుకొన్నారు. ఈ వార్త దారిలోవున్న సబ్‌యినస్పెక్టరు విని, అటునుండి అటే పారిపోయాడు.

తొలిముట్టడి సునాయాసంగా జరిగింది.

మరునాడు అనగా 1922 అగస్టు 23వ తేదీ కృష్ణదేవి పేట పోలీసు స్టేషన్‌పైన సీతారామరాజు దాడి చేసాడు. ఏజన్సీ ప్రాంతంలో కృష్ణదేవి పేట గుండెకాయ వంటిది. ప్రభుత్వానికి కీలకమైన స్థావరం. ఉషోదయంతోనే సీతారామరాజు తన సాయుధులైన అనుచరులతో శరభన్నపాలెంలోని దేవాలయంలో ప్రార్థనలు చేసుకొని సాయంత్రం నాల్గుగంటలకు కృష్ణదేవిపేట చేరుకున్నాడు. ముందుగానే పోలీసు స్టేషన్‌కు కబురు పంపి, దాడికి వస్తున్నామని చెప్పి పంపాడు.

అక్కడ వున్న సబ్‌యినస్పెక్టరు మేకపోతు గాంభీర్యంతో "రాండి! ఎవరు వచ్చినా కాల్చివేస్తాను" అని అన్నాడు. ఆ కబురు విని గాంసోదరులు పోలీసుస్టేషన్ వైపు కదిలి వెళ్లడంతో ఇన్‌స్పెక్టరు అరచేత ప్రాణాలను వుంచుకొని, ఎటో పారిపోయాడు. మిగిలిన పోలీసులు కూడా పలాయనం చిత్తగించారు. రాజు, అనుచరులు అచట గల తుపాకుల్ని, మందు గుండు సామాగ్రిని స్వాధీనం చేసుకుని వెళ్లిపోయారు.

వరుసగా రెండురోజులు రెండు పోలీసు స్టేషన్‌లపై సీతారామరాజు దాడులు చేయడంలో బ్రిటిషు అధికారులు కలవరం చెందారు. మద్రాసు నుండి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి జిల్లా పోలీసు అధికారులకు కొత్త ఆజ్ఞలు జారీ చేయడంలో పోలీసు అధికారుల్లో చర్చలు ప్రారంభమయ్యాయి.

అధికారుల ఆలోచనలు తెగకముందే సీతారామరాజు విప్లవ సైన్యాలు మూడవ రోజు అనగా 24వ తేదీన రాజవొమ్మంగి స్టేషన్‌పై దాడి చేసాయి. అక్కడ కూడా పోలీసులు లొంగిపోయారు. రాజు పథకం ప్రకారం రాజవొమ్మంగి స్టేషన్‌పై దాడి చేసాడు. అంతకు ముందు ఆ స్టేషన్‌లో నిర్బంధించివుంచిన వీరయ్య దొరను విడిపించడం సీతారామరాజు కార్యక్రమం కావడం వల్ల దాడి పకడ్బందీగా జరిగింది. చివరకు సునాయాంగా పోలీసులు లొంగిపోవడం, వీరయ్య దొరను విడిపించుకోవడం జరిగిపోయింది.

ఈ వార్త దావానలంగా రాష్ట్రం అంతా వ్యాపించింది. పోలీసు వర్గాల్లో కలవరం బయలుదేరింది. వెంటనే కలెక్టరు, సూపర్నెంట్ నరిసీపట్నానికి చేరుకున్నారు. చింతపల్లి, కోటసందూరు, అడ్డతీగెల, తదితర చోట్లకు రిజర్వ్‌డ్ సైనికులు వచ్చిపడ్డారు. కవర్డు, హైటర్ తదితర తెల్ల సైనికోద్యోగులు పరుగెత్తుకొని వచ్చారు.

సీతారామరాజు అనుచరుల్ని గురించి సమాచారం చెప్పవలసిందిగా సైనికులు మన్యం ప్రజల్ని హింసించడం మొదలెట్టారు. ప్రజలు వారికి తప్పుడు సమాచారాన్ని అందించేవారు.

బ్రిటిషు సైనికులకు సీతారామరాజు గురించి అనేకరకాల కథలు, పుకార్లు విని, గుండె బెదురు పట్టింది. రాజు మంత్రగాడనీ, యిక్కడ మాయమై మరెక్కడో దర్శనమిస్తాడనీ, ఆయన్ను పట్టుకోవడం ఎవరికీ సాధ్యం కాదనీ ప్రచారం జరుగుతూ వుండడంతో బ్రిటిషు సైనికులు, అధికారులు బెంబేలెత్తి పోయేవారు.

సీతారామరాజు దాడుల్ని బ్రిటిషు సైనికులు, అధికారులు కలిసి, ఎలా అరికట్టాలా అని తీవ్రంగా చర్చలు చేయనారంభించారు. ముందు భారతీయ పటాలాన్ని పెట్టుకొని, వెనుక తెల్లసైనికులు వుండేవారు. స్వదేశీ సైనికులను రాజు చంపకుండా వదిలివేస్తే, వారితో పాటు తాము రక్షింపబడతామని వారి ఎత్తుగడ.

సీతారామరాజును బంధించడానికి ప్రత్యేకంగా నియమితులైన ఇన్స్పెక్టరు జనరల్ ఆర్మిటేజ్ కృష్ణదేవి పేటలో మకాంవేసి, కొంత సైన్యాన్ని రాజు వున్నాడని చెప్పబడే స్థావరాలపైకి పంపాడు. రాజు దమనపల్లి అడవుల్లో వున్నాడని తెలిసి, బ్రిటిషు సైన్యాలు ఆ దిశగా బయలుదేరాయి. ప్రభుత్వ సైనికుల కదలికలను గురించి వేగుల ద్వారా తెలుసుకున్న రాజు, తన అనుచరులతో మకాం మార్చి రంపోలు, మొగిలిదొడ్డి గ్రామాల నడుమ, బ్రిటిషు సైనికులు వచ్చే దారికి పై ఎత్తున కొండల ఏటవాలుల్లో పొంచివున్నారు. ఆ ప్రాంతమంతా అరణ్యమయం. బ్రిటిష్ సైనికులు కొండ క్రిందుగా రావడంతోనే, కొండపై భాగంలో వున్న రాజు ఆదేశంతో గాంసోదరులు, ఎర్రేసు, పడాలు తుపాకి గుళ్ల వర్షాం కురిపించి బ్రిటిషు సైనికులపై దాడి ప్రారంభించారు. బ్రిటిషు సైన్యాధికారులు నలుగురు అక్కడికక్కడే నేలకొరగిన వెంటనే, మిగతాసైనికులు చెల్లా చెదరై పారిపోయారు. ఇనస్పెక్టరు జనరల్ ఆర్మిటేజ్ యీ వార్తవిని ఆశ్చర్య చకితుడైనాడు. ఎలాగైనా మృతదేహాలను సంపాదించాలని ఆర్మిటేజ్ చేసిన ప్రయత్నానికి బ్రిటిషు సైనికులు ఆప్రాంతానికి వెళ్లడానికి భయపడి అయిష్టత చూపారు. చివరికి రాజును మధ్యవర్తుల ద్వారా వప్పించి, అయిదు వందల రూపాయల జరిమానాను రాజుకు చెల్లించి, ఆర్మిటేజ్ మృతకళేబారులను తెప్పించుకొని నర్సీపట్నం శివార్లలో వాటిని పూడ్చిపెట్టి వాటిపై సమాధులను కట్టించాడు.

అప్పట్లో బ్రిటిషు సైనికుల వద్దనుండి జరిమానాను వసూలు చేసిన ఘనత అల్లూరి సీతారామరాజుదే. ఈ ఘటన భారత స్వాతంత్ర్య పోరాట ఘట్టంలో సువర్ణాక్షరాలతో లిఖించదగింది.

మరొక విచిత్రమైన సంఘటన, గతంలో మూడుసార్లు అడ్డతీగెల పోలీసు స్టేషన్పై రాజు దాడిచేసి దోచుకపోయాడు.

అక్టోబరు 16వ తేదీ. తాను అడ్డతీగెల పోలీసు స్టేషన్పై దాడికివస్తున్నానంటూ ముందుగానే రాజు మిరపకాయ టపా పంపాడు. ఈ టపా అందుకున్న బ్రిటిషు పోలీసులకు గుండెలు జారాయి. అంతకు మునుపే రాజును గురించి ఒక పెద్ద పుకారు ప్రచారంలో వుంటూ వచ్చింది. సీతారామరాజు గొర్తేడు అడ్డతీగెల, రంపచోడవరం, పాపికొండల మీదుగా బస్తరు వెళ్లి పెద్ద సైన్యంతో వచ్చి బ్రిటిషు వారిని దేశాన్నుండి తరిమి వేయనున్నాడని వచ్చిన వార్తతో బెంబేలెత్తి వున్న సందర్భంలో యీ టపారావడంతో అడ్డతీగెల పోలీసు స్టేషన్ ఖాళీ చేసి అక్కడి సిబ్బంది పరారైనారు. సీతారామరాజు, తొంభైమంది అనుచరులతో వచ్చి, తెల్లవార్లూ స్టేషన్లోనే వుండిపోయాడు. రాజు వెళ్లిపోయిన తర్వాత, అధికార్లు

ఒక్కరొక్కరే వచ్చి "అడ్డతీగెలకు ఏ ప్రమాదమూ జరగలేదని" పై అధికారులకు రిపోర్టు పంపుకున్నారు. ఈ సంగతి విని స్థానిక ప్రజలు నవ్వుకున్నారు.

మిరపకాయ టపా రాకముందే, ఎందుకైనా మంచిదని, ఆ ప్రాంతాలలోని పోలీసు స్టేషన్‌లలో ఎలాంటి ఆయుధ సామగ్రిని వుంచకుండా, దాచిపెట్టి వుంచేవారు. అప్పట్లో రాజును పట్టుకొనే శక్తి చాలక, తనకు తనను కాపాడు కోవడానికే ప్రభుత్వం ప్రయత్నించేది. ఈ రహస్యాన్ని పసిగట్టిన విప్లవ వీరులు, మన్య ప్రజలు 'దయ్యాల కొంపలు' అని పోలీసు స్టేషన్లను పిలువసాగారు.

మన్య ప్రాంతంలో బ్రిటిషు ప్రభుత్వం అంతరించి పోయిందని రాష్ట్రంలో ప్రచారం జరిగింది. ఏలాగైనా సీతారామరాజును అరెస్టు చేయాలనీ, అవసరమైతే కాల్చి వేయాలనే పట్టుదల బ్రిటిషు అధికారుల్లో పెరిగింది.

మలబారులో వున్న శిక్కు పటాలాలు తక్షణమే మన్యానికి తరలించబడ్డాయి. మన్యం అంతటా వైర్‌లెస్ సాధనాలు, పోస్టు, టెలిగ్రాఫ్ సౌకర్యాలు చేయబడ్డాయి. రవాణా సాధనాలుగా మోటార్లు, జీపులతో పాటు కంచరగాడిదలు కూడా సరఫరా చేయబడ్డాయి.

వీటికి తోడు మన్యం అంతటా గ్రామగ్రామన పోలీసు పటాలాలను దించి, మన్యం పెద్ద సైనిక శిబిరంగా మార్చి వేయబడింది. మన్యం ప్రజలపై తీవ్రమైన ఆంక్షలు విధించబడ్డాయి. విప్లవ కారులెవరికీ ప్రజలు ఎట్టి సహాయాన్ని చేయరాదు. వారికి తిండి పెట్టరాదు. వసతి సమకూర్చకూడదు. గ్రామాలలో కాపలావున్న పోలీసు పటాలాలకు ప్రజలే సమిష్టిగా వారి ఖర్చులన్నీ భరించి, తిండిపెట్టాలి. విప్లవకారులుగానీ, విప్లవంతో సంబంధంవున్నట్టు భావించే వారెవరు తారసపడినా, ప్రజలు వెంటనే ప్రభుత్వాదికారులకు తెలియచేయాలి. అలా ప్రభుత్వంతో సమీకరించని ప్రజల ఆస్తి పాస్తులను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది".

ఈ విధంగా మన్యం విప్లవాన్ని అణచివేయడానికి బ్రిటిష్ ప్రభుత్వంసర్వవిధాలా సమాయత్తమైంది. ప్రజలపై ప్రభుత్వ నిర్బంధకాండ ఎక్కువైంది.

గానుకొండ వద్ద రాజు అనుచరులలో వున్నాడన్న వార్త తెలిసి బ్రిటిషు సైనికులు చుట్టు ముట్టారు. అంతకుమునుపే రాజు గానుకొండను విడిచివెళ్లాడని తెలిసి తెల్లదొరలు తెల్లమొగం వేసారు.

ఇట్టి పరిస్థితుల్లో పెదగడ్డపాలెంవద్ద రాజు తన అనుచరులతో విప్లవ కార్యక్రమాలను అంచనా వేసేందుకు విడిది చేసి వుండగా సేనాధిపతి జాన్ అకస్మాత్తుగా దాడి చేసాడు. విప్లవకారుకీ, బ్రిటిషు సైనికులకు పెద్ద యుద్ధం జరిగింది. రాజు తప్పించుకొని పోయాడు.

ఇంతలో సీతారామరాజు అన్నవరంలో ప్రత్యక్షమైనాడు. ప్రజల సమక్షంలోనే అన్నవరం దేవాలయంలో రాజు పూజలు జరిపించాడు. తనను అన్నవరం వచ్చి

కలుసుకోవాల్సిందిగా రాజు కలెక్టరుకు మిరపకాయ టపా పంపించాడు. కానీ ధైర్యం చాలక కలెక్టరు రాజును కలుసుకోకుండానే కాకినాడ వెళ్ళిపోయాడు.

మన్యం ప్రజలపై అధికారుల వేధింపులు ఎక్కువైనాయి. ప్రజలను హింసిస్తే రాజు లొంగివస్తాడన్న దుర్మార్గమైన ఎత్తుగడతో బ్రిటిషు సైన్యం ప్రజలను విపరీతమైన బాధలకు గురిచేస్తున్నది. ఇంతలో మల్లుదొరను బ్రిటిషు సైనికులు పట్టివేశారు. మల్లుదొరను అరెస్టుచేసి బ్రిటిషు సైనికులు విశాఖపట్నం తీసుకొనిపోయి సెంట్రల్ జైలులో నిర్బంధించారు. ప్రభుత్వంపై తిరుగుబాటు జరిపాడన్న నేరంమోపి మల్లుదొరను బ్రిటిషు ప్రభుత్వం అండమాన్ జైలుకు తరలించింది.

సీతారామరాజు కోసం గ్రామాలన్నీ గాలిస్తున్న బ్రిటిష్ సైన్యాలు కొండపల్లి అనే పల్లెలో రాజు వున్నట్లు తెలిసింది. వెంటనే సాయుధ సైన్యాలను వెంటబెట్టుకొని ఉపేంద్ర పట్నాయక్ అను సేనాని ఆ గ్రామంపై దాడి చేసాడు. ఆ సమయంలో సీతారామరాజు అచ్చట లేడు. కానీ అగ్గిరాజు బ్రిటిషు సైన్యంపై కాల్పులు జరిపి ఎదిరించాడు. చివరకు కాలికి దెబ్బతగిలి పడిపోయాడు. ప్రభుత్వ సైన్యాలు అగ్గిరాజును బంధించి, అండమాన్ జైలుకు పంపింది.

రాజు అనుచరులు చాలమంది అరెస్టు కావడమో, చనిపోవడమో జరిగింది. గ్రామగ్రామాన నిర్బంధకాండ ఎక్కువ కావడంతో విప్లవ వీరులకు స్థావరాలు ఏర్పాటు చేసుకోవడం కష్టమైపోయింది. అదీగాక ప్రజలపై హింసాకాండ ఎక్కువైంది. ప్రభుత్వ సైనికులతో పాటు, పెత్తందార్లు ప్రభుత్వతాబేదార్లు ప్రజలను నానావిధాలుగా హింసిస్తున్నారు. వ్యవసాయ పనులు స్థంభించి ప్రజలు తిండి గింజలకు కటకట లాడిపోతున్నారు. మన్యంలో యీ పరిస్థితి యిలాగే కొనసాగితే ప్రజలు బాధల వర్ణనాతీతంగా వుంటాయన్న భావం సర్వత్రా వ్యాపించి ప్రజలు భయాందోళనలకు గురి అయ్యారు.

సీతారామరాజుకు పరిస్థితి అంతా అర్థమవుతోంది. ఏ ప్రజల కోసం తాను యీ ఉద్యమాన్ని ప్రారంభించాడో, ఆ ఉద్యమమే ప్రజల పాలిట శాపంగా మారడం రాజును మానసికంగా క్షోభపెట్టింది. పర్లాకిమిడి నుండి సీతారామరాజు కొంత బలగాన్ని వెంటబెట్టుకొని మన్యం చేరాడు. తాను బ్రతికి వున్నంత కాలమూ తన కోసం బ్రిటిషు సైన్యం ప్రజలను వెంటాడుతూనే వుంటుదని గ్రహించాడు. ప్రజలు ముఖ్యం. ప్రజలు అమాయకులు. తన కర్తవ్యాన్ని గురించి రాజు తీవ్రంగా ఆలోచించసాగాడు. ప్రజలను కష్టాలనుండి విముక్తి చేయాలనీ, తనవునికి కారణంగా ప్రజలు బాధలు పడకూడదనీ నిశ్చయించుకున్నాడు. తాను ప్రభుత్వానికి లొంగనంత వరకూ ప్రజలకు యీ కష్టాలు తప్పవని గ్రహించాడు. వెంటనే ఆయుధ విసర్జన చేసాడు.

తనకు మిత్రుడైన మంప గ్రామ మునసబు యింటికి చేరుకున్నాడు. తన నిర్ణయాన్ని అతనికి తెలియపరిచాడు. మంప మునసబు రాజుకు ఎదురు చెప్పలేక కన్నీటితో మౌనం వహించాడు.

రాజు స్థిత ప్రజ్ఞుడు. కష్ట సుఖాలను రెంటినీ సమానంగా అనుభూతి చెందే మనోధైర్యం కలవాడు. మరుసటి రోజు ఉదయం నది వద్ద స్నానం చేస్తూ, సూర్యునికి ఆర్ఘ్యమిచ్చి, తన ఉనికిని గురించి, సమీపంలోని సైనిక శిబిరానికి కబురు చేసాడు. పోలీసు అధికార్లు భయంతో, బిక్కచచ్చి రాజు వద్దకు వచ్చి, వినయంతో అయనను బంధించి, సార్జంట్ గుడాల్ వద్దను తీసుకొని వెళ్లారు.

అది 1924 మే నెల 27వ తేదీ.

జాతీయ పోరాట యోధులతో ఒక విప్లవ వీరుడు భరతమాతకు చివరి వందనంచేసి, సెలవు తీసుకున్న విషాద, విభ్రమ ఘడియ.

పోలీసుల కథనం ప్రకారం 1924 మే నెల 27వ తేదీ రాజు దాహం తీర్చుకోవడానికి ఒక ఏటి వద్దకు రాగా, ఆ విషయం తెలిసి ఆచటికి దగ్గర్లో వున్న ఇన్స్పెక్టరు ఆళ్వార్‌నాయుడు మలబారు స్పెషల్ పోలీసులను వెంటబెట్టుకొని తుపాకులు గురిబెట్టి రాజును బెదిరించి, మేజర్ గుడాల్ వద్దకు తీసుకొని వెళ్లారు.

గుడాల్ ముందుకు వచ్చి కరచాలనం చేయడానికి ప్రయత్నించగా రాజు తిరస్కరించి, బ్రిటీషు ప్రభుత్వాన్ని విమర్శించి, తక్షణం బ్రిటీషు వాళ్లు భారతదేశాన్ని వదిలి వెళ్లాలని, తన పోరాటం అందుకేనని గర్జించాడు.

గుడాల్ ఉగ్రుడై రాజును కాల్చి వేయమని ఆజ్ఞాపించాడు.

మలబార్ స్పెషల్ పోలీసులు రాజును అక్కడవున్న చెట్టుకు చేతులు విరిచికట్టివేశారు. గుడాల్ కాల్పులకు ఆర్డరు యివ్వడంతోనే జమేదార్ తుపాకితో రాజును కాల్చగా, ఎడమచేయిపై భాగానికి తగిలింది.

వెంటనే గుడాల్ తన రివాల్వర్‌తో రాజు గుండెకు గురిచూసి కాల్చివేసాడు. రాజు తల ఒరిగిపోయింది.

అల్లూరిసీతారామరాజు అంతిమశ్వాస అనంతవాయువుల్లో కలిసిపోయింది. ఈ భూమండలంపై గాలి ఆడినంతకాలం, అల్లూరి సీతారామరాజు బ్రిటీష్ ప్రభుత్వంపై జరిపిన వీరోచిత పోరాటగాథ వినిపిస్తూనే వుంటుంది.

మన్యం అడవులు, కొండలు, కోనలు, సెలయేళ్లు తమ ఒడిలో తిరుగాడి, బ్రిటీషు ప్రభుత్వం గుండెల్లో నిద్రించిన సీతారామరాజు జ్ఞాపకాల్ని నెమరువేసుకుంటూనే వుంటాయి. రాబోవు తరంవారికి అల్లూరి సీతారామరాజు పోరాట గాథను మన్యం అడవులు అరిచి చెబుతూ వుంటాయి. అక్కడి చెట్టు తలలూపి పాటలు పాడతాయి. అక్కడి సెలయేళ్లు రాజు జీవితాన్ని శ్రావ్యంగా గానం చేస్తూనే వుంటాయి.

# భారత ప్రథమ ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

నెహ్రూ కుటుంబీకులు కాశ్మీరు పండిత బ్రాహ్మణ కుటుంబానికి చెందినవారు. మోతీలాల్ నెహ్రూ ప్లీడరు పట్టాపొంది జన్మస్థానమైన కాశ్మీరు వదిలిపెట్టి అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా స్థిరపడినారు. అలహాబాదులో "ఆనందభవన్" అను పేరుతో చక్కని గృహాన్ని నిర్మించుకున్నారు. భారతస్వాతంత్ర్యోద్యమంలో జాతీయ కాంగ్రెసు నాయకులకు యీ ఆనంద భవనమే విడిది గృహంగానూ, కార్యవేదికగానూ వుంటూ వచ్చింది.

మోతిలాల్ నెహ్రూ భార్య స్వరూపరాణి. వీరికి యిరువురు కుమార్తెలు, ఒక కుమారుడు జన్మించారు. అప్పట్లో అలహాబాద్ హైకోర్టులో మోతీలాల్ నెహ్రూ ప్రసిద్ధ లాయరుగానే పేరుమోసి, బాగా ధనార్జన చేసి, సంపన్నులలో ఒకరుగా పేరు గాంచాడు.

తన ఏకైక కుమారుడు జవహర్లాల్ నెహ్రూను తల్లిదండ్రులు అతిగారాబంగా పెంచారు. లండన్‌లో జవహర్ విద్యార్థి దశ అట్టహాసంగా గడచింది. అప్పటి ఇంగ్లండు రాజకుటుంబీకుల యువరాజ కుమారులతో సమానంగా, కాలేజీల్లో విద్యాభ్యాసం చేస్తూ జవహర్ ధనాన్ని విలాసవంతంగా ఖర్చుచేసేవాడట. గుర్రపుస్వారీ ఈత జవహర్‌కు యిష్టమైన క్రీడలు. 1889 నవంబర్ 14న జవహర్ జన్మించాడు. జవహర్‌అనగా గులాబీ పుష్పం అని అర్థం. తనపేరుకు సాంకేతికంగా కాబోలు జవహర్ఎల్లప్పుడూ తన కోటు బొత్తామునకు గులాబీ పుష్పాన్ని ధరిస్తూ వుంటాడు. జవహర్ సోదరీమణులలో పెద్దక్క విజయలక్ష్మి. చిన్నక్క కృష్ణ.

జవహర్లాల్‌కు యుక్తవయస్సు రాగానే కమలతో వివాహం జరిగింది. జవహర్ లండన్‌లో బారిస్టరు పట్టాపొందాడు.

ఆనాడు అలహాబాద్‌లోని ఆనందభవనం గాంధీజీ, తిలక్, అజాద్, పటేల్ వంటి జాతీయ నాయకులతో జాతీయోద్యమ కార్యక్రమాలతో కిటకిటలాడుతూ వుండేది. జవహర్ యీ చర్చలలో పాల్గొనేవారు. జాతీయ ఉద్యమ కార్యక్రమాల్లో చురుకుగా వ్యవహరించేవాడు.

జవహర్లాల్ మంచి రచయిత, దేశదేశాల సంస్కృతులను భౌగోళిక, రాజకీయ స్థితిగతులను బాగా ఆకళింపుచేసుకునే వాడు. 'భారతదేశ చరిత్ర' పై ఉద్గ్రంధాన్ని

రచించాడు. "డిస్కవరీ ఆఫ్ ఇండియా' పేరుతో రచించిన యీ గ్రంథం ఎన్నో ముద్రణలను పొందింది. జవహర్లాల్ అభ్యుదయ భావాలు గలవాడు. పురాతన సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలపట్ల అంతగా ఆసక్తి వుండేది కాదు. మూఢాచారాలను వ్యతిరేకించేవాడు. పాశ్చాత్య దేశాల్లో ఎక్కువ కాలం విద్యాభ్యాసం చేయడం వల్లనేమీ, దేశదేశాల చరిత్రలను, సంస్కృతిని జీర్ణం చేసుకున్నందునగానీ, ఆయనలో విశాల భావాలు చోటుచేసుకున్నాయి. ఆధునిక దృక్పథం, నూతన భావాలు జవహర్లాల్‌లో పుణికి పుచ్చుకున్నాయి.

ఈ కారణంగానే జాతీయ పోరాటంలో యువకులకు ప్రాతినిధ్యం వహించేవాడు. జవహర్లాల్‌లో ఆవేశం ఎక్కువ. పట్టుదల గలవాడు. చొరవ, వాదనా పటిమ చురుకుదనంతో చర్చలలో పాల్గొనేవాడు.

జవహర్ యువదశలోనే గాంధీజీకి బాగా సన్నిహితుడయినాడు. ప్రతి సందర్భంలోనూ జవహర్‌కి తప్పని సరిగా గాంధీజీ సరసన వుంటూ వచ్చాడు. యువకుడైన జవహర్ అభిప్రాయాలకు గాంధీజీ విలువ యిచ్చేవాడు.

రాజకీయ రంగంలో ప్రవేశించిన అనతికాలంలోనే జవహర్లాల్ మెరుపుతీగెలా దూసుకొని వచ్చాడు. 1929 లో తండ్రి మోతీలాల నెహ్రూ అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుడిగా పదవీ విరమణ చేసిన నాడే, తండ్రి చేతి నుండి అదే సంవత్సరం జవహర్లాల్ అఖిల భారత కాంగ్రెసు అధ్యక్ష పదవిని స్వీకరించాడు. అపూర్వమైన యీ సన్నివేశం జవహర్‌ను బాగా ఉత్తేజితుడ్ని చేసింది.

1923 కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభలలో హిందూస్తాన్ సేవాదళ్ ఆవిర్భవించింది. దీనికి ప్రథమ అధ్యక్షుడిగా జవహర్లాల్ ఎన్నికకావడంతో, కీలక రాజకీయాల్లో ఆయన ప్రవేశించినట్లయింది. తదుపరి 1931లో మహాత్మాగాంధీ అధ్యక్షతన హిందూస్తాన్ సేవాదళ్ మహాసభలు జరిగి, కాంగ్రెసు పార్టీలో విలీనం అయింది. జాతీయ స్థాయిలో హిందూస్థాన్ సేవాదళ్ వాలంటీర్లు మహాసభలు నిర్వహించడం, సేవాకార్యక్రమాలు రూపొందించి అమలు జరపడం జరుగుతుండేది. స్వాతంత్ర్యోద్యమం ఉధృతం కావడంవల్ల, సేవాదళ్ యితర కార్యక్రమాలను రద్దు చేసుకొని జాతీయ పోరాటంలో భాగస్వామ్యమైంది.

1929లో లాహోర్‌లో జరిగిన కాంగ్రెసు సమావేశానికి నెహ్రూ అధ్యక్షత వహించారు. ఈ సమావేశంలోనే "సంపూర్ణ స్వరాజ్యం" తన అంతిమధ్యేయమని కాంగ్రెసు ప్రకటించింది. జాతీయ పోరాటంలో నూతన ఘట్టం ప్రారంభమైంది. తన అధ్యక్షోపన్యాసంలో "నేను సామ్యవాదిని, ప్రజాస్వామ్యవాదిని" అని నెహ్రూ స్పష్టంగా ప్రకటించాడు.

1933-34 లో 'భారతదేశ గమ్యం ఎటు ?" అనే గ్రంధాన్ని నెహ్రూ ప్రచురించారు. జాతీయ ఆలోచనల్ని తీవ్రంగా చర్చించిన యీ గ్రంథం ప్రజల్ని బాగా ప్రభావితుల్ని చేసింది. సామ్యవాదాన్ని గురించి ప్రజలు తీవ్రంగా ఆలోచించడం మొదలు పెట్టారు. సామాన్య పేద ప్రజలను మధ్య తారతమ్యాన్ని యీ గ్రంధంలో నెహ్రూ విశ్లేషించి యిలా రాశారు. "ఈ వర్గాల వారందరికీ భిన్నమైన స్వార్థ ప్రయోజనాలున్నాయి. జీవన విధానంలో జమీందార్లు, పారిశ్రామికవేత్తలకూ, వ్యవసాయకూలీలు, సామాన్య ప్రజలకూ ఎంతో వ్యత్యాసం వుంది. ఎవ్వరినీ కష్టపెట్టకుండా, ఏ వర్గానికీ నష్టం జరగకుండా అందరికీ న్యాయం చేద్దామనే ఆలోచన పిచ్చి ఆలోచన. ప్రగతి పథంలో, ప్రతి మజిలీలోనూ ఎవరో ఒకరు, యితరుల కోసం త్యాగం చేయక తప్పదు." ఈ గ్రంథం వల్ల నెహ్రూ "సోషలిస్టు భావాలు గలవాడని" నిరూపించబడింది.

1936లో జవహర్లాల్ అఖిల భారత కాంగ్రెసుకు రెండవ సారి అధ్యక్షునిగా ఎన్నికైనారు. లక్నో సమావేశంలో కాంగ్రెసు విధానాలకు ఒక కొత్తదనంతోకూడిన స్వరూపాన్ని జవహర్లాల్ రూపొందించారు. భారతదేశం విదేశాంగ విధానం ఎలా వుండాలో నిర్ణయించడంలో నెహ్రూ ప్రత్యేక పాత్ర నిర్వహించారు. శాంతి, స్వాతంత్ర్యాల కొరకు పోరాడడం, ప్రపంచంలో ఎక్కడ స్వాతంత్ర్యం కోసం పోరాటం జరుగుతున్నా దాన్ని బలపరచటం, వలస రాజ్య విధానాన్ని పూర్తిగా వ్యతిరేకించడం ప్రధాన కార్యక్రమాలుగా కాంగ్రెసు పార్టీ అనుసరించవలసిన విదేశాంగ విధానంగా నెహ్రూ సూత్రీకరించి, ఆమోదింపచేసారు. అప్పటి జాతీయోధ్యమం లోనూ, తదుపరి స్వాతంత్ర్యం పొందిన తరువాతనూ మన విదేశాంగ విధానానికి యీ సూత్రాలే పునాది అయ్యాయి.

తదుపరి 1937లో జరిగిన ఫెయిజపూర్ కాంగ్రెసు సమావేశంకూడా నెహ్రూ అధ్యక్షతనే జరిగింది. వ్యవసాయ రంగంపై వివిధ రాష్ట్రాల కాంగ్రెసు కమిటీలు సమర్పించిన నివేదికలను యీ సమావేశంలో చర్చించడం జరిగింది. దేశంలోని వ్యావసాయక సమస్యలకు సంబంధించి ఒక సమగ్రమైన తీర్మానాన్ని యీ మహాసభలో ఆమోదించడం జరిగింది.

1938లో జరిగిన హరిపురా కాంగ్రెసు మహాసభ నేతాజీ సుభాష్ చంద్రబోసు అధ్యక్షతన జరిగింది. ఈ సమావేశంలో 'అభివృద్ధి ప్రణాళిక' ను రచించడానికి జవహర్లాల్‌నెహ్రూ అధ్యక్షతన జాతీయ సంఘం ఒకటి నెలకొల్పబడింది. స్వాతంత్ర్యం లభించిన తరువాత నెలకొల్పబడిన 'జాతీయ ప్రణాళిక సంఘానికి' యిది మార్గదర్శి అయ్యింది.

జవహర్, కమలానెహ్రూల ఏకైక సంతానం ఇందిరా ప్రియదర్శిని. కమల నెహ్రూ ఎప్పుడూ అనారోగ్యంతో వుంటూ ఇందిరా ప్రియదర్శిని 17వ ఏటనే కమలానెహ్రూ.ఆసుపత్రిలో మరణించింది. భార్య మరణం జవహర్లాల్‌ను క్రుంగదీసింది. పిన్న వయస్కురాలైన ఇందిరను తనతో పాటే ప్రతిచోటికీ నెహ్రూ వెంట తీసుకొని వెళ్ళేవాడు. తల్లిలేని లోటును తెలియకుండా చేయడానికి జవహర్లాల్ అతి గారాబంగా ఇందిరా ప్రియదర్శినిని పెంచి పెద్దజేసాడు.

జాతీయ పోరాటంలో నెహ్రూ తరచు జైలుకు వెళ్లవలసి వచ్చేది. అప్పుడు జైలు నుండి ఇందిరా ప్రియదర్శినికి ఉత్తరాలు రాస్తూవుండేవాడు. ఈ ఉత్తరాలద్వారా దేశదేశాల చారిత్రిక పోరాట గాథలు, మహాపురుషుల జీవిత ఘట్టాలు, భారతదేశ సంస్కృతి, చరిత్రను, గురించి ఎంతో విజ్ఞానదాయకమైన సంగతులను, తన కుమార్తెకు నెహ్రూ తెలియపరుస్తూ వుండేవాడు. ఈ లేఖలు ఒక్క ఇందిరకు మాత్రమే రాసినప్పటికీ, తదుపరి గ్రంథస్తం కాబడి ఎందరో యువతీయువకులకు విజ్ఞానాన్ని సంతరించిపెట్టాయి.

జాతీయపోరాటంలో గాంధీజీ తరువాత, నెహ్రూ ఆస్థానాన్ని పొందగలిగాడు. నిరంతరం స్వాతంత్ర్య పోరాట కార్యక్రమాల్లో నెహ్రూ తలమునకలై వుండేవాడు. ఇంగ్లండ్‌లో 1946లో జరిగిన ఎన్నికల్లో లేబరు పార్టీ విజయం సాధించి, అట్లీ ప్రధానమంత్రిగా వచ్చిన తదుపరి, భారతదేశానికి స్వాత్రంత్యం యివ్వడానికి అట్లీ నిర్ణయించుకున్నాడు. అప్పట్లో ఇండియాకు గవర్నరు జనరల్‌గా లార్డ్‌మౌంట్ బాటెన్ వచ్చాడు. మౌంట్ బాటెన్ ఆధ్వర్యంలోనే ఇండియాకు స్వాతంత్ర్య ప్రధానం జరిగింది. మౌంట్ బాటెన్ దంపతులతో నెహ్రూ బాగా సన్నిహితంగా వుండేవాడు. చివరి రోజుల్లో మౌంట్‌బాటెన్‌తో నెహ్రూకుగల సంబంధాలే, స్వాతంత్ర్యం అనంతరం కూడా ఇంగ్లండు భారతదేశాల మైత్రి కొనసాగడానికి దోహదం చేసిందని చెప్పవచ్చును.

1946లో భారతదేశంలో సాధారణ ఎన్నికలు జరిగాయి. చాలా రాష్ట్రాలలో కాంగ్రెసు అఖండ విజయాన్ని సాధించింది. ముస్లింలు అధికంగాగల ప్రాంతాలలో ముస్లింలీగు గెలిచింది. ఇంటరిమ్ గవర్నమెంటు ఏర్పాటు జరిగింది. జవహర్లాల్ నెహ్రూ ప్రధానమంత్రిగా ఎన్నికైనారు. బాబూ రాజేంద్ర ప్రసాద్ రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడిగా ఎన్నికైనారు. నూతన రాజ్యాంగ రచనా సంఘం ఏర్పడి, భారతదేశానికి నూతన రాజ్యాంగాన్ని రచించవలసి వచ్చింది. కాంగ్రెసును తుది దాకా వ్యతిరేకిస్తూ వచ్చిన డాక్టరు అంబేద్కర్‌ను జవహర్లాల్ తన మంత్రి వర్గంలోకి తీసుకొని, ఆయనకు న్యాయశాఖా మంత్రి పదవిని అప్పగించాడు. జవహర్లాల్ దూరదృష్టితో

అంబేద్కరును మంత్రివర్గంలోకి తీసుకున్నాడు. న్యాయశాస్త్ర కోవిదుడూ, అభ్యుదయ భావాలు గల అంబేద్కరును భారత రచనా సంఘానికి అధ్యక్షుని చేయడమే నెహ్రూ సంకల్పం. అందుకనే అంబేద్కరును న్యాయశాఖామంత్రి పదవిని అప్పగించి, భారత రాజ్యాంగ రచనా సంఘానికి అధ్యక్షునిగా చేసి, అభ్యుదయ భావాలతో నూతన రాజ్యాంగం రూపొందించడానికి నెహ్రూ వీలు కల్పించాడు.

హిందూకోడ్ బిల్లును అంబేద్కర్ పార్లమెంటులో ప్రవేశపెట్టినప్పుడు దాదాపు పార్లమెంటు అంతా యీ బిల్లును వ్యతిరేకించింది. ఆ సందర్భంలో జవహర్‌లాల్ నెహ్రూ ఒక్కడే అంబేద్కరును సమర్థించాడు. అభ్యుదయ దృక్పథం గల హిందూ కోడ్ బిల్లు దేశానికి అవసరమని ప్రధాని నెహ్రూ వాదించాడు. అయితే బిల్లు ప్యాసు కావడానికి తగినంత మెజారిటీ లభించక, వీగిపోయినప్పుడు నెహ్రూ ఎంతగానో విచారించాడు.

నెహ్రూ అభ్యుదయవాది. సోషలిస్టు భావాలు గలవాడు.

1947 అగస్టు 15న దేశానికి స్వాతంత్ర్యం లభించిన నాటి నుండి చనిపోయేంతవరకు దీర్ఘ కాలం ప్రధానిగా వున్న జవహర్లాల్ నెహ్రూ దేశాన్ని అభ్యుదయ దిశలో పయనింప జేయడానికి ఎంతగానో కృషి చేసాడు. రష్యాలో జరిగిన అక్టోబర్ విప్లవం ఆయన్ను ఎంతగానో ప్రభావితం చేసింది.

రెండు వందల సంవత్సరాలుగా దేశం పరాధీనంలో వుండి ఆర్థికంగా అస్తవ్యస్తమైంది. ఈస్టిండియా కంపెనీ, తదుపరి పరిపాలన చేసిన బ్రిటిషు ప్రభుత్వం కూడా దేశాన్ని దోచుకపోవడం జరిగింది.

ఈ స్థితిలో ఆర్థికంగా దేశాన్ని సుస్థిరంగా తీర్చి దిద్దడం అవసరమని నెహ్రూ భావించాడు. అంతేగాకుండా దేశంలోని సంపద అంతా కొద్దిమంది చేతుల్లో పోగుపడడం, ఎక్కువ మంది నిరుపేదలుగా జీవించ పద్ధతిని మార్చి, సోషలిస్టు దృక్పథంతో దేశ ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దేందుకు నెహ్రూ పూనుకున్నాడు.

ఈ లక్ష్య సాదనకు అవసరమైన కార్యాచరణ 1955లో ఆవడిలో జరిగిన కాంగ్రెసు సమావేశంలో రూపుదిద్దుకుంది. సుప్రసిద్ధమైన ఆవడి తీర్మానం యీ విధంగా చేయబడింది.

"ప్రధానమైన ఉత్పత్తి సాధనాలకు అధికారం, యాజమాన్యం, సమాజపరంగా ఉండాలి. జాతీయ సంపద అందరికీ న్యాయపరంగా పంచబడాలి. ఈ విధమైన సామ్యవాద తరహా సమాజాన్ని సాధించడం లక్ష్యంగా యీ సమావేశం తీర్మానించింది."

స్వాతంత్ర్యం అంటే దేశంలో విదేశీయుల పరిపాలన అంతం కావడం మాత్రమే కాదు. దేశంలో దోపిడీ విధానం అంతమై, సామ్యవాదం నెలకొన్నప్పుడే

స్వాతంత్ర్యం అనే దానికి సార్థకత వుంటుంది. ప్రజలకు సుఖసంతోషాలను పంచియిస్తుంది. ఈ దృష్టితోనే స్వాతంత్ర్యోద్యమ లక్ష్యాన్ని గురించి, స్వాతంత్ర్యం యొక్క పరమార్థాన్ని గురించి నెహ్రూ అభిప్రాయాలు యిలా వుండేవి.

ఆవడి తీర్మానం ప్రాతిపదికగా నెహ్రూ స్వావలంబన దిశగా ప్రణాళికా సంఘాలను అమలు పరిచాడు. పంచవర్ష ప్రణాళికలు పేరుతో నిర్దేశించిన విధంగా ప్రభుత్వం విధానాలను అమలు చేసే విధంగా నెహ్రూ రూపకల్పన చేసాడు. వ్యాపార సరళిలో వ్యవహరించే పాశ్చాత్య దేశాల ఆర్థిక సహాయాన్ని ఆశించకుండా జవహర్ రష్యాతో స్నేహ సంబంధాలను పెంచుకుని, ఆర్థిక సహకార ఒప్పందంతో దేశంలో భారీపరిశ్రమలను నెలకొల్పాడు. భిలాయ్ ఉక్కు కర్మాగారం యిందుకు నిదర్శనం.

విదేశాంగ విధానాన్ని కూడా జవహర్లాల్ నెహ్రూ అభ్యుదయ దృక్పథం తోనే అమలు జరిపాడు. అప్పటి విదేశాంగ శాఖా మంత్రిగా వున్న శ్రీ వి.కె. కృష్ణమీనన్ మేధావి, వక్త, సంభాషణ చతురుడు. అందువలననే జవహర్లాల్ విదేశాంగ శాఖకు అనువైన, సమర్థుడైన వ్యక్తిగా భావించి శ్రీ కృష్ణమీనన్‌ను తన మంత్రి వర్గంలోకి తీసుకున్నాడు.

బాండుంగ్ మహాసభ జవహర్‌లాల్ నెహ్రూ రాజనీతికి అద్దం పడుతుంది. చైనా ప్రధాని చౌఎన్‌లై, ఇండోనీసియా ప్రెసిడెంట్ సుకర్ణో, ఈజిప్టు అధ్యక్షుడు కల్నల్ నాజర్‌లతో కలిసి జవహర్లాల్ బాండుంగ్ ఒప్పందాన్ని సాధించాడు. అగ్రరాజ్యాల పెత్తనాన్ని వ్యతిరేకించడం, సామ్రాజ్య వాదాన్ని వ్యతిరేకించడం, బడుగు రాజ్యాలకు సహాయపడడం, ప్రపంచంలో ఎక్కడ స్వాతంత్ర్య పోరాటం జరుగుతున్నా దాన్ని బలపరచడం, సహాయపడటం, బాండుంగ్ సభలోని దేశాల మధ్య పరస్పర సహకారం ప్రధాన లక్ష్యాలుగా బాండుంగ్ మహాసభ కొనసాగింది. అంతేగాక చరిత్రాత్మకమైన పంచశీల సిద్ధాంతం జవహర్లాల్ ఆలోచనా క్రమంలో రూపొందించబడిందే.

రష్యాతో ఆర్థిక ఒప్పందంతో పాటు, చైనాతో పంచశీల ఒప్పందం సాధించడం నెహ్రూ మేధా సంపత్తిని రుజూవు చేస్తున్నది.

అంతేకాదు, వర్ధమానదేశాలకూటమికి రూపకల్పన కూడా నెహ్రూకృషి అని చెప్పవలసి వుంది. ఇదే తృతీయా కూటమిగా కూడా చెలామణి అయింది. ఇటు పాశ్చాత్య దేశాల కూటమి, అటు కమ్యూనిస్టు దేశాల కూటమి ప్రపంచరాజకీయాల్లో బరిమీద నిలబడి పరస్పరం కత్తులు దూసుకుంటున్న తరుణంలో చిన్నచిన్నదేశాలు ఏదో కూటమిలో చేరక తప్పని పరిస్థితులను అగ్రరాజ్యాలు తెచ్చిపెట్టేవి. ఆర్థిక సహాయం పేరిట, ఆయుధ సహాయం పేరిట ఆశలు చూపి, తమపై ఆధారపడిన

బడుగు దేశాల గొంతుపై కత్తి పెట్టి తమవైపు లాక్కునే మృత్యున్యాయాన్ని ఎదిరించి జవహర్లాల్ ఈజిప్టు, ఇండోనేషియా, శ్రీలంక వంటి దేశాల సహకారంతో వర్ధమాన దేశాల కూటమిని ఏర్పరచి, తృతీయ రాజకీయ శక్తిగా ప్రపంచానికి అందించి, ప్రపంచ రాజకీయ మేధావిగా జవహర్లాల్ కీర్తి గడించాడు. ఈ విజయం జవహర్లాల్ రాజనీతి దృక్పధానికి కలికి తురాయిగా భాసించింది.

జవహర్లాల్ భారీపరిశ్రమలను తీర్చిదిద్దాడు. తద్వారా నిరుద్యోగ సమస్యకు పరిష్కారం కూడా లభించగలదని ఆయన నమ్మకం. భిలాయ్, దుర్గాపూర్‌లలో ఉక్కు, ఇనుప కార్మాగారాలు,చిత్తరంజనలో రైలు యింజన్‌ల తయారీ, పెరంబూరు రైలు పెట్టెల కార్మాగారం వంటి భారీ పరిశ్రమ స్థాపన నెహ్రూ కృషి అని చెప్పవలసి వుంది.

అప్పట్లో కాశ్మీరు వివాదం జటిల సమస్యగా వుండేది. షేక్ అబ్దుల్లా మొండిగా వ్యవహరిస్తూ వున్న ధశలో, పదకొండు సంవత్సరాలుగా కుడ్ జైలులో బంధింపబడిన, అబ్దుల్లాతో సంప్రతించి, కాశ్మీరులో ఎన్నికలు జరిపించి సమస్యను చాకచక్యంగా జవహర్లాల్ పరిష్కరించినారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో కూడా జస్టిస్ వాంఛూ నివేదిక ప్రకారం ఆంధ్రుల కోర్కెను మన్నించి, రాష్ట్ర నిర్మాణాన్ని తన చేతుల మీదుగా ప్రారంభోత్సవం జరిపాడు. ఆంధ్ర ప్రదేశ్ పట్ల నెహ్రూ చూపిన ప్రేమాభిమానాలకు చిహ్నం నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం అని చెప్పవలసి వుంది. నెహ్రూ స్వయంగా నాగార్జునసాగర్ ఆనకట్టకు ప్రారంభోత్సవం జరిపినప్పుడు అక్కడ ఉత్సవంలో పాల్గొన్న ఒక ఆంధ్రరైతు "ఇది నీవు పెట్టిన దీపమే" అని నెహ్రూను ఆశీర్వదించినాడు.

అప్పట్లో పార్లమెంటులో డాక్టర్ శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ, భూపేశ్‌గుప్తా, సుందరయ్య, తరిమెల నాగిరెడ్డి, వంటి హేమాహేమీలు వుండేవారు. అయినప్పటికీ పార్లమెంటు వ్యవహారాలను సజావుగా, హుందాగా నిర్వహించడంలో నెహ్రూ రాజనీతి వ్యక్తమయ్యేది.

నెహ్రూ మంత్రి వర్గంలో గోవిందవల్లభ్‌పంత్, సర్దార్ వల్లభాయిపటేల్, వి.కె. కృష్ణమీనన్, చింతామణి దేశ్‌ముఖ్, మొరార్జి దేశాయ్, యస్.కె.పాటిల్ వంటి దిగ్గజంతులు వుండేవారు.

ప్రపంచ దేశాలన్నిటితో సమరస వైఖరి, స్నేహసంబంధాలను నెహ్రూజీ పెంచి పెద్ద చేసాడు. ప్రపంచ దేశాలకు ఇండియా రాజకీయ సలహాదారుగా తీర్చిదిద్దిన ఘనత నెహ్రూది.

అప్పట్లో అమెరికా ప్రెసిడెంట్ జాన్.యఫ్. కెనడీతో నెహ్రూ స్నేహపాత్రంగా వుండేవాడు. రష్యా, అమెరికాల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనే రోజుల్లో నెహ్రూజీకి కెన్నడీతో గల స్నేహ సంబంధాలు రష్యాకు అడ్డుకాలేదు. రష్యాతో ఇండియాకు ఏర్పడిన ఆర్థిక ఒప్పందాలు అమెరికాకు కన్నెర్ర కాకుండా నెహ్రూ సమయోచితంగా, రాజనీతిజ్ఞతతో వ్యవహరించి, ఇండియా ప్రతిష్టలను యినుమడింపచేసాడు.

హిందీ రూసీ భాయ్ భాయ్ అంటూ రష్యాతో చెట్టాపట్టాలు పలుకుతూనే, హిందీ చీనీ భాయ్ భాయ్ అంటూ చౌఎన్‌లైను ఆలింగనం చేసుకున్న ఘనుడు శ్రీ నెహ్రూ.

రష్యా అమెరికాల మధ్య యుద్ధ వాతావరణం, సూయెజ్ కెనాల్ జాతీయం చేసినప్పుడు ఈజిప్టుతో పశ్చిమ రాజ్యాలకు గల వైరం, శ్రీలంక వద్ద హిందూ మహాసముద్రంలో అమెరికా యుద్ధస్థావరాల ఏర్పాటు, క్యూబాలో ఫైడల్‌కాస్ట్రో ఎర్రజెండా ఎగర వేసిందుకు అమెరికా కన్నెర్ర, దక్షిణాఫ్రికాలో జాతి విచక్షణ ఇతర సమస్యలలో ప్రపంచం ప్రతిక్షణం యుద్ధం అంచుకు చేరుతూ, దేశ దేశాల ప్రజలు భీతిల్లుతున్న తరుణంలో, మూడవ ప్రపంచ యుద్ధం అనివార్యమేమోననే యుద్ధమేఘాలు ఆవరించిన సమయంలో నెహ్రూజీ శాంతి పావురాన్ని భూమండలం మీద ఎగరవేసి, శాంతి వాతావరణాన్ని ఏర్పరచినాడు.

నెహ్రూజీ బాలలంటే ఎంతో యిష్టపడేవాడు. అందుకే నెహ్రూజన్మదినం బాలల దినోత్సవంగా జరుపబడుతున్నది. నేటి పిల్లలే రేపటి బావిభారత పౌరులంటూ నెహ్రూజీ బాలల మీద ప్రేమనురాగాలనుచూపేవాడు. చాచానెహ్రూ అంటూ పిల్లల దృష్టిలో నెహ్రూ స్థిరపడిపోయినాడు.

విశాల దృక్పధం, అభ్యుదయ భావాలు, ప్రపంచ రాజకీయాల్లో అత్యంత కీలక పాత్ర వహించిన జవహర్లాల్ నెహ్రూ అనుకోకుండా చైనా దాడి చేయడంతో నిర్వీణ్ణులైనాడు. తాను పెంచిపోషించిన పంచశీల వ్యర్థమైందే అని నెహ్రూ ఆవేదన చెందాడు. టిబెట్టు బౌద్ధాచార్యుడు దలైలామా శరణార్థిగా భారతదేశం వచ్చినప్పుడు ఆయనకు ఆశ్రయమిచ్చి హిమాచల ప్రదేశ్‌లో వసతి ఏర్పాటు చేసినందుకు కోపగించిన చైనా భారతదేశంపై కత్తి గట్టింది. పాకిస్తాన్‌ను దువ్వి ఇండియాపైకి ఉసిగొల్పింది. ఈ రెండు దురదృష్టకర సంఘటనలు నెహ్రూజీని బాగా క్షోభపెట్టాయి.

అప్పటికే శ్రీమతి ఇందిరాగాంధీని కాంగ్రెస్ అధ్యక్షురాలిగా నియమించి, దేశ రాజకీయరంగం మీదికి తెచ్చి, భవిష్యత్ భారతదేశ రాజకీయ సారధిగా ఆమెను తీర్చిదిద్దినాడు.

జవహర్లాల్ నెహ్రూ 75 సంవత్సరాల వయస్సులో మెదడులో రక్తనాళాలు చిట్లి 1964 మే 27 న దేహయాత్ర చాలించాడు. మేరు నగదీరుడు, మేధావి, ప్రపంచ రాజనీతిజ్ఞుడు, భారతరత్న నెహ్రూజీ మరణిస్తే భారతదేశాన్ని ముందుకు నడిపించే నాధుడెవరు ? అన్న సందేహాన్ని దేశప్రజలలో కలిగించిన భారత రాజకీయ దురంధరుడు నెహ్రూజీ.

నెహ్రూజీ మరణం ప్రపంచానికే తీరనిలోటుగా ప్రపంచ రాజనీతిజ్ఞులు వ్యాఖ్యానించారు. శాంతి కపోతం చనిపోయిందంటూ నెహ్రూ మరణం పట్ల ప్రపంచం దుఃఖించింది.

భారతదేశ రధసారధి కనుమరుగైనాడని భారత ప్రజ తల్లడిల్లింది. ఢిల్లీలోని యమునా నది ఒడ్డున శాంతిఘాట్ పేరిట నెహ్రూ జీవసమాధి నిర్మింపబడింది.

నెహ్రూజీ ఆశయం మేరకు అలహాబాద్‌లోను ఆనందభవన్ మ్యూజియం దేశదేశాల పర్యాటకులకు ఉత్తేజాన్ని, స్ఫూర్తిని కలిగిస్తూ చరిత్రలో శాశ్వత స్థానాన్ని ఏర్పరచుకొన్నది. ఢిల్లీలోని త్రిమూర్తి భవనంలో నెహ్రూజీ స్మృతి చిహ్నంగా నేటికీ అమర జ్యోతి వెలుగుతూనే వుంది.

# అమరజీవి పొట్టిశ్రీరాములు

కుంఫినీ దొరలు ఇండియాలో కోటలు కట్టుకొని, వర్తక వాణిజ్యాలు ప్రారంభించిన నాటికి, మదరాసు నగరం అప్పట్లో చిన్న బెస్తపల్లెగా వుండేది. ముతరాసు చెన్నప్ప అనే ఆంధ్రుడు బంగాళాఖాతం సముద్రతీరాన చేపలు పట్టుకుంటూ జీవిస్తూ వుండేవాడు. అతని సంతతి, అదేవృత్తితో జీవించే మరికొందరు పల్లెకారులు చిన్నచిన్న గుడిసెలు వేసుకొని వుండేవారు. అది అలా పెరుగుతూ ఒక పెద్దసైజు పల్లెగా విస్తరించింది.

ఈస్టిండియా కంపెనీ దొరలు మొదట మచిలీపట్టణంలో కోట కట్టుకొని, స్థిరపడి, అక్కడ నుండి సముద్ర తీరాలంట మకాంలు ఏర్పాటు చేసుకుంటూ, వర్తక వాణిజ్యాలను అభివృద్ధి చేసుకుంటు వచ్చారు.

ముతరాసు చెన్నపల్లె తెల్లదొరలకు హర్బరు నిర్మాణానికి అనువుగా తోచింది. ఇంగ్లీషు వారి ఉచ్ఛారణలో ముతరాసు పదాన్ని మద్రాసుగా వ్యవహరించారు. అదే నేటి మెద్రాసు నగరంగా రూపుదాల్చింది. అక్కడ ఓడరేవు (హార్బరు) నిర్మించి, ఆంధ్ర ప్రాంతంలోని రైతులు పండించే నీలి ఆకును (నీలిమందు) హార్బరుకు చేర్చి, అక్కడ నుండి ఇంగ్లండుకు ఓడలో తరలించుకపోయేవారు.

1857 లో కంఫినీ పాలనకు బదులుగా, విక్టోరియా రాణి పరిపాలన నేరుగా ఇండియాలో స్థిరపడిన తదుపరి మదరాసు బాగా విస్తరించింది. దక్షిణ భారతదేశంలోని ఆంధ్ర, కర్ణాటక, కేరళ, తమిళ రాష్ట్రాలు, సిలోన్‌తో సహా ఒకే ప్రావిన్సు క్రింద చేర్చబడి మద్రాసు ఉమ్మడి రాష్ట్రంగా పిలువబడింది. మదరాసు రాష్ట్రానికి మద్రాసు నగరం ముఖ్య పట్టణంగా వుండేది. నాలుగు రాష్ట్రాలకు ఉమ్మడి పాలనతో పాటు, హైకోర్టు కూడా మద్రాసులోనే నెలకొని వుండడం చేత, ఆంధ్రప్రాంతంలోని ప్రజలు వ్యవహారాల నిర్వహణగానీ, కోర్టు పనులకు గానీ మద్రాసుకు తరచూ వెళ్లవలసి వచ్చేది. తొలుత చెన్నప్ప పల్లె అయినందున, మద్రాసు నగరాన్ని తదుపరి కాలంలో చెన్నప్ప పట్టణం అని ఆంధ్ర ప్రాంతీయులు పిలుస్తూ వుండేవారు. అదే వ్యావహారికంగా చెన్నపట్టణంగా స్థిరపడింది.

చెన్నపట్టణం విస్తరించే కొలదీ, నూతనంగా ఏర్పడుతున్న ప్రాంతాలకు ఇంగ్లీషు పేర్లనే తెల్లదొరలు నమోదు చేస్తూ వచ్చారు. జార్జిటౌను అలా పిలవబడిందే. నిజానికి మద్రాసులోని జార్జిటౌను అంతా ఆంధ్ర ప్రాంతం నుండి వలస వెళ్లిన తెలుగువారితోనే నిండి పోయింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి మద్రాసు

ముఖ్యపట్టణమైనందున, జీవనోపాధికి, వ్యాపారానికి కూడా అనువుగా వుండి, తెలుగు కుటుంబాలు మద్రాసుకు వలస వచ్చాయి. అలా వలస వచ్చి జార్జిటౌనులో స్థిరపడిన తెలుగువారిలో వైశ్యకులానికి చెందిన వారే ఎక్కువగా వుండేవారు. జార్జి చక్రవర్తిపేరుతో జార్జిటౌను నిర్మితమైంది.

ఆవిధంగా వలస వచ్చిన తెలుగు కుటుంబంలో పొట్టి గురవయ్యగారి కుటుంబం ఒకటి. పొట్టి గురవయ్యగారి పూర్వీకులు మొదట్లో మద్రాసు సమీపంలోని న్యాయపాళెం వలస వచ్చారు. వీరి పూర్వనివాసం అప్పట్లో నెల్లూరు జిల్లా (నేటి ప్రకాశంజిల్లా) లోని పెదచెర్లోపల్లె. ఇది కనిగిరికి దగ్గర్లోవుంది. గురవయ్యగారికి మహాలక్ష్మమ్మతో వివాహం జరిగింది. మహాలక్ష్మమ్మ పూర్వీకులు నేటి ప్రకాశం జిల్లా మారెళ్లలో వుండేవారు.

తదుపరి గురవయ్య, మహాలక్ష్మమ్మ దంపతులు న్యాయపాళెం నుండి మద్రాసులోని జార్జిటౌనులో గల అన్నాపిళ్లై వీధిలోకి జీవనోపాధి వెతుక్కుంటూ వచ్చారు. గురవయ్య, మహాలక్ష్మమ్మ దంపతులకు ఒక కుమార్తె, ముగ్గురు కుమారులు జన్మించారు.

వీరిలో మూడవ సంతానంగా పొట్టి శ్రీరాములు 1901 మార్చి 16న జన్మించాడు. పొట్టి శ్రీరాములు జన్మించిన జార్జిటౌనులోని అన్నాపిళ్లైవీధిలోగల 16వ నెంబరు యిల్లు ఆంధ్రుల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడింది. అందుకు కారణం ఆ యింట్లో పొట్టి శ్రీరాములు జన్మించడమే.

శ్రీరాములు ఎనిమిదవ ఏటనే తండ్రి గతించాడు. రెక్కల కష్టం మీదనే జీవించే కుటుంబం గావడం వల్ల, పిల్లల సంరక్షణను తల్లి మహాలక్ష్మమ్మగారే వహించవలసి వచ్చింది.

మహాలక్ష్మమ్మ పట్టుదల, ఓర్పుగల మనిషి. ఇరుగుపొరుగు యిండ్లలో పిండి రుబ్బి, కారందంచి, కాయకష్టంచేసి సంతానాన్ని పోషించుకుంటూ వచ్చింది. ఆమె సంతానంలో పెద్దకొడుకు నారాయణ, కుమార్తె గురవమ్మ చనిపోగా, మిగిలింది యిద్దరు కుమారులు. వారిలో పెద్దవాడు శ్రీరాములు, రెండవవాడు రంగయ్య.

కుమార్తె గురవమ్మ చనిపోగా ఆమె కుమార్డు కూడా చిన్న వయస్సులోనే తనవద్దకు తెచ్చుకొని తన యిద్దరి కుమారులతోపాటు పెంచసాగింది. అనగా నరసింహంగుప్తా, స్వయానా శ్రీరాములుకు మేనల్లుడు.

శ్రీరాములు చురుకైన విద్యార్థి. చదువు సంధ్యల్లో తెలివిగా వుండేవాడు. అంతేగాదు, తల్లికి బాసటగా వుంటూ వుండేవాడు. కొంతకాలానికి మహాలక్ష్మమ్మగారు తన మంచితనంతోనూ, పొరవతోనూ రుబ్బుడు పిండి మిషన్, దంపుడు కారపు

మిషన్‌లు రెంటిని కొనుగోలు చేసి, వాటి మీద వచ్చే ఆదాయంతో పిల్లలను చదివించుకుంటూ, వారికే లోటు రానీయకుండా జాగ్రత్తపడుతూ వచ్చింది.

శ్రీరాములు ప్రాథమిక విద్య గోవిందప్ప నాయకన్ వీధిలోని బంగళావర్లి కుటమీ పాఠశాలలో గడిచింది. తదుపరి ఆదియప్పన్‌నాయకన్‌వీధిలోని సెంకడరీ స్కూలులోనూ, మింట్ స్ట్రీట్‌లోని హిందూ థియోలాజికల్ హైస్కూలులో చదివి హైస్కూలు విద్య పూర్తిచేసాడు.

హైస్కూలులో చదివే రోజుల్లో శ్రీరాములు ఆటపాటల్లో కూడా చురుకుగా పాల్గొనేవాడు. పాఠశాల విద్యతోపాటు, యింట్లో తల్లిగారి వద్ద ఆధ్యాత్మిక గుణాన్ని, ప్రాచీన సాహిత్యాన్ని పురాణగ్రంథాల్ని వంట పట్టించుకున్నాడు. ఆచార సాంప్రదాయాల్లోనూ, పూర్వ అలవాట్లలోనూ పిల్లల పెంపకంలో కూడా ఆ సాంప్రదాయిక విధానాన్ని ఆమె పాటిస్తూ వచ్చింది. శ్రీరాములుగారికి తల్లిగారి నడవడి, సంస్కారం బాగా అబ్బినవి. పురాణ, గ్రంథాలను చదవడం, ఆచార వ్యవహారాలను పాటించడం తల్లిగారిని అనుసరించేవాడు.

హైస్కూలులో చదివేరోజుల్లో శ్రీరాములు స్కూలు వార్షికోత్సవ సందర్భంలో నాటికలు, నాటక ప్రదర్శనలో పాల్గొని చిన్న చిన్న పాత్రలను ధరించేవాడు. హరికథా కాలక్షేపాలు జరుగుతున్నప్పుడు తప్పకుండా హజరవుతూ, శ్రద్ధగా వినేవాడు. హరిశ్చంద్రనాటకం, రామాయణ, భారత, భాగవత సత్కాలక్షేపాలు వింటూ, పురాణపురుషుల ఉదాత్తతను అలవర్చుకొనేవాడు. అందువల్ల తోటి విద్యార్థుల మధ్య శ్రీరాములు విలక్షణంగా మెలిగేవాడు. ఇంగ్లీషు చదువులో శ్రీరాములు ప్రథమ శ్రేణిలో నెగ్గుతూ వచ్చాడు.

శ్రీరాములు పొట్టిగా, బొద్దుగా నిగనిగలాడే కృష్ణవర్ణంలో చురుకైన కండ్లతో, ప్రశాంతత నిండిన వదనంతో కనిపిస్తాడు. అవగాహనశక్తి గలవాడు. మితభాషి.

శ్రీరాములుకు వివాహం చేయాలని తల్లి నిశ్చయించింది. మహలక్ష్మమ్మ గారి పుట్టిల్లు నేటి ప్రకాశం జిల్లాలోని మార్నెళ్ల గ్రామం మహలక్ష్మమ్మగారి అన్న గునుపూడి నరసయ్య శెట్టి మార్నెళ్లలోనే చిన్న వ్యాపారం చేసుకుంటూ జీవిస్తున్నాడు. నరసయ్యశెట్టి కుమార్తె సీతమ్మతో శ్రీరాములు వివాహం జరిగింది. కట్నకానుకలు లేకుండా ఆదర్శవంతంగా, నిరాడంబరంగా పెళ్లి జరిగింది.

హైస్కూలు విద్య పూర్తి అయిన తదుపరి 1920లో శానిటరీ ఇంజనీరింగు కోర్సు చదవడానికి శ్రీరాములు బొంబాయి వెళ్లాడు. 1920 నుండి 1924 వరకు బొంబాయి లోని విక్టోరియా జూబ్లి ఇన్‌స్టిట్యూట్‌లో శానిటరీ యింజనీరింగ్ కోర్సు నాలుగేళ్లు చదివి 1924లో డిప్లమో పొందాడు. అక్కడ నుండి తిరిగి మద్రాసు

వచ్చాడు. మదరాసులో మునిసిపల్ రెవిన్యూ ఆఫీసరుగా నలభై అయిదు రూపాలియల వేతనం మీద ఉద్యోగానికి కుదిరాడు. కానీ కొద్ది కాలం మాత్రమే ఆ ఉద్యోగంలో శ్రీరాములుగారు పనిచేశాడు.

ఇంతలో ఆయనకు బొంబాయిలో జి.పి.పి. రైల్వేలో శానిటరీ ప్లంబరు ఉద్యోగం వచ్చింది. వెంటనే వెళ్లి శ్రీరాములు గారు ఉద్యోగంలో చేరాడు. బొంబాయిలోని ప్రధాన రైల్వేస్టేషన్ అయిన విక్టోరియా టెర్మినల్ నుండి పాకీపనివాంఢ్ర చేత, శానిటరీ పనులు చేయించడం, మరికొంతకాలం బొంబాయి నుండి కళ్యాగ్ వరకు తిరుగుతూ వుద్యోగం నిర్వహించడం. బొంబాయి లోని పరేక్ వద్ద ఆర్.కె. బిల్డింగ్సులో మకాం.

బొంబాయిలో భార్యతో కాపురంపెట్టి, ఉద్యోగ బాధ్యతలు నిర్వహించుకుంటూ, తీరిక సమయాల్లో శ్రీరాములుగారు తన క్రింద పనిచేసేవారి బాగోగుల పట్ల శ్రద్ధ వహించేవాడు. పరిశుభ్రంగా వుండాలి. త్రాగుడు వ్యసనాన్ని వదిలి వేయాలి. పిల్లల్ని చదివించాలి. అంటూ వారికి బోధిస్తూ, ప్రతి ఒక్కరికి సహాయకారిగా వ్యవహరించేవాడు.

ఈలోగా తల్లిగారికి జబ్బుచేసింది. తల్లిగారిని బొంబాయిలో తనవద్ద వుంచి, మంచి వైద్యం చేయించాడు. ఇంతలో భార్య సీతమ్మ ప్రసవించే సమయంలో తీవ్రంగా జబ్బుకు గురి అయింది. మొదటి కాన్పు అతి కష్టం మీద ప్రసవించింది. అయితే ప్రసవించిన వారం రోజులకే బిడ్డ చనిపోయింది. భార్యకు జబ్బు తిరగబెట్టింది. ఈ పరిస్థితుల్లో శ్రీరాములుగారు తీవ్ర వ్యాధికి గురి అయిన భార్యను వెంటనిడుకొని ఆమె పుట్టిల్లు అయిన మార్లెల్ల తీసుకొచ్చాడు. అక్కడ సీతమ్మ చనిపోయింది. శ్రీరాములుగారి మనస్సు వికలం అయింది. పుట్టిన వారం రోజులకే బిడ్డ మరణం, తిరిగి కొద్దికాలానికే భార్య చనిపోవడం శ్రీరాములుగారూ మానసికంగా బాగా దెబ్బతిన్నాడు.

కొద్దికాలం తోటి ఉద్యోగుల మధ్య, ఉద్యోగ బాధ్యతలతో కాలాన్ని నెట్టుకొచ్చాడు. ఇంతలో పులిమీద పుట్రలా శ్రీరాములుగారి తల్లి మహలక్ష్మమ్మ దివంగతురాలైంది. శ్రీరాములుగారు తీవ్రమైన మానసిక బాధకు గురి అయ్యాడు. ఊహరాని వయస్సులో తండ్రి చనిపోయాడు. చిన్నప్పటి నుండి అతిగారాబంగా పెంచి, పెద్ద చేసిన తల్లి మరణించింది. అర్ధాంగి ప్రసవించిన వారం రోజులకే పుట్టిన బిడ్డ మరణించింది. అర్ధాంగి కూడా తనని విడిచి స్వర్గస్థురాలైంది. ఏమిటీ యీ జీవితం ? యిక ఎందుకు జీవించాలి ? యీ ఉద్యోగం, బాధ్యతలు, ఆదాయం ఎవరి కోసం ? ఎందుకు ? అంటూ శ్రీరాములుగారు వైరాగ్యానికి గురి అయ్యాడు.

హైస్కూలులో చదివే రోజుల్లోనే శ్రీరాములుగారు జాతీయ పోరాటాన్ని గురించి, దేశరాజకీయ పరిస్థితుల గురించి అవగాహన చేసుకుంటూ వచ్చాడు. గాంధీజీచే ప్రచురింపబడే యంగ్ ఇండియా, నవజీవన్ పత్రికలను విడువకుండా చదివేవాడు. గాంధీజీ ఆశయ, ఆదర్శాలు, శ్రీరాములుగారిని బాగా ప్రభావితం చేసేవి.

మానసికంగా క్రుంగిపోయి, జీవితం పట్ల విరక్తి కలిగిన ప్రస్తుత తరుణంలో శ్రీరాములుగారి కళ్ల ముందు గాంధీజీ సిద్ధాంతాలు, జాతీయోధ్యమం కదిలాడాయి. సంఘసేవకు, దేశసేవకు తన జీవితాన్ని అంకితం చేసుకుందామని శ్రీరాములుగారు నిశ్చయించుకున్నాడు. వెంటనే తన అల్లుడైన నరసింహ గుప్తను, తమ్ముడు రంగయ్యను పిలిపించి తన నిర్ణయాన్ని తెలియజేసాడు. ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు. తనకున్న స్థిరచరాస్తులను, సోదరుడికి, మేనల్లుడికి పంచియిచ్చాడు.

గాంధీజీ ఉప్పు సత్యాగ్రహం చేయడానికి దండియాత్ర జరుపుతున్న రోజులవి. మేనల్లుడు నరసింహంగుప్తను వెంటతీసుకొని, శ్రీరాములుగారు సూరత్ వద్ద గాంధీజీని కలుసుకున్నారు. గాంధీజీతో పాటు దండియాత్రలో పాల్గొన్నాడు.

శ్రీరాములుగారు తన నిర్ణయాన్ని గాంధీజీకి తెలియపరిచి కర్తవ్యం తెలుపవలసిందిగా కోరాడు. శ్రీరాములుగారిలో కర్తవ్య దీక్ష, నిజాయితీని గాంధీజీ గుర్తించాడు. దేశ స్వాతంత్ర పోరాటంలో పాల్గొనేందుకు సహాయ నిరాకరణ ఉధ్యమ ప్రభావానికి స్పందించి, ఉద్యోగానికి రాజీనామాచేసి, జాతీయోధ్యమానికి తన జీవితాన్ని అంకితం చేసుకున్న శ్రీరాములుగారి కర్తవ్యపరాయణత గాంధీజీని ముగ్ధుల్ని చేసింది.

శ్రీరాములుగారిని సబర్మతి ఆశ్రమం వెళ్లి, ఆశ్రమ వ్యవహారాలు చూడవలసిందిగా గాంధీజీ ఆదేశించాడు. వెనువెంటనే శ్రీరాములుగారు సబర్మతి ఆశ్రమం వెళ్లాడు. జమ్నాలాల్ బజాజ్ గారి ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న సబర్మతి ఆశ్రమంలో శ్రీరాములుగారికి ముఖ్యమైన బాధ్యత అప్పగించబడింది. అచ్చట ఆశ్రమ వాసిగా చరకా, ఖద్దరు ప్రచారం, అస్పృశ్యతా నివారణ, సత్యం, అహింసా కార్యక్రమాలపై శిక్షణ పొందాడు. అనతి కాలంలోనే గాంధీజీకి అభిమానపాత్రుడైనాడు. సబర్మతి ఆశ్రమంలో 1930 ఏప్రియల్ 16 నుండి ఆశ్రమ వాసిగా శ్రీరాములుగారు వుండిపోయాడు. 1934 వరకు ఆశ్రమ జీవితం కొనసాగుతూ వచ్చింది.

1934లో బీహార్‌లో భూకంపం సంభవించి పెద్ద ఎత్తున ఆస్తి ప్రాణ నష్టాలు జరిగాయి. దేశం నలుమూలల నుండి బీహార్ భూకంప బాధితులకు సహాయ సహకారాలు లభించాయి. 1934 జనవరి 15న జరిగిన యీ భూకంపంలో లక్షలాది మంది ప్రజలు చనిపోయారు. కోటిమంది భూకంప ప్రతాపానికి గురయ్యారు.

చాప్రా, ముజఫర్, చాంపరాన్ ప్రాంతాలలో పొట్టి శ్రీరాములుగారు పర్యటించి, బాధితులకు సేవలు చేసాడు. విరాళాలను వసూలు చేసి క్షతగాత్రులకు అందజేసాడు. బీహారు భూకంప బాధితులకు పొట్టి శ్రీరాములుగారు చేసిన సేవలను గాంధీజీ ప్రశంసించాడు. అంతకు మునుపే సత్యాగ్రహ సందర్భంలో శ్రీరాములుగారు అరెస్టు కాబడి నాసిక్ సెంట్రల్ జైలులో నిర్బంధించపబడి జైలుశిక్ష పూర్తి చేసాడు.

1935 లో శ్రీరాములుగారు సబర్మతి ఆశ్రమం నుండి గాంధీజీ అనుమతి పై రాజకోట వెళ్లాడు. గాంధేయవాది నారన్‌దాసు గాంధీ ఆహ్వానం మేరకు గుజరాత్‌లోని రాజకోటవద్ద వల్లభాయి పటేల్‌చే స్థాపించబడిన ధారవాడ ఆశ్రమంలో కొన్నాళ్లు గడిపాడు. యిచ్చట శ్రమజీవి సంఘకార్యకలాపాల్లో పాల్గొన్నాడు. శ్రమజీవి సంఘం ఆశయాలు శ్రీరాములుగారిని బాగా ఆకట్టుకున్నాయి. పేదలకు సేవచేయడం, అంటరాని తనానికి వ్యతిరేకంగా పోరాటం, అనాధ ప్రేతలను దహనం చేయడం వంటి సంఘ సేవల్లో శ్రీరాములుగారు కూడా పాల్గొని రాజకోటలోనూ, ఆమ్రేలిలోనూ కొంతకాలం గడిపాడు. రాజకోటలో యు.యన్.ధేబర్, గోకుల్‌భాయి భట్, మున్నగు గాంధేయులతో కలిసి సౌరాష్ట్ర, గుజరాత్‌లలో వేలాది మంది కార్యకర్తలకు శిక్షణ గడిపారు. హరిజన దేవాలయ ప్రవేశాలూ, సమిష్టి భోజనాలు, ఖద్దరు ఉత్పత్తి, స్వదేశీ వస్తువుల నిర్మాణం, తదితర కార్యక్రమాలను నిర్వహించారు.

సరిగ్గా యీ సమయంలో శ్రీరాములుగారి సోదరుడు డాక్టరు రంగయ్య గుప్త వద్ద నుండి శ్రీరాములుగారికి టెలిగ్రాం వచ్చింది. డాక్టర్ రంగయ్య నెల్లూరు జిల్లా జువ్వెల దిన్నెలో పంచాయితీ బోర్డు డిస్పెన్సరీ మెడికల్ ఆఫీసరుగా వుంటున్నాడు. డాక్టరు రంగయ్య యిచ్చిన టెలిగ్రాంలో శ్రీరాములుగారి మేనమామ పిల్లనిచ్చిన మామ కూడా అయిన నరసయ్య శెట్టికి తీవ్రంగా జబ్బు చేసిందనీ, వెంటనే రావలసిందిగా కోరుతూ వచ్చిన కబురు వుంది. వెంటనే శ్రీరాములుగారు తనవెంట వున్న మేనల్లుడు నరసింహగుప్తతో కలిసి మాల్లె గ్రామం చేరుకున్నాడు. అనతి కాలంలోనే శ్రీరాములుగారి మేనమామ స్వర్గస్థులైనారు. తదుపరి కొంతకాలం శ్రీరాములుగారు మాల్లెలోనే వుండి అక్కడి పంచాయతీ బోర్డు డిస్పెన్సరీ మరమ్మత్తులు చేయించాడు. మధ్యపాన వ్యతిరేక ప్రచారం సాగించి, స్థానిక ప్రజలోని దుర్వ్యసనాలకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ ప్రజలలో మార్పును తెచ్చాడు.

తదుపరి శ్రీరాములుగారు కొంత కాలం కృష్ణాజిల్లా లోని కొమరవోలులో సాధు సుబ్రహ్మణ్యం స్థాపించిన గాంధీజీ ఆశ్రమంలో వుండిపోయాడు. ఈ ఆశ్రమాన్ని అప్పట్లో కాంగ్రెసు అధ్యక్షుడిగా వున్న బాబూ రాజేంద్ర ప్రసాద్

ప్రారంభోత్సవం జరిపారు. ఈ ఆశ్రమంలో శ్రీరాములుగారు నిర్మాణాత్మకమైన కార్యక్రమాల్లో పాల్గొంటూ సాధుసుబ్రహ్మణ్యం గారితో కలిసి సర్వోదయ కార్యకర్తలకు శిక్షణ యిస్తూ, మత, కులరహితమైన సమిష్టి భోజనాలు, సంతర్పణలలో పాల్గొంటూ, సాంఘిక కార్యక్రమాలు నిర్వహించారు.

తదుపరి శ్రీరాములుగారు గుడివాడ వెళ్లి బ్రిటిషు ప్రభుత్వ దమనకాండకు వ్యతిరేకంగా జెండా ఊరేగింపు సత్యాగ్రహం చేసారు. యీ సందర్భంలో బ్రిటిషు ప్రభుత్వం శ్రీరాములుగారిని అరెస్టు చేసి ఆరు నెలల శిక్ష విధించి, రాజమండ్రి సెంట్రల్ జైలులో బంధించి, కొంతకాలానికి బళ్లారివద్ద ఆలీపూర్ జైలుకు తరలించింది.

జాతీయోద్యమ కాలంలో ఆలీపూర్ జైలు క్యాంపు ఎల్లప్పుడూ దేశభక్తులతోనూ, జాతీయ నాయకులతోనూ నిండి వుండేది. అప్పట్లో ఆలీపూర్ జైలులో పొట్టి శ్రీరాములు గారితో పాటు ఘంటసాల వెంకటేశ్వరావు, వావిలాల గోపాలక్రిష్ణయ్య, ఎర్నేని సుబ్రహ్మణం(సాధు), గోరా(గోపరాజు రామచంద్రరావు), యలమంచలి వెంకటప్పయ్య తదితరులు వుండేవారు. జైలు పరిస్థితులు అధ్వాన్నంగా వుండేవి. పురుగుల అన్నం, క్రిక్కిరిసి వుండే జైలు గదులు, దుర్గంధం వ్యాపించే పాయికానాలతో ఏ మాత్రం శుచీ శుభ్రతా లేని ఆలీపూర్ జైలులో అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తూ వుండేవారు. ఒక్కొక్కప్పుడు జైలులోని పరిస్థితులను సరిచేసేందుకు, అధికారుల దృష్టికి తెచ్చేందుకు జైలులో జాతీయ నాయకులు సమిష్టిగా నిరాహార దీక్షలు చేయవలసి వచ్చేది. పొట్టి శ్రీరాములు, యలమంచలి వెంకటప్పయ్య, సాదు సుబ్రహ్మణ్యం, గోరా గారలు నలుగురూ కలిసి ఒక జట్టుగా జైలులోని పాయికానాలను శుభ్ర పరుస్తూ, జైలు గదులను, ఆవరణను శుభ్రం చేసేవారు. వీరి సేవా దృక్పథం జాతీయ నాయకుల ప్రశంసల్ని పొందింది.

ఆలీపూర్ జైలు నుండి 1944లో శ్రీరాములుగారు విడుదలైనారు. తదుపరి గాంధీజీ అనుమతి పొంది స్వంతజిల్లా అయిన నెల్లూరులో సాంఘిక సేవా కార్యక్రమాలను నిర్వహించేందుకు శ్రీరాములుగారు పూనుకున్నారు.

పొట్టి శ్రీరాములుగారు నెల్లూరు మూలపేటలో భంగీకాలనీలో పాకీవాండ్ల కాలనీలో నివసించేవారు. అప్పట్లో 1944-46 మధ్యలో నెల్లూరులో హిందూ, ముస్లింల ఘర్షణలు జరిగాయి. అనేక మంది మతకలహాల్లో క్షతగాత్రులయ్యారు. అప్పుడు శ్రీరాములుగారు హిందూ, మహమ్మదీయ మతసామరస్యం కొరకు కృషిచేసారు.

నెల్లూరులో శ్రీరాములుగారు విలక్షణమైన పద్ధతిలో సాంఘిక కార్యక్రమాలను నిర్వహించేవారు. పెద్ద సైజు రెండు అట్టలు ముందు వెనుక తగిలించుకునేవారు. వాటిపై అంటరాని తనం పాపకార్యం. దేవుని దృష్టిలో మానవులంతా సమానులే

అని రాసి వుండేది. యీ అట్టలు మెడలో వ్రేలాడుతూ వుండగా నెల్లూరు పట్టణం, పరిసరప్రాంతాలంతటా ప్రచారం చేస్తూ తిరిగేవాడు.

నెల్లూరులోని మూలపేటలోగల వేణుగోపాలస్వామి దేవాలయంలో హరిజనులకు ప్రవేశం కల్పించమంటూ, దేవాలయం ఎదుట నిరాహార దీక్ష సాగించడానికి శ్రీరాములుగారు పూనుకున్నారు. ఉమ్మడి మద్రాసు ప్రభుత్వానికి, గాంధీజీకి, మూలపేట వేణుగోపాలస్వామి దేవాలయ నిర్వాహకులకు శ్రీరాములుగారు తెలియపరిచి నిరాహార దీక్షా శిబిరం ప్రారంభించారు. పట్టణ పౌరులు స్వచ్ఛంద సేవకులు శ్రీరాములుగారికి మద్దత్తు తెలియజేశారు. చివరికి ప్రభుత్వం దిగివచ్చి దేవాలయంలో హరిజన ప్రవేశానికి అనుమతిని మంజూరు జేసింది. ఈ సందర్భంలో శ్రీరాములుగారు దేవాలయ ట్రస్టీ దౌర్జన్యానికి గురి అయ్యాడు. అయినప్పటికీ పట్టు విడవకుండా శ్రీరాములుగారు తన కృషిని సాగించారు. ఈ విషయం గాంధీజీకి తెలిసినప్పుడు శ్రీరాములుగారిని ఎంతగానో ప్రశంసించాడు. శ్రీరాములుగారి వంటి క్రమశిక్షణ, పట్టుదల, దీక్షగల ఆదర్శ ప్రజాసేవకులు పదిమంది వుంటే, స్వరాజ్యాన్ని సంవత్సరకాలంలో సాదించగలను" అంటూ గాంధీజీ అన్నాడు. 21 రోజులు శ్రీరాములుగారు నిరాహార దీక్ష సాగించి, సవర్ణుల హరిజనుల దేవాలయ ప్రవేశం అంగీకారంతో, హరిజనులను రావించి దేవాలయంప్రవేశ మహోత్సవం దిగ్విజయంగా జరగడంతో ఉపవాస దీక్ష విరమణ జరిగింది. శ్రీరాములుగారి ప్రతిష్ట ఎంతగానో యినుమడించింది. జాతీయ స్థాయిలో గాంధేయ సిద్ధాంత ప్రచారకుడిగా శ్రీరాములుగారికి గుర్తింపు లభించింది.

1930లో జాతీయోద్యమంలో ప్రవేశించిన పొట్టి శ్రీరాములు రెండు దశాబ్దాలుగా, అవిశ్రాంతంగా స్వాతంత్ర్య పోరాట కార్యక్రమంలోనూ, సాంఘిక సంస్కరణలలోనూ ఆచరణాత్మకంగా కృషి చేస్తూ వచ్చారు. గాంధేయ సూత్రాలైన ఖద్దరు ప్రచారం, మద్యపాన వ్యతిరేక ఉద్యమం, హరిజనోద్ధరణ, అంటరానితనానికి వ్యతిరేకంగా ప్రచారం, కులమత రహితమైన సహపంక్తి భోజనాలు నిరాడంబర జీవితం, క్రమశిక్షణలను శ్రీరాములుగారు తు.చ. తప్పకుండా ఆచరిస్తూ ప్రచారం చేస్తూ నిజమైన గాంధేయవాదిగా గణతికెక్కారు.

1947 అగస్టు 15న దేశానికి స్వతంత్రం లభించింది. స్వతంత్ర భారత దేశంలో రాజకీయ నాయకులకు, పార్టీలకు పదవుల పంపిణీలు, అధికార లాంఛనాల కొరకూ వూపిరి సలపని పని కార్యక్రమాల్లో మునిగి తేలడం జరుగుతూ వుండగా, పొట్టి శ్రీరాముల వంటి స్వచ్ఛంద సేవకులకు మాత్రం అలాంటి హడావుడి వుండదు. కృషికి తగిన ఫలితం లభించింది. సామాన్యంగా తృప్తి పడడం

మిగులుతుంది. అంతటితో వారి సేవాకార్యక్రమాలు కూడా నిలిచి పోవు. అవిశ్రాంతంగా నిష్కలంకమైన కార్యాచరణతో సాగుతూనే వుంటాయి.

దేశానికి స్వాతంత్ర్యం లభించి ఏడాది తిరగకముందే మహాత్మా గాంధీ హత్యకు గురి అయ్యాడు. గాంధీజీ హత్య గాంధేయులైన వారిని తీవ్ర మనస్తాపానికి గురి చేసింది.

పొట్టి శ్రీరాములు గారు గాంధీజీ హత్యానంతరం సబర్మతి ఆశ్రమంలోనే నిరాహార దీక్ష చేసి, 1948 జనవరి 30 నుండి ప్రతి జనవరి 30వ తేదీ మొదలుగా వారం రోజులు గాంధీ సిద్ధాంతాలను ప్రభుత్వం ప్రచారం చేయాలనీ, యిందుకు మంత్రులు,అధికారులే పూనుకోవాలనీ, యిందుకు ప్రభుత్వం చట్టాన్ని రూపొందించాలని డిమాండ్ చేసాడు. ఆచార్య వినోభా ఆధ్వర్యంలోనే నిరాహార దీక్ష సాగింది. అప్పటి ప్రెసిడెంట్ బాబూ రాజేంద్ర ప్రసాద్ స్వయంగా ఆశ్రమానికి వచ్చి పొట్టి శ్రీరాములుగారి ప్రతిపాదనలను అంగీకరించి, ఆయనచేత దీక్ష విరమింపచేసారు. గాంధేయ సిద్ధాంత ప్రచారానికి పొట్టిశ్రీరాములుగారు సాధించిన చట్టప్రతిపత్తి వల్ల గాంధేయులంతా హర్షించారు. దేశ వ్యాపితంగా పొట్టి శ్రీరాములు గారికి ప్రశంసలు అందాయి. నిజమైన గాంధేయవాదిగా పొట్టి శ్రీరాములు దేశంలో గుర్తించబడ్డాడు.

1949 నుండి పొట్టి శ్రీరాములు గారు గాంధీ స్మారక నిధి ప్రచార సంచాలకుడిగా ఆంధ్ర ప్రాంతాలనికి ఎన్నుకోబడినాడు. గాంధీ సూత్రాల ప్రచారం, సంఘసేవ, స్వచ్ఛంద సంస్థలకు నిధులను మంజూరు చేయడం తదితర నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపట్టి, నిర్వహించడం గాంధీస్మారక నిధి కార్యకలాపాలుగా వుండేవి. నిజాయితీ, క్రమశిక్షణ, చిత్తశుద్ధిగల పొట్టి శ్రీరాములుగారి ప్రధాన సంచాలకులుగా ఎన్నుకోబడినందున, ఆంధ్రప్రాంతంలోని స్వచ్ఛంద సంస్థలు, గాంధీ ఆశ్రమాల నిర్వాహకులు, గాంధేయ వాదులు ఎంతగానో హర్షించి, శ్రీరాములు గారికి అభినందనల్ని తెలిపారు. 1952 దాకా శ్రీరాములు గారు గాంధీస్మారక నిధి సంచాలకులుగా, సర్వోదయ కార్యక్రమాల్లో నిర్విరామంగా కృషి చేస్తూ వచ్చారు. ఈ సందర్భంలో ఆయన తనకు లభించే ఉపకార వేతనాన్ని కూడా తగ్గించుకొని, గాంధేయ సంస్థలకు విరాళంగా యిచ్చేవారు.

1930 నుండి పొట్టి శ్రీరాములు గారు సాంఘిక, రాజకీయ ఉద్యమాల్లో గాంధేయవాదిగా, జాతీయోద్యమంలో పాల్గొని రెండు దశాబ్దాలు నిరంతరంగా కృషి చేస్తూ వచ్చారు. గాంధీ సిద్ధాంతాలయిన ఖద్దరు ప్రచారం, అంటరాని తనానికి వ్యతిరేక ఉద్యమం, హరిజనోద్ధరణ, మధ్యపాన వ్యతిరేక కార్యక్రమం, కుల రహితమైన సహపంక్తి భోజనాలు తదితర సాంఘిక కార్యక్రమాల్లో నిజాయితీ, క్రమశిక్షణ,

నిస్వార్థ భావంతో కృషి చేస్తూ వచ్చారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. జెండా వూరేగింపులు చేసారు. అరెస్టు అయ్యారు. జైలు శిక్షలు అనుభవించారు. ఇదంతా ఆయన జీవితంలో ఒక ఘట్టంగా గడిచింది.

1952 నుండి పొట్టి శ్రీరాములుగారి జీవితంలో రెండవ ఘట్టం ప్రారంభమైంది. ఇదే ఆయన చరమ ఘట్టంగా కూడా భాసించింది. అదే ఆంధ్ర రాష్ట్ర సాధనకు శ్రీరాములుగారు ప్రాయోపవేశంచేసి ఆత్మ బలిదానం చేసిన ఘట్టం.

బ్రిటిషు వారి హయాంలో దక్షిణ భారత దేశంలోని ఆంధ్ర (నైజాం ప్రాంతం నవాబుల పాలనలో వుండేది), కర్నాటక, కేరళ, తమిళనాడు రాష్ట్రాలు, సిలోన్‌తో కలిపి ముఖ్య పట్టణంగా పరిపాలన చేయబడుతూ వచ్చింది. ఆంధ్రులు ఒక ప్రత్యేక జాతిగా వున్నప్పటికీ స్వరాష్ట్రంలేక, ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో కలిసి వుండాల్సి వచ్చింది. ఉమ్మడి రాష్ట్రంలో తమిళులపెత్తనం ఎక్కువగా వుండేది. ఆంధ్రులు పరాధీనులుగా గడపవలసి వచ్చింది. అందు వలన ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం నిర్మించాలంటూ, 1905లోనే గుంటూరులోనే "యువజన సమితి" ఒకటి ఏర్పడింది. 1913లో బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ భయ్యా నరసింహేశ్వరశర్మ అధ్యక్షతన జరిగింది. అప్పటి నుండి ఆంధ్రరాష్ట్రం కొరకు ఆందోళన తీవ్రంతరం చేయబడింది. అయితే మద్రాసు ప్రభుత్వానికి ఆంధ్రులు విడిపోవడం యిష్టంగా వుండేది కాదు. ఆంధ్రుల కోర్కెకు చాలుమాటుగా తమిళులు అడ్డుపుల్లలు వేస్తూనే వున్నారు. పోతే కేంద్ర శాసన సభ 1922లో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానించింది. దీనితో ఆంధ్రులు తమ ఉద్యమాన్ని నిర్మాణంచేయుటకు నిర్ణయించింది. భాషా ప్రయుక్తంగా రాష్ట్రాలను విభజించాలని, ఆంధ్ర రాష్ట్రాన్ని తక్షణం ఏర్పాటు చేయాలని ఆంధ్రుల కోర్కెకు సర్వత్రా మద్దత్తు లభిస్తున్నప్పటికీ రాష్ట్ర నిర్మాణం ఎప్పటికప్పుడు వాయిదా పడుతూనే వస్తున్నది.

ఈ సమయంలో జయపూర్ కాంగ్రెసు మహాసభలో కాంగ్రెసు అధ్యక్షులుగా డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు ఎన్నికైనారు. ఒక ఆంధ్రుడు అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుడిగా ఎన్నికైనందున, యికమీదట ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సులభంకాగలదని ఆంధ్రులు సంతోషించారు. డాక్టర్ పట్టాబి కూడా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కావాలని వాదించే వారు. అందువలన ఆంధ్రుల ఆందోళన మరింత తీవ్రమైంది.

యీ సందర్భంలో కాంగ్రెసు పార్లమెంటరీ కూడా అంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని సూత్రప్రాయంగా అంగీకరించి, జె.వి.పి. కమిటీ పేరిట ఒక కమిటీని నియమించడం జరిగింది. జవహర్లాల్ నెహ్రూ, వల్లభాయి పటేల్, పట్టాబి సీతారామయ్య గార్లతో

కూడిన ఒక కమిటీయే జె.ఎ.పి. కమిటి పేరిట పిలువబడింది. ఈ కమిటి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి గల అవకాశాలను, ప్రతి బంధకాల్ని విచారించి, పరిశీలించి రిపోర్టు తయారు చేస్తుంది.

అయితే ఈ కమిటీ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూనే కొన్ని షరతులను పెట్టింది. "మదరాసు నగరాన్ని ఆంధ్రులు కోరరాదు" అని సూచించింది. ఆంధ్ర నాయకులలో కొందరు యీ కమిటీ సూచనను గట్టిగా వ్యతిరేకించారు. మరి కొందరు తటస్థంగా వూరుకున్నారు. సంజీవరెడ్డి వంటి నాయకులు కొందరు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం చేయబోయే ముందు రాయలసీమ భవిష్యత్తుపై ఒప్పందం జరగాలని కోరారు.

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం మరికొంతకాలం వాయిదా పడింది. అప్పట్లో స్వామి సీతారామ్ ఆంధ్ర రాష్ట్రం కొరకు ఆమరణ నిరాహారదీక్ష చేసారు. 35 రోజులు ఉపవాస దీక్ష జరిగింది. అయితే "ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం జరుగుతుంది. దీక్షను విరమించవలసిందిగా జవహర్లాల్ నెహ్రూ కోరిన మీదట స్వామి సీతారాం ఆమరణ నిరాహార దీక్ష విరమించారు. దీని వల్ల ఆంధ్రులు యిరుగు పొరుగు వారి దృష్టిలో నగుబాట్లు పాలయ్యారు. "ఆంధ్రులు ఆరంభశూరులు" అని ఎద్దేవా చేసారు.

సరిగ్గా యీ సమయంలో పొట్టి శ్రీరాములుగారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సాధనకు పూనుకున్నారు. మద్రాసులో బులుసు సాంబమూర్తి తదితర పెద్దల సలహాలను తీసుకున్నారు. ఆంధ్రరాష్ట్రం కొరకు ఆమరణ నిరాహార దీక్ష చేయడానికి కృతనిశ్చయులైనారు. తాను సంచాలకత్వం వహిస్తున్న గాంధీ స్మారక నిధికి ముందుగా రాజీనామా చేసారు. ఆ సంస్థతో తనకున్న సంబంధ వ్యవహారాలన్నిటినీ పరిష్కారం చేసారు.

తాను మహత్తరమైన లక్ష్యసాధనకు ఆమరణ ప్రాయోపవేశ దీను ప్రారంభించనున్నట్లు మిత్రులకు, మేనల్లుడు యన్. ఆర్. గుప్తకు, పెద్దలకు, ఆంధ్ర రాష్ట్ర నాయకులకు లేఖలు రాసారు. ఇందుకు మహర్షి బులుసు సాంబమూర్తి ఆధ్వర్యం వహించారు.

మద్రాసు లోని మైలాపూర్‌లో గల మహర్షి బులుసు సాంబమూర్తి గృహంలో 19.10.52 వ తేదీన పొట్టి శ్రీరాములు యీ ఆంధ్ర రాష్ట్రాన్ని తక్షణమే ఏర్పాటు చేయాలని కోరుతూ ప్రాయోపవేశ దీక్షను ప్రారంభించారు. శ్రీరాములు గారిని బలపరుస్తూ మద్రాసులో కొండితోప్, జార్జిటౌను తదితర ప్రాంతాల సభలు జరిగాయి. శ్రీయుతులు భాగవతుల లక్ష్మన్నారాయణ, ప్రొఫెసరు సోమసుందరరావు, కర్నల్ టి.యస్. శాస్త్రి తదితరులతో మహర్షి బులుసు సాంబమూర్తి గారి

ఆధ్వర్యమున ప్రాయోపవేశ కమిటీ వేయబడింది. రాష్ట్రం నలుమూలల నుండి శ్రీ రాములు గారి కోర్కెను ఆమోదించవలసిందిగా ఢిల్లీకి టెలిగ్రాంలు పంపబడ్డాయి.

రోజులు గడిచే కొలదీ శ్రీరాములు గారి ఆరోగ్యం క్షీణించసాగింది. 50వ రోజు దీక్ష కొనసాగేటప్పటికి శ్రీరాములుగారు అపస్మారక స్థితికి వెళ్లిపోయారు. అయితే ఆయన మనోధైర్యం సడల లేదు. ఆంధ్ర దేశం అట్టుడికిపోయింది. హర్తాల్, పికిటింగ్లు జరుపబడ్డాయి. శ్రీరాములు గారి ప్రాణాలను కాపాడవలసిందిగా రాష్ట్రం నలుమూలల నుండి ఆందోళనలు చెలరేగాయి. రైళ్లు నిలిపి వేయబడుతున్నాయి. ప్రభుత్వ ఆస్తులు ధ్వసం చేయబడుతున్నాయి.

ముఖ్య నాయకులు, రాజకీయ పార్టీల అధినేతలందరూ పొట్టి శ్రీరాములు గారిని దీక్ష విరమించవలసిందిగా కోరినారు. "నా ఆశయం నెరవేరేదాకా దీక్షను విరమించే ప్రసక్తి లేదు. ప్రభుత్వం స్వయంగా నా కోర్కెను మన్నిస్తూ ప్రకటన చేయాలి. మద్రాసు రాజధానిగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగాలి" అంటూ నిష్కర్షగా శ్రీరాములు ఆస్థితిలో కూడా ప్రకటన చేసారు. కానీ కేంద్ర ప్రభుత్వం దిగి రాలేదు. శ్రీరాములు గారి దీక్ష కొనసాగుతూనే వుంది. రాష్ట్రంలోని అన్ని మునిసిపాలిటీలు, రాజకీయ నాయకులు, పెద్దలందరూ శ్రీరాములు గారిని దీక్ష విరమించ వల్సిందిగా విజ్ఞప్తులు చేసారు.

"మదరాసు మినహా ఆంధ్ర రాష్ట్రం నిర్మాణం జరపడానికి సిద్ధంగా వుంది" అని ప్రభుత్వం వాగ్దానం చేసినా శ్రీరాములు అందుకు ససేమిరా అంగీకరించలేదు. మద్రాసు ఆంధ్రులది. కనుక మద్రాసు లేని నిర్మాణానికి నేనువ్యతిరేకిని, నాబలిదానం వల్ల నైనా యీ కోర్కె నెరవేరగలదని ఆశిస్తున్నాను" అంటూ శ్రీ రాములు గారు ప్రకటించారు.

అలజడులతో, ఆందోళనతో, విధ్వంస కార్యక్రమాలు ఉవ్వెత్తున జరుగుతున్నాయి.

శ్రీరాములు గారి ప్రాయోపవేశ దీక్ష 52వ రోజుకు చేరింది. 1952 డిసెంబరు 15న అర్ధరాత్రి 11-22 నిమిషాలకు శ్రీరాములుగారు యీలోకాన్ని విడిచి దివంగతులైనారు.

మొక్కవోని వజ్రసంకల్పంతో, ఏ ఆశయం కోసం దీక్ష వహించారో, అదే ఆశయసాధనకు, పొట్టి శ్రీరాములుగారు తన జీవితాన్నే బలిపెట్టారు.

మరణం అనేక విధాలుగా సంభవిస్తుంది.

కానీ తనంతటతానే మృత్యువును ఆహ్వానించి, దానికి బలి అవడం అపూర్వవిషయం.

అంతేకాదు "జాతస్యమరణం ధ్రువం" కానీ ఒక ఆశయం కోసం ప్రాణాలర్పించడం గొప్ప విషయం అవుతుంది.

పొట్టి శ్రీరాములుగారు ఆత్మాహుతి చెందాడనే వార్త దావానంలా ఆంధ్ర ప్రాంతం అంతటా వ్యాపించింది. దిక్కులు పిక్కటిల్లినట్లు ఆంధ్రులు హాహాకారాలు చేసారు. ప్రళయకాల రుద్రులయ్యారు. రైళ్లు నిలిచాయి. బస్సులు తగలబడ్డాయి. టెలిఫోన్ తీగెలు తెగిపోయాయి. ప్రభుత్వ ఆస్తులు దగ్ధమయ్యాయి. ప్రభుత్వం స్థంభించింది. పత్రికలు పతాక శీర్షికలతో వార్తలు ప్రచురించాయి.

"సుప్రీం శాక్రిఫైజ్" - అని ఉగ్గడించాయి. తెలుగులో యింతకన్న ఉదాత్తమైన పదం అందిరాలేదు. అందుకనే "మహోన్నత్యాగం (సుప్రీం శాక్రిఫైజ్) అనే ఇంగ్లీషు పదాన్నే సంపాదకీయానికి పేరు పెట్టి, శ్రీరాములు గారి త్యాగాన్ని ఉగ్గడిస్తూ రాసాయి.

యావదాంధ్రజాతి ఉద్వేగం, ఆవేశం కట్టలు త్రెంచుకున్నాయి. "పొట్టి శ్రీరాములు జిందాబాద్" అనే పదం తప్ప, ఆంధ్రలో మరేమీ వినిపించలేదు.

మహర్షి బులుసు సంబమూర్తి తదితర నాయకులు ఆత్మాహుతి ఘడియల్లో శ్రీరాములు గారి చెంతనే వున్నారు. శ్రీరాములు గారు బలిదానం తెలిసిన తోడనే ఆంధ్రప్రాంత నాయకులైన శ్రీయుతులు తెన్నేటి విశ్వనాధం, టంగుటూరి ప్రకాశం పంతులు, టి.వి.యస్. చలపతిరావు, తదితరులంతా మద్రాసు చేరుకున్నారు., శ్రీరాములుగారి మృతకాయాన్ని ఒక శకటం పై వుంచి మద్రాసు పుర వీధుల్లో ఊరేగిస్తూ, జార్జిటౌనులోని ఆయన నివాస గృహమైన అన్నాపిళ్లె వీధి, చైనాబజారు, మింట్ స్ట్రీట్ తదితర వీధుల గుండా పయనించి స్మశాన వాటికి చేర్చడం జరిగింది. మద్రాసు నగరం శోకమూర్తిలా, ఆరోజంతా విషాదం క్రమ్ముకొని వుండిపోయింది.

ఆంధ్రలోని ఉద్రిక్త వాతావరణం అర్థం చేసుకొన్న కేంద్ర ప్రభుత్వం యిక ఏ మాత్రం జాగుచేయరాదనీ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమే పరిష్కార మార్గమని గమనించింది. ప్రధాని నెహ్రూ 1952 డిసెంబరు 19న పార్లమెంటు ఉభయ సభలలో ఒక ప్రకటన చేస్తూ "మద్రాసు నగరం లేకుండా, నిర్వివాదమైన ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రాన్ని సత్వరమే ఏర్పాటు చేస్తున్నామని", ఈ సమస్య పరిష్కారానికి రాజస్థాన్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కె.యస్. వాంఛూతో ఒక కమీషన్‌ను నియమిస్తున్నామనీ ప్రకటించారు. అక్కడికి ఆంధ్ర జాతిశాంతించింది.

1953 అక్టోబర్ 1 న కర్నూలు రాజధానిగా, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు ప్రధమ ముఖ్యమంత్రిగా, నీలంసంజీవరెడ్డి ఉపముఖ్యమంత్రిగా ఆంధ్ర రాష్ట్రం అవతరించింది. ఆంధ్ర రాష్ట్రానికి ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవం చేసారు.

ఆంధ్రరాష్ట్రం నిర్మింపబడినప్పటికీ పొట్టి శ్రీరాములు గారి ఆశయం పూర్తిగా నెరవేరినట్లు కాదు. మద్రాసు నగరం ఆంధ్రులకు చెందాలన్నది ఆయన ప్రధానమైన కోరిక. ఇందుకు న్యాయమైన కారణాలు వున్నాయి. మద్రాసు నగరాన్ని నిర్మించినది ఆంధ్రులు. మదరాసు పేరే ఒక ఆంధ్రునిది. ముతరాసు చెన్నప్ప అనే తెలుగు బెస్తవాని పేరు అది. అందువలన న్యాయంగా మద్రాసు నగరం ఆంధ్రలో చేర్చాలని పొట్టిశ్రీరాములు కోరినారు. అందుకు ఆయన బలిదానం చేసారు.

అయినప్పటికీ ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం శ్రీరాములుగారి ఆత్మాహుతి ద్వారా ఏర్పడింది. ఆయన 'అమరజీవి'గా నీరాజనాలందుకుంటున్నారు. కానీ ఆచన పేరిట గుర్తు పెట్టుకోదగిన స్మారక చిహ్నం. అంధ్రప్రదేశ్‌లో యింత వరకు నిర్మించకపోవడం శోచనీయం.

కనీసం ఆయన పూర్వీకుల నివాసమైన నెల్లూరు జిల్లాకు పొట్టి శ్రీరాములు జిల్లాగా నామకరణం చేయడం సమంజసం!

తెలుగువారల కీర్తి
ధగధగల వెలయాలి
తెలుగు కళలే
దేశ దేశాల ప్రబలాలి
తెలుగు తల్లీ నీకు జోహార్
అమరజీవీ నీకు జోహార్!!

# 'భారత రత్న' శ్రీమతి ఇందిరాగాంధీ

జవహర్, కమలానెహ్రూల ఏకైక సంతానంగా, ఇందిరా ప్రియదర్శిని అలహాబాదులో 1917 నవంబరు 19న జన్మించింది.

జాతీయోద్యమం ముమ్మరంగా జరుగుతున్న రోజులవి. తండ్రి జవహర్లాల్ ఎల్లప్పుడూ జాతీయోద్యమ కార్యకలాపాల్లోనూ, జైళ్లలోనూ గడుపుతూ వుండేవాడు. అందువల్ల ఇందిరా ప్రియదర్శిని వూహ వచ్చిన దగ్గర నుంచీ అనారోగ్యంతో బాధపడుతున్న తల్లిని అంటిపెట్టుకొని వుండేది. 1926 మార్చిలో తల్లి చికిత్స కోసం తల్లి దండ్రులతో కలిసి యూరప్ వెళ్లింది. జెనీవా, బెక్సలలో పాఠశాల విద్యాభ్యాసం చేసింది.

1928లో మహాత్మగాంధీ, చరఖాసంఘ్‌కు చెందిన విద్యార్థులు శిక్షణా శిభిరం ప్రారంభమైనప్పుడు, ఇందిరా ప్రియదర్శిని దానిలో శిక్షణ పొందింది. అప్పట్లో అలహాబాద్‌లోని ఆనందభవన్ ఎల్లప్పుడూ జాతీయ నాయకులతో చర్చలలో నిండివుండేది.

జవహర్లాల్ జైలుకు వెళ్లినప్పుడు, జైలు నుండే ఇందిరా ప్రియదర్శినికి దేశదేశాల చరిత్రలు, భారత దేశ సంస్కృతి, చరిత్రపైన ఉత్తరాలు రాస్తూ వుండేవాడు. తండ్రి రాసిన వుత్తరాలను ఇందిరా శ్రద్ధగా చదువుకుంటూ, అనేక విషయాలను తెలుసుకొనేది. ఆనందభవన్‌లో తండ్రి సరసన వుంటూ, జాతీయ పోరాటం, అప్పటి దేశరాజకీయ పరిస్థితులను గురించి అవగాహన చేసుకుంటూ వుండేది.

1936లో తల్లి కమలానెహ్రూ చనిపోయింది. తండ్రి జవహర్లాల్ జైలుకు వెళ్లితే, యిక ఆనందభవనలో ఇందిరా ప్రియదర్శిని ఒంటరిగా నౌకర్లు, ఆయాల మధ్య కాలం గడుపుతూ వుండేది.

1942 మార్చి 26న ఇందిరా ప్రియదర్శినికి ఫిరోజ్‌తో వివాహం జరిగింది. ఇది ఆదర్శ వివాహం. పార్శీ యువకుడైన ఫిరోజ్‌ను ఇందిరా ప్రేమించి పెళ్లి చేసుకుంది. అభ్యుదయభావాలు గల జవహర్లాల్ కుమార్తె అభీష్టానికి ఎదురు చెప్పలేదు. ఆమె యిష్టాన్ని ఆచరణలో పెట్టాడు. యీ వివాహాన్ని మహాత్మా గాంధి దగ్గరుండి జరిపించాడు. అంతేకాదు ఫిరోజ్‌ను మహాత్మా గాంధీ దత్తత చేసుకున్నాడు. ఆ విధంగా ఫిరోజ్ అప్పటి నుండి ఫిరోజ్‌గాంధీగా పిలువబడినాడు. ఆ విధంగా ఫిరోజ్ అప్పటి నుండి గాంధీ వారసునిగా పరిగణింపబడినారు.

ఫిరోజ్ రాజకీయ వేత్త, రాజకీయ రంగంలో పరిశోధనాత్మకంగా, నిర్భయంగా వ్యవహరిస్తూ, ముక్కుకు సూటిగా వుండే రాజకీయవేత్తగా పేరు తెచ్చుకున్నాడు.

శ్రీమతి ఇందిర తండ్రితో పాటు కాంగ్రెసు సంస్థ కార్యకలాపాల్లో పాల్గొంటూ వుండేది. తన వివాహం జరిగిన సంవత్సరంలోనే 1942 అగస్టు 8న బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సభల్లో పాల్గొన్నది. ఈ సదస్సులోనే క్విట్ ఇండియా ఉద్యమం ఆమోదించబడింది. అప్పటి నుండి శ్రీమతి ఇందిర జాతీయ పోరాట కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటు వచ్చింది. 1942 - 43 మధ్య నైనిటాల్ జైలులో శ్రీమతి ఇందిర నిర్బంధింపబడింది. తొలిసారిగా శ్రీమతి ఇందిర జైలు జీవితం యిది. 1942 సెప్టెంబరు 10 నుండి 1943 మే 13 వరకు ఆమె నైనిటాల్ జైలులో గడిపింది.

తండ్రికి మల్లేనే శ్రీమతి ఇందిర పట్టుదలగలది. ధైర్యవంతురాలు. చొరవ, సాహసం ఆమెకు పుట్టుకతోనే అబ్బాయి.

రాజకీయ రంగంలో శ్రీమతి ఇందిర, ఫిరోజ్‌ల అభిప్రాయాలు భిన్నంగా వుండేవి. ఎవరి దృక్పథం వారిది. అయితే యీ భిన్నదృక్పథం వారి దాంపత్య జీవితానికి అడ్డురాలేదు. ఒకరినొకరు అర్ధం చేసుకొని హుందాగా వ్యవహరించేవారు. శ్రీమతి ఇందిర స్వేచ్ఛా, స్వతంత్రాల మధ్య పెరిగింది. ఈ విషయం ఫిరోజ్‌కు తెలుసు. అందువల్ల ఆమె రాజకీయ కార్యకలాపాలకు ఏనాడూ అడ్డుచెప్పేవాడుకాదు. ఫిరోజ్ ఇందిరా గాంధీలు యిరువురూ కూడా దేశ రాజకీయాల్లో ప్రముఖ పాత్ర వహించారు. 1944 ఆగస్టు 20న బొంబాయిలో శీమతి ఇందిర, ఫిరోజ్ గాంధి దంపతులకు రాజీవ్ జన్మించాడు. తదుపరి 1946 డిసెంబరు 14న రెండవ కుమారుడు సంజయ్ జన్మించాడు.

రాజీవ్, సంజయ్‌లను శ్రీమతి ఇందిర అల్లారు ముద్దుగా పెంచింది. పిల్లలను కట్టడికి గురిచేయకుండా, వారిలో స్వతంత్రను, సాహసాన్ని నూరిపోసేది.

1947 - 48 మధ్య స్వాతంత్ర్యం లభించిన తొలినాళ్లలో దేశంలో మతకలహాలు జరిగాయి. ఢిల్లీలో హిందూ, ముస్లిం కొట్లాటలో వేలాది మంది క్షతగాత్రులయ్యారు. మహాత్మా గాంధీజీ ఆదేశానుసారం మతసమైక్యతను పునరుద్ధరించేందుకు శ్రీమతి ఇందిర ఢిల్లీలో కృషి చేసింది. సహాయ శిబిరాల్లో క్షతగాత్రులకు సేవాకార్యక్రమాలను నిర్వహించింది.

1955 ఫిబ్రవరిలో శ్రీమతి ఇందిర కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యురాలిగా ఎన్నికైంది. ఫిరోజ్‌గాంధీ పార్లమెంటులో ప్రతిపక్ష సభ్యునిగా వుంటూ, మామగారైన ప్రధాని నెహ్రూతోనే వాగ్వివాదానికి దిగేవాడు. నెహ్రూ ప్రభుత్వాన్ని నిర్భయంగా,

మామగారైన ప్రధాని నెహ్రూతోనే వాగ్వివాదానికి దిగేవాడు. నెహ్రూ ప్రభుత్వాన్ని నిర్భయంగా, సునిశితంగా విమర్శిస్తూ వుండేవాడు. అప్పట్లో దేశంలో సంచలనం సృష్టించిన హరిదాసు ముంద్రా కుంభాకోణాన్ని బయటపెట్టింది ఫిరోజ్ గాంధీయే యీ కుంభకోణాన్ని బయటపెట్టినందుకు ఫిరోజ్ గాంధీ పలువురి ప్రశంసలకు పాత్రుడైనాడు. అయితే దురదృష్టవశాత్తూ 1960 సెప్టెంబరు 8న ఫిరోజ్ గాంధీ అకాలమరణం చెందారు.

దేశ స్వాతంత్ర్యం దగ్గర నుంచీ అనగా 1947 నుండీ జవహర్లాల్ నెహ్రూ దేశ ప్రధానిగా వుంటూ వచ్చారు. 1955 నుండి 1960 వరకు శ్రీమతి గాంధీ అఖిలభారత కాంగ్రెసు కమిటిలో చురుకైన పాత్ర నిర్వహించింది. 1958 ఫిబ్రవరి 23న జవహర్లాల్ నెహ్రూ స్థానంలో శ్రీమతి ఇందిర కేంద్ర పార్లమెంటరీ బోర్డు సభ్యురాలిగా నియమించబడింది. 1959-60 మధ్య అనగా 1959 ఫిబ్రవరి 8 నుండి 1960 జనవరి 18 వరకు భారత జాతీయ కాంగ్రెసు పార్టీ అధ్యక్షురాలిగా పనిచేశారు. కాంగ్రెసు సంస్థకు శ్రీమతి ఇందిర సాహసోపేతంగా నడిపించారు.

1964 మే 27న జవహర్లాల్ నెహ్రూ మృతి చెందాడు. అనంతరం లాల్ బహదూర్ శాస్త్రి ప్రధానిగా నూతన మంత్రివర్గం ఏర్పడింది. శ్రీమతి ఇందిర రేడియో సమాచార శాఖా మంత్రిగా శాస్త్రి ప్రభుత్వంలో పనిచేసారు. 1964 అగస్టు 20న ఉత్తరప్రదేశ్ శాసన సభనుంచి రాజ్యసభకు పోటీలేకుండా ఎన్నికైనారు. 1966 జనవరి 19న పార్లమెంటులో కాంగ్రెసు నాయకురాలిగా ఎన్నుకోబడినారు. లాల్ బహదూర్ శాస్త్రి తాష్కెంట్‌లో అకాల మరణం చెందారు. ఆ సందర్భంలో 1966 జనవరి 24న ప్రధాన మంత్రిగా శ్రీమతి ఇందిరా గాంధీ ప్రమాణ స్వీకారం చేసి బాధ్యతల్ని చేపట్టింది.

శ్రీమతి ఇందిరా గాంధిలో అజ్ఞాతంగా వుండిపోయిన రాజకీయశక్తి సామర్థ్యాలు అప్పటి నుండే ఆచరణలోకి వచ్చాయని చెప్పవచ్చును.

1967 ఎన్నికల్లో కాంగ్రెసు సిద్ధాంతాలు సరిగ్గా అమలు కాకపోవడం వల్ల, కాంగ్రెసు పార్టీలో ఏర్పడిన స్థబ్దత వల్ల ఎన్నికల్లో చాలా మంది కాంగ్రెసు అభ్యర్థులు ఓడిపోయారు. అనేక రాష్ట్రాల్లో ప్రతిపక్షప్రభుత్వాలు ఏర్పడ్డాయి. సామ్యవాద సాధనలో ఆచరణ లేకపోవడమే యీ ఓటమికి కారణమని అఖిల భారత కాంగ్రెసు కమిటీ భావించింది. అందుచేత యీ కమిటీ దశసూత్ర ప్రణాళికను రూపొందించింది. శ్రీమతి ఇందిరాగాంధీ నేతృత్వంలో దశ సూత్ర ప్రణాళికను ఆచరణలో పెట్టడం జరిగింది. బ్యాంకుల జాతీయకరణ, మాజీ సంస్థానాధీశుల భరణాల రద్దు వంటి సంచలనాత్మకమైన కార్యక్రమాలను శ్రీమతి ఇందిరా గాంధీ చేపట్టింది. నిర్ణీత కాల

పరిమితిలో సామాన్య, పేదవర్గాల ప్రజల ప్రాథమిక అవసరాల్ని నెరవేర్చేందుకు శ్రీమతి ఇందిరా గాంధీ నిశ్చయించుకొని ఆచరణలో పెట్టింది.

విప్లవాత్మకమైన బ్యాంకుల జాతీయకరణ, మాజీ సంస్థానాధిపతులు, జమీందారుల భరణాల రద్దు, సోషలిస్టు దృక్పథంలో కార్యక్రమాలను నిర్వహణ వంటి అభ్యుదయ కార్యక్రమాలను అమలు షరచడం కాంగ్రెసు సంస్థలోని అభివృద్ధి నిరోధక శక్తులకు మింగుడుపడలేదు. శ్రీమతి గాంధీ చేపట్టిన యీ కార్యక్రమాలకు అభివృద్ధి నిరోధకుల ముఠా అడుగడుగునా అడ్డుతగలడం ప్రారంభించారు.

ఫరీదాబాద్ కాంగ్రెసు సమావేశంలో యీ ఘర్షణ స్పష్టంగా బయటపడింది. అప్పటి కాంగ్రెసు అధ్యక్షులు శ్రీనిజలింగప్ప ప్రభుత్వరంగ పరిశ్రమలనూ, ఇందిరా గాంధీ విధానాలను బాహాటంగా విమర్శించాడు. ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ యీ విమర్శలను ఖాతరు చేయకుండా, సోషలిస్టు నమూనా సమాజమే కాంగ్రెసు ధ్యేయమని స్పష్టంగా ప్రకటించాడు.

బెంగుళూరు సమావేశంలో కాంగ్రెసులోని అభివృద్ధి నిరోధక ముఠా నగ్నంగా బయటపడింది. శ్రీయుతులు నిజలింగప్ప, కామరాజ్‌నాడార్, సంజీవరెడ్డి, మొరార్జి దేశాయ్, యస్.కె.పాటిల్ తదితరులంతా సిండికెట్ పేరుతో శ్రీమతి ఇందిరా గాంధి వ్యతిరేక కూటమిగా ఏర్పడినారు. బెంగుళూరు సమావేశంలో శ్రీమతి ఇందిరా గాంధి కాంగ్రెస్ ప్రజలకు చేసిన వాగ్దానాలను ఆచరణలో పెట్టవలసిన సమయం ఆసన్నమైందనీ, సమాజంలో ఏ కొద్దిమందికోగాక, అని వర్గాల ప్రజలకు, సామాన్య పేదవార్గలకు ఆర్థిక న్యాయం జరగాలనీ, అందుకు తన ప్రభుత్వం కృత నిశ్చయంలో వుందని స్పష్టంగా ప్రకటించింది. బ్యాంకుల జాతీయకరణను ప్రధాని శ్రీమతి గాంధి ప్రకటించిన వెనువెంటనే మొరార్జి దేశాయ్ మంత్రి వర్గం నుంచి దానికి వ్యతిరేకంగా రాజీనామా చేసాడు. మొరార్జీ చర్య వల్ల సిండికేట్ ముఠాకు అభ్యుదయ కార్యక్రమాలను శ్రీమతి ఇందిరా గాంధీ అమలు చేయడం యిష్టంలేదని తేలిపోయింది.

ఈ సమయంలోనే ప్రెసిడెంట్ జకీర్ హుస్సేన్ మరణించారు. నూతన అధ్యక్షుడిని ఎన్నుకోవలసి వచ్చినప్పుడు కాంగ్రెసు పార్టీలోని సిండికేట్ ముఠా, తమకు అనుకూలమైన వ్యక్తిని ప్రెసిడెంట్‌గా ఎన్నిక కావడానికి తీవ్రంగా ప్రయత్నించింది. సిండికేట్ ముఠాకు, శ్రీమతి గాంధీ వర్గానికి మధ్య వున్న అభిప్రాయభేదాలు సిద్ధాంతాలకు సంబంధించిని. సిండికేట్ ముఠా సంకుచిత భావాలతో కూడిన అభివృద్ధి నిరోధక కూటమి, కాగా శ్రీమతి గాంధీ వర్గం అభ్యుదయ భావాలతో కూడినట్టిది. ఈ వైరుధ్యం చారిత్రికంగా కాంగ్రెసు పార్టీకి సవాల్‌గా పరిణమించింది.

సిండికేట్ ముఠా ప్రెసిడెంట్‌గా శ్రీసంజీవరెడ్డిని ప్రతిపాదించింది. ప్రెసిడెంట్‌గా సంజీవరెడ్డి ఎన్నుకోబడితే, ఆతర్వాత ప్రధానమంత్రి పదవి నుండి శ్రీమతి గాంధీని తొలగించ వచ్చునని వారి ఎత్తుగడ. సిండికేట్ ముఠా కుట్రను శ్రీమతి గాంధీ గ్రహించింది. అందువేత ప్రెసిడెంట్‌గా శ్రీమతిగాంధీ వర్గం వి.వి. గిరిని బలపరిచింది. అప్పట్లో శ్రీ సంజీవ రెడ్డి కాంగ్రెసు అభ్యర్థి కాగా, ఇండిపెండెంట్ అభ్యర్థి శ్రీ వి.వి.గిరి.

కాంగ్రెసు అభ్యర్థి శ్రీ సంజీవరెడ్డి ప్రెసిడెంట్‌గా ఎన్నికైతే అభివృద్ధి నిరోధక ముఠా అయిన సిండికెట్ వర్గం ఎత్తుగడలు ఫలించి, దేశాన్ని అధోగతిపాలు చేస్తాయి. కనుక శ్రీమతి గాంధీ ఇండిపెండెంట్ అభ్యర్థిగా నిలిచిన వి.వి. గిరికి మద్దత్తు యిచ్చింది. ప్రెసిడెంట్‌గా శ్రీ వి.వి. గిరి ఎన్నికైనారు. సిండికేట్ ముఠా పరాజయం పాలైంది.

శ్రీ వి.వి. గిరికి మద్దత్తు యిచ్చి గెలిపించినందుకు సిండికెట్ ముఠా బహిరంగంగా శ్రీమతి ఇందిరాగాంధీ మీద దాడికి పూనుకున్నారు. 1969లో యీ ముఠా కాంగ్రెసు పార్టీ నుండి శ్రీమతి గాంధీని బహిష్కరిస్తున్నట్లు ప్రకటించాయి. అభివృద్ధి నిరోధక ముఠా తీసుకొన్న యీ చర్యను కాంగ్రెసులోని అధిక సంఖ్యాకులు బలపరచలేదు. అందువల్ల వెంటనే ఎ.ఐ.సి.సి. ని సమావేశపరచాల్సిందిగా అప్పటి ప్రెసిడెంట్ నిజలింగప్పను కోరగా, ఆయన అందుకు అంగీకరించలేదు. అందువల్ల శ్రీమతి ఇందిరా గాంధీ బలపరిచే కాంగ్రెసు వాదులు 1969 నవంబర్‌లో జరిగిన సమావేశంలో కాంగ్రెసు అధ్యక్షునిగా శ్రీ సుబ్రమ్మణ్యంను ఎన్నుకున్నారు. తరువాత బొంబాయి కాంగ్రెసు సమావేశంలో అధ్యక్షునిగా బాబూ జగజ్జీవన్‌రామ్‌ను ఎన్నుకున్నారు.

1971లోను మధ్యంతర ఎన్నికలు జరిగాయి. ప్రజల అభిప్రాయం తనకు, తన విధానాలకు అనుకూలమా, కాదా అని తెల్సుకోవడానికే శ్రీమతి గాంధి మధ్యంతర ఎన్నికలను జరిపించారు. ఈ ఎన్నికలలో శ్రీమతి గాంధీ నేతృత్వంలో కాంగ్రెసు పార్టీ చేపట్టిన అభ్యుదయ కార్యక్రమాలకు ప్రజల మద్దత్తు వున్నట్లు స్పష్టంగా నిరూపణ అయింది. లోక్‌సభలో మూడింట రెండు వంతులకు పైగా శ్రీమతి గాంధీ అనుకూల కాంగ్రెసు అభ్యర్థులు విజయం సాధించారు. ఎన్నికలు ముగిసిన వెంటనే నూతన లోక్‌సభలో ప్రధాని గాంధి చేత మాజీ పాలకుల రాజభరణాలు రద్దు చేయబడినవి.

జవహర్లాల్ జీవించి వుండగా కాంగ్రెసు పార్టీ నెహ్రూ నేతృత్వంలో ఏకత్రాటిపై నడిచింది. అప్పట్లో యీ అభివృద్ధి నిరోధక శక్తులు సైతం కాంగ్రెసు పార్టీలో కొనసాగుతున్నప్పటికీ నెహ్రూకు వ్యతిరేకంగా నిలబడానికి సాహసించలేకపోయారు.

నెహ్రూ యుగం గడిచిపోయింది. తదుపరి ప్రధానిగా వచ్చిన శాస్త్రి హయంలో పాకిస్తాన్ దాడి చేసింది. పాకిస్తన్‌తో జరిగిన యుద్ధం కాలంలోనే శాస్త్రి పదవీ కాలం గడిచిపోయింది. అప్పట్లో కాంగ్రెసు పార్టీ, ప్రతిపక్షాలు పార్లమెంటు అంతా పాకిస్తాన్‌ను తరిమివేయడమే లక్ష్యంగా పెట్టుకున్నాయి. తదుపరి యుద్ధం ముగిసిన వెంటనేలాల్ బహదూర్ శాస్త్రి తాష్కెంట్‌లో రష్యా ఆధ్వర్యంలో పాకిస్తాన్‌తో జరుగుతున్న సంప్రదింపుల సమయంలోనే హఠాత్తుగా మరణించారు.

దేశనాయకత్వం శ్రీమతి గాంధీ చేతికి వచ్చింది. యిక సావధానంగా కాంగ్రెసు పార్టీ లక్ష్యాలను, అభ్యుదయ కార్యక్రమాలను చేపట్టి అమలు చేయడానికి పూనుకోగానే, అప్పటిదాకా కాంగ్రెసు పార్టీలో అణగివున్న అభివృద్ధి నిరోధక ముఠా ఒక్కసారిగా తిరగబడింది. శ్రీమతి ఇందిరా గాంధీ తగినంత సమర్థురాలు కాదని అభివృద్ధి నిరోధక కూటమి ఆమెను తక్కువ అంచనా వేసుకున్నది. శ్రీమతి ఇందిఆ గాంధీ పులి పంజాను విసిరింది. ప్రజల, కాంగ్రెసు పార్టీ మద్దత్తు గల శ్రీమతి గాంధీ మనోధైర్యంతో సాహసంతో, రాజకీయ చతురతతో అభివృద్ధి నిరోధక ముఠాను తొలగించి, పార్టీని క్షాళనం చేత, కాంగ్రెసు పార్టీకి కొత్త పేరును, కొత్త స్వరూపాన్ని శ్రీమతి ఇందిరా గాంధీ సంతరించి పెట్టింది.

కాంగ్రెసు పార్టీ చరిత్రలో నూతనాధ్యాయాన్ని శ్రీమతి గాంధి ప్రారంభించింది. అభివృద్ధి నిరోధక శక్తుల్ని ఓడించి, కాంగ్రెసు పార్టీకి నూతన స్వరూపాన్ని కల్పించి శ్రీమతి ఇందిరా గాంధీ అసాధరణ వ్యక్తిత్వంగల నాయకురాలిగా రూపొందింది.

1971 డిసెంబరులో పాకిస్తాన్‌లో అంతః కలహాలు ఏర్పడి తూర్పు పాకిస్తాన్ నుండి విపరీతంగా భారత్‌లోకి శరణార్థులు చొచ్చుకొని వచ్చారు. వీరిని అరికట్టేందుకు భారత ప్రభుత్వం చేసిన ప్రయత్నాన్ని ఆసరాగా చేసుకొని పాకిస్తాన్, భారత దేశాంపైనే దాడికి పూనుకున్నది. శ్రీమతి ఇందిరాగాంధీ ఏమాత్రం తొణకకుండా పాకిస్తాన్ దాడిని త్రిప్పికొట్టింది. తూర్పు పాకిస్తాన్ రాజధాని డాకా మీదికి భారత సైన్యాలు దాడి చేయగా, పాకిస్తాన్ లొంగిపోయింది. ఇదే అదనుగా తీసుకొని తూర్పు పాకిస్తాన్‌లోని అవామీ లీగు నాయకులు ముజిబుర్ రహమాన్ స్వతంత్ర్యను ప్రకటించుకొని, స్వతంత్ర్య దేశంగా ప్రకటించుకున్నాడు. పాకిస్తాన్ విభజనతో సంబంధంలేని భారత సైన్యాలను శ్రీమతి ఇందిరాగాంధీ వెనక్కు రప్పించి, పాకిస్తాన్‌కు బుద్ధి చెప్పింది.

శ్రీమతి గాంధీ చర్యవల్ల బంగ్లాదేశ్ అవతరించడంతో ప్రపంచ దేశాలు శ్రీమతి గాంధీ సాహసోపేత వ్యక్తిత్వాన్ని ఆశ్చర్యంతో అర్థంచేసుకున్నాయి. శ్రీమతి గాంధీ ప్రతిష్ట దేశంలోనూ, ప్రపంచంలోనూ యినుమడించింది.

1971లో సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. శ్రీమతి గాంధీ నేతృత్వం లోని కాంగ్రెసు పార్టీగెలిచింది. శ్రీమతి ఇందిరా గాంధీ తిరిగి ప్రధానమంత్రిగా ఎన్నుకోబడింది. తదుపరి వరుసగా జరిగిన వివిధ రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలలోనూ సైతం శ్రీమతి ఇందిరా గాంధీ కైవసం అయ్యాయి. అభివృద్ధి నిరోధకుల పాతకాంగ్రెసు పేరుతో వున్న పార్టీ పరాజయం పాలైంది.

ఇంతటితో యీ అభివృద్ధి నిరోధక శక్తులు వెనకడుగు వేయకుండా, ఎలాగైనా శ్రీమతి గాంధీ ప్రభుత్వాన్ని యిరుకున పెట్టి, దించి వేయాలనే పథకాన్ని రూపొందించాయి. వీరికి తోడు భూస్వామ్య, ప్రతీపశక్తులు కూడా కలిసాయి. ప్రజాసామ్య పరిరక్షణ పేరుతో యీ శక్తులు కొత్త రకం ఉద్యమాన్ని మొదలెట్టాయి. మొట్టమొదట యీ ఉద్యమం మొరార్జి దేశాయ్ స్వంత రాష్ట్రమైన గుజరాత్‌లో 1974లో నవసంఘర్ష సమితి పేరిట మొదలైంది. ఈ సమితి చేపట్టే కార్యక్రమాలన్నీ చట్టవ్యతిరేకమైనవే, చట్టబద్ధంగా ఎన్నికైన ప్రజాప్రభుత్వాలను కూలద్రోసి, దేశంలో అస్థిరత సృష్టించడానికి పూనుకున్నాయి. చట్టబద్ధంగా గెలిచిన అభ్యర్థులను ఘెరావ్ చేయడం, దౌర్జన్యంగా వారిచేత రాజీనామాల్ని యిప్పించడం, రైళ్లు బస్సులు తగలబెట్టడం, అరాజక పరిస్థితుల్ని కల్పించడమే పనిగా పెట్టుకొన్నాయి. ప్రభుత్వం యీ దుష్టశక్తుల్ని ఏరివేసే కార్యక్రమాన్ని చేపట్టింది. అయినా మరింతగా విజృంభించి పారిశ్రామిక కూలీలను, పోలీసులను, సైనికులను ప్రభుత్వాదేశాలను పాటించవద్దనీ, ప్రభుత్వానికి ఎదురు తిరగవలసిందిగా ప్రోత్సహించాయి. కోట్లాది రూపాయల ప్రభుత్వ ఆస్తులు దగ్ధం చేయబడినవి. బీహార్‌లో కూడా యిదే తరహా ఉద్యమం, అల్లర్లు బయలుదేరాయి. అక్కడి ఉద్యమానికి జయప్రకాశ్ నారాయణ్ ఆశీస్సులువున్నాయి. పూర్వ సోషలిస్టులు, పాత కాంగ్రెసు ముఠా భూస్వామ్య శక్తులు, అభివృద్ధి నిరోధకులు, జనసంఘ్ వంటి ప్రతిపక్షపార్టీలతో సహా యిదే అదనుగా భావించి, శ్రీమతి ఇందిరాగాంధీ వ్యతిరేకవుద్యమంగా తయారై అరాజక వాతావరనాన్ని కల్పించడం జరిగింది. దీనికి జయప్రకాశ్ ఆధ్వర్యం వహించారు. సంపూర్ణవిప్లవం పేరుతో దేశం అంతటా అస్థిర పరిస్థితుల్ని కల్పించబడ్డాయి.

ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లో శ్రీమతి ఇందిరా గాంధీ సూచన మేరకు 1975 జూన్ 25వ తేదీన భారత రిపబ్లిక్ దేశంలో అత్యవసర పరిస్థితిని ప్రకటించారు. దేశంలో అత్యవసర పరిస్థితిని ప్రకటించడానికి గల కారణాలను శ్రీమతి గాంధి రేడియో ద్వారా ప్రజలకు వివరించారు. "ప్రజాస్వామ్య పరిరక్షణ పేరుతో ప్రతీ శక్తులు దేశంలో అరాజకపరిస్థితుల్ని సృష్టించాయి. చట్టబద్దంగా ఎన్నికైన ప్రభుత్వ

కార్యకలాపాలను స్తంభింపజేస్తూ, అల్లర్లు, ప్రభుత్వా ఆస్తులను దగ్ధం చేయడం జరుగుతుంది. పోలీసులను, సైన్యాన్ని ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొట్టడం వంటి విద్రోహ కార్యకలాపాలను చేయడం వల్ల దేశంలో అస్థిర పరిస్థితి నెలకొన్నది. కనుక దేశంలో శాంతి భద్రతలను కాపాడేందుకు అత్యవసర పరిస్థితి విధించవలసివచ్చింది." తదుపరి ఉద్యమకారులను, ఆరాజకశక్తులను అరెస్టుచేయడం జరిగింది. జయప్రకాశ్ నారాయణ్‌తో సహా ఉద్యమనాయకులందరూ జైళ్ల పాలయ్యారు.

అత్యవసర పరిస్థితి కాంలో దేశం కుదుటబడింది. నేరాల సంఖ్య తగ్గిపోయింది. శాంతి భద్రతలు పునరుద్ధరింపబడ్డాయి. ఉత్పత్తి, పంపిణీ సజావుగా సాగింది. దేశ పరిస్థితులు మెరుగైనాయి. ఆచార్య వినోభాబావే యీ కాలాన్ని "అనుశాసన పర్వంగా" క్రమశిక్షణ కాలంగా అభివర్ణించాడు.

1977 లోక్ సభ ఎన్నికలకు ముందు దేశంలో అత్యవసర పరిస్థితి తొలగించబడింది. రాజకీయ నాయకులందరూ జైళ్ల నుంచి విడుదల చేయబడినారు. ఎన్నికలు ప్రకటించబడ్డాయి. జయప్రకాశ్ నారాయణ్ ఆధ్వర్యంలో కమ్యూనిస్టులు మినహా, జనసంఘం పాత కాంగ్రెసు మొతా, పూర్వసోషలిస్టులంతా కలిసి 'జనతా పార్టీ' పేరిట కొత్త పార్టీ ఏర్పాటు చేయబడింది. ఎన్నికలలో జనతాపార్టీతో కమ్యూనిస్టులు, మార్క్సిస్టులు కూడా చేతులు కలిపారు. ఎన్నికలలో శ్రీమతి ఇందిరా గాంధీ నేతృత్వంలో కాంగ్రెసు పార్టీ పరాజయం పాలైంది. కేంద్రంలో జనతాపార్టీ ఆధ్వర్యంలో ప్రభుత్వం ఏర్పడింది. మొరార్జీ దేశాయి ప్రధానిగా ఎన్నికైనాడు. అయితే 1978 జనవరి 1, 2 తేదీలలో శ్రీమతి గాంధీ అధ్యక్షురాలిగా 'ఇందిరా కాంగ్రెసు' ఏర్పాటు చేయబడింది. కాంగ్రెసు పార్టీ నూతన జవసత్వాలు లభించాయి. ఈ కారణంగా 1978 ఫిబ్రవరిలో జరిగిన కార్ణాటక, ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ ఎన్నికలలో ఇందిరా కాంగ్రెసు అఖండ విజయాన్ని పొందింది. దేశంలో మతప్రసక్తిలేని పరిపాలన, సామ్యవాదాన్ని, సాంఘిక సమైక్య న్యాయాన్ని నెలకొల్పగల పార్టీ ఇందిరా కాంగ్రెసు అని ప్రజలు ఆలస్యంగానైనా గుర్తించారు.

1977లో కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పడింది. ఇందిరాగాంధీ ప్రతిపక్షనాయకురాలిగా వుండవలసి వచ్చింది. జనాతా ప్రభుత్వం కక్షసాధింపు చర్యలతో శ్రీమతి ఇందిరా గాంధీపై క్రిమినల్ చర్యలు తీసుకొని, అరెస్టు చేసింది. కానీ ఇందిరా గాంధీ జనతా ప్రభుత్వం విపరీత చర్యలకు భయపడలేదు. ధైర్యంతో, ఆత్మ విశ్వాసంతో తనపై వచ్చిన ఆరోపణలనన్నింటినీ ఎదుర్కొంది. దేశం

కోసం సరస్వాన్ని ఒడ్డి, స్వాతంత్ర్యపోరాటంలో ఎనలేని త్యాగాలు చేసిన కుటుంబంలో పుట్టి పెరిగి తన జీవితం అంతా సాంఘిక, రాజకీయ రంగంలో గడిపి దేశపురోభివృద్ధికి సామాన్యపేద ప్రజల అభ్యున్నతికి కృషి చేసిన శ్రీమతి ఇందిరాగాంధి దేశ ప్రజలపైన అకుంఠిత విశ్వాసాన్ని అట్టి పెట్టుకొన్నది.

జనతా ప్రభుత్వంలో ఏడాదిన్నరకే అంతః కలహాలు ఏర్పడ్డాయి. మొరార్జీ ప్రభుత్వంలో చీలికలు ఏర్పడ్డాయి. చరణ్‌సింగు స్వంతబలంతో మొరార్జీదేశాయ్‌ను క్రిందికి దించి, తానే ప్రధాని కావాలని ప్రయత్నాలు ప్రారంభించాడు. సరిగ్గా యీ సమయాన్ని, జనతా ప్రభుత్వంలోని చీలికల్ని శ్రీమతి ఇందిరా గాంధీ తెలివిగా వుపయోగించుకొన్నది. చాణక్యనీతికి ప్రతిబింబంగా శ్రీమతి గాంధి చతురతతో చరణ్‌సింగును బలపరిచి, జనతా ప్రబుత్వం కూలిపోయేందుకు సహకరించింది. చరణ్‌సింగు ప్రధానిగా పోటీ జనతా ప్రభుత్వం ఏర్పడింది. శ్రీమతి గాంధీ మద్దత్తుతో చరణ్‌సింగు ప్రధానిగా వున్నాడు. ఆరునెలలలోపు పార్లమెంటులో తన బలాన్ని నిరూపించుకోవాలనే షరతుమీద రాష్ట్రపతి చరణ్‌సింగుకు అదికారాన్ని అప్పగించాడు. ఆరునెలలు గడిచి పార్లమెంటులో చరణ్‌సింగు బలాన్ని నిరూపించుకోవాల్సిన సమయంరాగానే, శ్రీమతి గాంధీని తన మద్దత్తును చరణ్‌సింగ్‌కు ఉపసంహరించుకొన్నది. దానితో చరణ్‌సింగు ప్రదాని పదవికి రాజీనామా యివ్వక తప్పలేదు. ఈ విధంగా రెండు సంవత్సరాల వ్యవధిలోనే తనకు పోటీగా వచ్చిన జనతా ప్రభుత్వం, జనతాపార్టీతోసహా కుప్పకూలిపోవటానికి శ్రీమతి గాంధి యుక్తియుక్తంగా తన రాజకీయ చతురతను ఉపయోగించింది.

1980లో తిరిగి మధ్యంతర ఎన్నికలు వచ్చాయి. ఈ ఎన్నికలలో ప్రజలు కాంగ్రెసు (ఐ)ని అత్యధిక మెజారిటీతో గెలిపించారు. తిరిగి శ్రీమతి గాంధీ ప్రధాని అయింది. అస్తవ్యస్థమైన దేశ ఆర్ధిక స్థితిని చక్కదిద్దింది. పేదప్రజలకు ఉచిత గృహవసతిని కల్పించింది. బ్యాంకు రుణాలను అందజేసి సన్నకారు రైతులను ఆదుకొన్నది. ఎరువులను సబ్సిడీ ధరలకు అందించింది. ప్రజాహిత కార్యక్రమాల వెన్నిటినో ప్రవేశ పెట్టింది. "గరీబీహటావో" నినాదంతో పేదరికంపై యుద్ధాన్ని ప్రకటించింది.

అన్నింటికీ మించి, శ్రీమతి ఇందిరా గాంధీ ప్రవేశ పెట్టిన 20 సూత్రాల కార్యక్రమం పేదప్రజలకు కొంగు బంగారంగా వుపయోగపడింది. దేశంలో దారిద్ర్యనిర్మూలనకు, పేదప్రజల అభ్యున్నతికి ఇందిరాగాంధీ రూపొందించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం గ్రామాలలో అమలు జరగడానికి కాంగ్రెసు సంఘాలు,

కార్యకర్తలు శ్రీమతి గాంధి కర్తవ్యాన్ముఖులను గ్రాహించారు. బడుగు వర్గాల ప్రజసంక్షేమానికి శ్రీమతి గాంధి ఎంతగానో పాటు పడింది.

"అమ్మ ఇందిర" అని పేదప్రజలు "మాఅమ్మ" వచ్చిందంటూ శ్రీమతి గాంధి సభలకు పేద ప్రజలు తండోపతండాలుగా వచ్చేవారు. పేదప్రజలను యింతగా ప్రభావితం చేసిన రాజకీయనాయకులలో ఇందిర తప్ప మరెవ్వరూ కానరారు.

1984 మార్చి నెలలో శ్రీమతి గాంధీ ఢిల్లీలో అలీన దేశాల మహాసభలను నిర్వహించింది. పండిట్‌నెహ్రూ వర్ధమాన దేశాల కూటమిని బోలిన సమావేశంలాంటిదే యిది. ఆనాటికీ, యీనాటికీ కూడా ప్రపంచ దేశాలలో బడుగు దేశాలకు నాయకత్వం వహించి, నడపగలిగేది భారతదేశమేనని చిన్నచిన్న దేశాలు ఆశిస్తూ వుంటాయి.

ఢిల్లీలో జరిగిన అలీన దేశాల మహాసభల్లో 104 దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు. అలీన దేశాల కూటమికి శ్రీమతి గాంధీ అధ్యక్షురాలిగా ఎన్నుకోబడినారు. 104 దశాల కూటమికి అధ్యక్షురాలిగా ఎన్నికకావడం అపూర్వమైన విషయంగా భావించబడింది. ప్రపంచ దేశాల్లో శ్రీమతి గాంధి ప్రతిష్ట ఇనుమడించింది.

ఎప్పుడూ జటిలంగా వుండే కాశ్మీరు సమస్యను కూడా తన హయంలో శ్రీమతి గాంధీ అలజడులు లేకుండానే పరిష్కరించింది. ఫరూక్ అబ్దుల్లాను బర్తరప్ చేసి, అబ్దుల్లా బావ 'షా'ను ముఖ్యమంత్రిగా చేసింది. 1984 అగస్టు 16న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ యన్.టి.రామారావును బర్తరఫ్ చేసి, ప్రజాందోళన అనంతరం సెప్టెంబరు 16న తిరిగి ఆయనకు అధికారాన్ని అప్పగించింది.

పంజాబ్ సమస్య శ్రీమతి గాంధీ రాజకీయ జీవితంపైనా, వ్యక్తిగత జీవితంపైనా కూడా కారుమేఘాలను కప్పింది. దేశసమైక్యత, సమగ్రతల పరిరక్షణ సందర్భంలో శ్రీమతి గాంధీ దేశక్షేమం కోసం పంజాబు సమస్యను సాహసోపేతంగా ఎదుర్కొన్నది. ఆనందపూర్ సాహిబ్ తీర్మానాన్ని అమలు చేయాలని, చండీఘర్‌ను పంజాబుకు అప్పగించాలనీ పంజాబ్‌కు స్వయం ప్రతిపత్తి యివ్వాలని పంజాబీ నాయకులు సంత్ భింద్రన్‌వాలే నాయకత్వంలో హింసాత్మకమైన ఉద్యమాన్ని మొదలెట్టారు. అమృతసర్‌లోని స్వర్ణదేవాలయాన్ని వాసంగా చేసుకని, దేవాలయంలో ఆయుధాలను చేరవేసి, ఆయుధ కర్మాగారంగా నిలయంగా స్వర్ణాలయాన్ని మార్చి ఖలిస్తాన్ పేరిట పంజాబ్‌ను స్వతంత్ర దేశంగా ప్రకటించి, టెర్రరిస్టు కార్యక్రమాలకు బింద్రన్ వాలే వర్గం చేపట్టింది. రాష్ట్ర వ్యాపితంగా హత్యలు, లూటీలు, దోపిడీలకు పాల్పడింది. ప్రభుత్వ ఆస్తులను తగలబెట్టడం, అధికారుల్ని హత్యచేయడం, సాటి రాజకీయ

నాయకులను హతమార్చే హత్యాకాండను కొనసాగించింది. పంజాబ్ రాష్ట్రం అల్లకల్లోలమైంది. శాంతి భద్రతలు క్షీణించాయి. సామాన్య పౌరులకు భద్రత లేకుండా పోయింది.

ఇట్టి పరిస్థితుల్లో శ్రీమతి గాంధీ స్వర్ణదేవాలయంపై సైనిక దళాల చేత మెరుపు దాడులను జరిపించి, టెర్రరిస్టులను అరెస్టుచేసింది. టెర్రరిస్టులపై జరిపిన కాల్పుల్లో సంత్‌భింద్రన్‌వాలే చనిపోయాడు. దాదాపు ఈ దాడిలో ఎందరో పేరు మోసిన టెర్రరిస్టులు హతమయ్యారు. స్వర్ణాలయాన్ని దుండగుల చేతుల్లోంచి కాపాడి శ్రీమతి గాంధీ అకల్‌తక్త్ పూజారులకు అప్పగించింది. పంజాబ్‌లో అల్లర్లు సద్దుమణిగాయి.

కానీ టెర్రరిస్టులు, బింద్రన్ వాలే అనుచరులు శ్రీమతి గాంధీపైన కక్షకట్టారు. సిక్కుల బంగారు దేవాలయల మీద దాడి జరిపినందుకు శ్రీమతి గాంధీ మీద ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నారు. శ్రీమతి గాంధీ అంగరక్షకులలోని సిక్కులే 1984 అక్టోబరు 31న ఆమె నివాస గృహంలోనే తుపాకులచే కాల్చి చంపారు.

విజయేందిర నేలకొరిగింది.

ఖలిస్తాన్ దుండగుల తుపాకులకు బలి అయింది. దేశ సమైక్యతను పరిరక్షించేందుకు శ్రీమతి గాంధీ తన ప్రాణాలనే బలి పెట్టింది. జాతినేత మహాత్మాగాంధీ దేశంలో మత సామరస్యానికి తన జీవితాన్ని బలిపెట్టగా, శ్రీమతి ఇందిర దేశ సమైక్యత కొరకు, తన ప్రాణాలను అంకితం చేసింది.

దేశాన్ని నడిపే నాయకురాలు, దేశం ప్రమాదంలో పడినప్పుడు, దేశ రక్షణకు ముందు తానే బలి అయింది. తన హయాంలో శ్రీమతి గాంధీ సాహసోపేతమైన కార్యక్రమాల నెన్నింటినో చేపట్టింది.

కాంగ్రెసు పార్టీలో వున్న అభివృద్ధినిరోధక ముఠాను ఓడించి, సంస్థ నుంచి బయటకు పంపి, దేశ అభివృద్ధి కార్యక్రమాలను అమలు చేయడానికి దృఢమైన నిర్ణయాలను తీసుకొన్నది. బంగ్లాదేశ్ ఆవిర్భావానికి సహాయపడింది. సిండికేట్ ముఠాకు పుట్టగతులు లేకుండా చేసింది. తన చేపట్ట దలచుకున్న కార్యక్రమం ఎంత జటిలమైనదైనప్పటికీ, వెనకడుగు వేసేదికాదు.

తన హత్య జరగడానికి కొద్దిరోజుల ముందు భువనేశ్వర్ పర్యటనలో ఒక సభలో మాట్లాడుతూ "చావుకు నేను భయపడను. దేశాన్ని రక్షించే కృషిలో నా చివరి రక్తపు బొట్టునుకూడా ధారపోస్తాను" అని శ్రీమతి గాంధీ ప్రతిజ్ఞ చేసింది. ఖలిస్తాన్ పేరిట దేశ విభజనకు దారితీసే దుశ్చర్యలను ఎదుర్కొని, టెర్రరిస్టులను ఏరి వేసింది. దేశ సమగ్రతలను రక్షించే కృషిలోనే తాను తనువును బలిపెట్టింది.

ప్రపంచ రాజకీయ చరిత్రలోనే, సాహసవంతమైన రాజకీయ నాయకురాలిగా శ్రీమతి ఇందిర కొనియాడబడింది.

"ఇందిరే ఇండియా, ఇండియాయే ఇందిర" అంటూ శ్రీమతి ఇందిర కీర్తించబడింది.

"అమ్మ ఇందిర" అంటూ పేద ప్రజలచే ఆప్యాయంగా పిలువబడింది. "విజయేందిర"గా దేశ చరిత్రలో ప్రతిష్ట సంపాదించుకున్నది. తుదకు ధారుణంగా హత్య చేయబడింది.

శ్రీమతి ఇందిర రాజకీయ జీవితమే దేశ చరిత్రలో సముజ్జ్వలఘట్టంగా చరిత్రకారులు లిఖిస్తారు. తన రాజకీయ జీవితమంతా పోరాటాలతోనే, క్లిష్టపూరితంగా గడిపింది. అడుగడుగునా ప్రత్యర్థుల సవాళ్లను ఎదుర్కొన్నది. పరాజయం అంచులమీదనే విజయసోపానాలను నిర్మించుకొన్నది. తిరిగి ఆ విజయసౌధమే కూలిపోయి, శిధిలాలమధ్య శ్రీమతి ఇందిరను తనలో దాచుకొంది.

# నెహ్రూ వంశీకులు

నెహ్రూ కుటుంబీకులు కాశ్మీరు పండిత బ్రాహ్మణ కుటుంబానికి చెందినవారు. మోతీలాల్ నెహ్రూ ప్లీడరు పట్టా పొంది జన్మస్థలమైన కాశ్మీరు వదిలి అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా స్థిరపడినారు. అలహాబాద్ నగరంలో ఆనందభవన్ పేరిట చక్కని వసతి గృహాన్ని నిర్మించుకున్నాడు. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో జాతీయ కాంగ్రెసు నాయకులకు ఈ ఆనందభవనమే విడిది గృహంగానూ, చర్చావేదికగానూ ఉండేది.

మోతీలాల్ నెహ్రూ భార్య స్వరూపరాణి! వీరికి యిరువురు కుమార్తెలు, ఒక కుమారుడు జన్మించారు.

ఆనాటి అలహాబాద్ హైకోర్టులో ప్రసిద్ధి చెందిన లాయర్‌గామోతీలాల్ బాగా ధనార్జన చేసి, సంపన్నులలో ఒకరిగా పేరుగాంచినాడు.

తన ఏకైక కుమారుడు జవహర్లాల్‌ను అతిగారాబంగా పెంచడమే గాక లండన్‌లో చదివించాడు. లండన్‌లో నెహ్రూ విద్యార్థి ధశ అట్టహాసంగా గడిచింది.

జవహర్లాల్ నెహ్రూ సోదరీ మణులలో అగ్రసోదరి విజయలక్ష్మి, చిన్నక్క కృష్ణ.

జవహర్లాల్ నెహ్రూకు యుక్త వయస్సు రాగానే కమలతో వివాహం జరిగింది. వీరికి ఏకైక కుమార్తెగా ఇందిరా ప్రియదర్శిని జన్మించారు.

ఆనాడు అలహాబాద్‌లోని ఆనందభవనం గాంధీజీ, తిలక్, ఆజాద్, పటేల్ వంటి అగ్ర నాయకులతో స్వాతంత్ర్య పోరాట కార్యక్రమాలతో కిటకిటలాడుతూ ఉండేది.

శ్రీ మోతీలాల్ నెహ్రూ అఖిలభారత కాగ్రెసు అధ్యక్షులుగా ఉండి పదవీ విరమణ చేసిన రోజున, తండ్రి నుండి కాంగ్రెసు అధ్యక్షులుగా నెహ్రూ పదవిని స్వీకరించారు.

1917 నవంబర్ 19న ఇందిరా ప్రయదర్శిని జన్మించింది. చిన్ననాటినుండి ఇందిర చురుకుగా ఉండేది. తల్లి కమలా నెహ్రూ 1936 ఫిబ్రవరి 23న అకాల మరణం చేసింది. తండ్రి నెహ్రూ ఎల్లప్పుడూ అరెస్టు అయి, జైలులో వుండేవారు. తన చిన్నవయస్సులోనే తల్లి మరణం ఇందిరను కలచివేసింది.

# ధృవతార – శ్రీ రాజీవ్ గాంధీ

నెహ్రూ కుటుంబం దేశానికి ముగ్గురు ప్రధాన మంత్రుల్ని అందించింది. వీరే తాత, కుమార్తె, మనుమడుగా మూడు తరాలు భారత దేశ రాజకీయ రంగాన్ని సుసంపన్నంచేసారు. తమ సౌభాగ్యాన్ని, మేధస్సుని, వ్యక్తిత్వాన్నీ దేశం కోసం, ప్రజల కోసం యీ ప్రధాన మంత్రి త్రయం ధారపోసారు. ఒక్క రాజరిక వ్యవస్థలో తప్ప, ప్రజాస్వామిక రాజ్యాలలో ఇలాంటి సంఘటన బహు అరుదుగా మాత్రమే సంభవిస్తుంది.

1984 అక్టోబరు 31 న పంజాబ్ ఉగ్రవాదులు శ్రీమతి గాంధీని ఆమె స్వగృహంలోనే దారుణంగా హత్య గావించారు. శ్రీ రాజీవ్‌గాంధీ అంతకు రెండురోజులు ముందు అస్సాంలోని దిఘూకు సమీపంలో రామ్‌నగర్ పర్యటనకు వెళ్ళాడు రామ్‌నగర్ బహిరంగ సభలో ప్రసంగిస్తున్న రాజీవ్‌కు ఇందిరా గాంధీ హత్యా వార్త అందజేయబడింది. తల్లి మరణ వార్త విన్నతంతనే రాజీవ్ హుటాహుటిని ఢిల్లీ చేరుకున్నారు. విమానం దిగగానే రాజీవ్ సరాసరి శ్రీమతి గాంధీని చేర్చిన ఇండియన్ సైన్సెస్ ఆసుపత్రికి చేరుకున్నారు. మరి కొంతసేపటికి ఆంధ్రప్రదేశ్ పర్యటనలో వున్న రాష్ట్రపతి జైల్‌సింగ్, స్పీకర్ బలరాంజక్కర్, పి.వి. నరసింహారావు తదితరులంతా ఆసుపత్రికి చేరుకున్నారు.

ఆసుపత్రిలోనే నాయకులందరూ సమావేశమై శ్రీమతి గాంధీ స్థానంలో శ్రీ రాజీవ్‌ను ప్రధానిగా ఎన్నుకున్నట్టు ఒక లేఖను తయారు చేసి శ్రీయుతులు పి.వి. ప్రణబ్ ముఖర్జీ తదితరులు రాష్ట్రపతి జైల్‌సింగ్‌కు అందజేసారు. ప్రధానిగా శ్రీ రాజీవ్‌ను నియమిస్తూ రాష్ట్రపతి జైల్ సింగ్ ఉత్తర్వులను జారీచేసారు. వెంటనే రాజీవ్ తనమంత్రి వర్గంలోకి శ్రీయుతులు పి.వి. నరసింహారావు. ప్రణబ్ ముఖర్జీ, శివశంకర్, బూటాసింగ్‌లను చేర్చుకున్నారు.

1984 నవంబర్ 2వ తేదీన పార్లమెంటరీ పార్టీ నాయకునిగా శ్రీ రాజీవ్ ఎన్నికైనారు. 1984 నవంబర్ 12వ తేదీన అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా కూడా శ్రీ రాజీవ్ ఎన్నుకోబడినారు.

ఇందిరాగాంధీ మరణానంతరం తిరిగి ప్రజాభిమానాన్ని పొందేందుకు శ్రీ రాజీవ్‌గాంధీ 1984 నవంబర్ 27వ తేదీన పార్లమెంటుకు ఎన్నికలు జరిపించినాడు. ఈ ఎన్నిలలో కాంగ్రెసు పార్టీ 415 సీట్లుపైగా స్థానాలను సంపాదించి అఖండ

విజయం సాధించింది. 1985 మార్చి నెలలో జరిగిన పదకొండు రాష్ట్రాలలో (ఆంధ్రప్రదేశ్, కర్ణాటక మినహా) కాంగ్రెసు పార్టీ అఖండ విజయాన్ని పొందింది. తిరిగి శ్రీ రాజీవ్ ప్రధాన మంత్రి అయినాడు.

1944 అగస్టు 20న బొంబాయిలోని షిరోడ్కర్ నర్సింగ్ హమ్‌లో శ్రీ రాజీవ్ జన్మించాడు. రాజీవ్ రత్న అని నామకరణం చేసారు. రాజీవ్ అనగా తామర పువ్వు, ఇందిరా గాంధి తల్లి పేరు కూడా కమల రత్న అనగా జవహర్ అనే అర్థం కలిసివస్తుంది. ఈ విధంగా తన తల్లి దండ్రుల పేర్లు కలిసి వచ్చేట్టుగా, తన కుమారునికి ఇందిర నామకరణం చేసి ఆనందించింది. రాజీవ్ జన్మించిన రెండు సంవత్సరాల తరువాత 1946 డిసెంబర్ 14న సంజయ్ గాంధీ జన్మించాడు.

తల్లి ఇందిర నీడలో, తాతగారింట్లో ఎక్కువగా రాజీవ్ పెరిగాడు తల్లిని ఎప్పుడూ అంటిపెట్టుకొని వుండేవాడు జర్మనీలో పుట్టిపెరిగిన ఎలిజబెత్ టీచరుగా రాజీవ్ ప్రాథమిక విద్యను నేర్పింది. రాజీవ్‌కు దాదిగా పనిచేసిన లియో అన్నా చాలా కఠినమైన క్రమశిక్షణతో పెంచింది. చన్నీటిలో స్నానం చేయించడం ఎండలో నిలబెట్టి వ్యాయామం చేయించేది. రాజీవ్ సిగ్గుతో ఎక్కువగా ఎవరితోనూ మాట్లాడే వాడుకాడు. చిత్రలేఖనంలో కూడా ఆసక్తి వుండేది. విమానం బొమ్మలు చక్కగా చిత్రించేవాడు. ఆతర్వాత డెహరాడూన్ వెల్‌హామ్ స్కూల్లో చేరాడు. బడిలోమంచి విద్యార్థిగా పేరు తెచ్చుకున్నాడు.

రాజీవ్ చిన్న వయసులోనే విద్యార్థి దశలో నాటకాల్లో చిన్నచిన్న స్త్రీపాత్రలు ధరించేవాడు. ఒక నాటకంలో పెళ్ళికూతురు వేషం లభించింది. ఆ నాటికలో రాజీవ్ పాత్రధారి "బారత్ ఒకనాటి ఉద్యానవనం" అని పదేపదే ఉచ్ఛరించవలసి వుంటుంది. నాటిక పేరే 'భాగత్ ఒకనాటి ఉద్యానవనం" రాజీవ్ పెద్దయ్యాక, తాను ప్రధాని మంత్రి అయినప్పుడు 'భారత్ మేరే మహన్' అని చెప్పేవాడు.

రాజీవ్‌లో తన తాత జవహర్లాల్ నెహ్రూ పోలికలు ఎక్కువ. డూన్ స్కూల్లో విద్యాభ్యాసం ముగిసాక, రాజీవ్ ఇంగ్లడు వెళ్ళి అక్కడ ట్రినిటీ కాలేజీలో మెకానికల్ ఇంజనీరింగ్ కోర్సులో చేరాడు. అక్కడ వుండగనే వేసవిలో ఇటాలియన్ యువతి సోనియా మైనాతో స్నేహం కలిసింది. సెలవుల్లో శ్రీ రాజీవ్ గ్లైయిటింగ్ నేర్చుకున్నాడు. విమానం నడిపే పైలట్ వృత్తిలో స్థిరపడాలని రాజీవ్ సంకల్పం. చివరికి అదే వృత్తి స్వీకరించాడు. ఆవ్రో 748 కెప్టెన్‌గా తరువాత హెూయింగ్ పైలెట్‌గా రాజీవ్ వృత్తి బాధ్యతలు నిర్వహించాడు నీలం రంగు పాంటు, తెల్లని షర్టు, నల్లని సాక్సులు బూట్లు, టోపీ యూనిఫారం చక్కగా వేసుకుని అందంగా కనిపించేవాడు. విమానం నడపడం

ప్రమాదమని, ఉద్యోగం మానెయ్యమని తల్లి ఇందిరాగాంధీ చెబితే, విమానం నడపడం తేలిక, కారునడపడం కష్టం అని వాదించి తల్లిని ఒప్పించాడు.

1968 జనవరిలో తల్లి శ్రీమతి గాంధీ ఆశీస్సులతో రాజీవ్, సోనియాల వివాహం జరిగింది. నిరాడంబరమైన జీవితానికి రాజీవ్ మొదటి నుంచీ అలవాటు పడ్డాడు స్వయంశక్తితో జీవితాన్ని గడపాలని భావించేవాడు. విద్యార్థి దశలో స్కూలులో చదివే రోజుల్లో రాజీవ్ బేకరి స్టోర్సులో పనిచేసేవాడనీ, ట్రక్కులతో రాళ్ళు ఎత్తి స్వీయార్జన చేసి, ఆ డబ్బుతో పుస్తకాలు కొనుక్కొనే వాడనీ చెబుతూ వుంటారు.

శ్రీమతి సోనియా ఇటలీలో సంపన్న కుటుంబంలో పుట్టింది. రాజీవ్ వివాహం జరిగాక, అత్తగారైన శ్రీమతి ఇందిరాగాంధీ కనుసన్నలలో సోనియా మెలిగింది. భారతీయ వస్త్ర ధారణ చేసేది. తాను గృహస్థురాలిగా వుండడానికే యిష్ట పడతానని సోనియా అంటూ వుండేది.

రాజీవ్, సోనియా దంపతులకు ప్రియాంక అను కుమార్తె రాహుల్ అనే కుమారుడు సంతానం. సోనియా స్వయంగా వంట చేసి భర్త రాజీవ్‌కు యిద్దరు పిల్లలకు వడ్డించి తృప్తి పడేది. భారతీయ సాంప్రదాయాలకు అనుకూలంగా నడుచుకొనేది. ఇండియన్ ఎయిర్‌లైన్స్‌లో ట్రెయినీ పైలెట్‌గా రాజీవ్ చాలా కాలం ఉద్యోగం చేసాడు.

శ్రీమతి గాంధీ దేశ ప్రధానిగా కీర్తి ప్రతిష్టలనార్జించింది. ప్రతిపక్షాలు సృష్టించిన అరాజక పరిస్థితుల వల్ల దేశంలో ఎమర్జన్సీని విధించవలసి వచ్చింది. అనంతరం జరిగిన సార్వత్రిక ఎన్నికలలో శ్రీమతి గాంధీ ఓడిపోయి జనతా ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. ఈ సందర్భంలో రాజీవ్ తమ్ముడైన సంజయ్ గాంధీ రాజకీయ రంగంలో తల్లి శ్రీమతి గాంధీకి చేదోడు వాదోడుగా వుండేవాడు. యువజన కాంగ్రెస్‌లో సంజయ్ చురుకైన పాత్రనిర్వహించేవాడు. సంజయ్‌గాంధీ పంజాబ్‌లో యువతి మేనకను వివాహం చేసుకొన్నాడు. అతి పిన్నవయస్సులో రాజకీయాల్లోకి ప్రవేశించిన సంజయ్ గాంధీ గొప్ప సంచలనాన్ని సృష్టించాడు.

1980 జనవరిలో జరిగిన మధ్యంతర ఎన్నికలలో జనతా ప్రభుత్వం ఓడిపోయి, శ్రీమతి గాంధీ ఆధ్వర్యంలో కాంగ్రెసు ఐ పార్టీ అఖండ విజయాన్ని సాధించింది. 1980 జనవరి 23న నిత్యకార్యక్రమంలో ఒక భాగంగా విమానం నడుపుతూ ఆకాశంలో విహరిస్తూ వుండగనే, యంత్రలోపం వల్ల విమాన ప్రమాదం వలన సంజయ్ గాంధీ దుర్మరణం చెందారు.

సంజయ్ గాంధీ మరణం శ్రీమతి గాంధీని క్రుంగదీసింది. అట్టి దశలో రాజీవ్ రత్న తల్లికి అండగా రాజకీయరంగంలో ప్రవేశించాడు. కానీ స్వతహాగా రాజకీయాలంటే రాజీవ్ గాంధీ అయిష్టత చూపుతూ వుండేవాడు. సోనియా గాంధీ కూడా రాజీవ్ రాజకీయాల్లోకి రావడం యిష్ట పడేదికాదు.

అనివార్యమైన పరిస్థితుల్లో 1980లో జరిగిన సార్వత్రిక ఎన్నికలలో అమేధీ నియోజక వర్గంనుండి రాజీవ్ పార్లమెంటుకు ఎన్నుకోబడినాడు. 1981 జూన్ 25న యువజన కాంగ్రెసు జాతీయ కార్యవర్గ సభ్యునిగా రాజీవ్ ఎన్నుకోబడినాడు. 1983 ఫిబ్రవరి 2వ తేదీన కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా నియమితులైనాడు. పార్టీ ప్రతినిధిగా ఆయన అనేక దేశాలు పర్యటించాడు. ఆ విధంగా ప్రధాని అయ్యేంతవరకు రాజీవ్ గాంధీ కొంతకాలం వివిధ పదవుల్లో రాజకీయానుభవాన్ని గడించాడు.

శ్రీమతి ఇందిరాగాంధీ హత్యచేయబడిన తదుపరి, శ్రీ రాజీవ్ ఎవ్వరిపైనా కక్షసాధింపు చర్యల్ని చేపట్టలేదు. కక్ష, కార్పణ్యాలు ఎక్కువగా ప్రతిబింబించే రాజకీయ రంగంలో వాటికి అతీతంగా వ్యవహరించి రాజీవ్‌గాంధీ దేశ ప్రజల ప్రశంసల్ని పొందాడు. మాతృమూర్తి హత్యకు కారణమైన పంజాబ్ సమస్యను రాజీవ్ గాంధీ ప్రతీకారేచ్ఛకు అతీతంగా, దేశ సమైక్యతను దృష్టిలో పెట్టుకొని విశాల భావంతో పరిష్కరించాడు. 1985 సెప్టెంబరు 28న పంజాబ్ ఎన్నికలు జరిపించి, ప్రజాస్వామ్య బద్ధమైన పరిపాలనను పంజాబు ప్రజలకు అందించాడు.

దీర్ఘకాలంగా అపరిష్కృతంగా ఉన్న అస్సాం సమస్యను కూడా ఆరాష్ట్ర నాయకులతో సంప్రతించి, 1985 డిసెంబరు 16న అస్సాం రాష్ట్రంలో ఎన్నికలు జరిపి, రాష్ట్ర నాయకులకు పరిపాలనను అప్పగించాడు.

రాజీవ్‌ను మిస్టర్ క్లీన్ అని అంటూ వుంటారు. 'రాజకీయ కల్మషాన్ని కడిగివేయగల సమర్థుడు' గా రాజీవ్ పేరు తెచ్చుకున్నాడు. 'భారత్ మేరే మహాన్' అంటూ భారత్ దేశాన్ని 21వ శతాబ్దంలోకి తీసుకెళ్లాలని యిప్పుడే దేశాన్ని తీర్చిదిద్దాలని కలలుగన్నాడు.

రాజీవ్‌కు పొగడ్తలంటే యిష్టం వుండేది కాదు. నిరాడంబరంగా, వినయంగా ఎప్పుడూ నవ్వు ముఖంతో రాజీవ్ సాటి రాజకీయ నాయకులతోనూ, ప్రజలతోనే మెలిగేవాడు. రాజీవ్ మితభాషి.

రాజీవ్ గాంధీ వాస్తవిక దృక్పథంగల వాడు. ఏమాత్రం తొట్రుపాటుగానీ, తొందరపాటు గానీ లేకుండా, సంయమనంతో, నిబ్బరంతో నిర్ణయాలు తీసుకుంటాడు. సౌశీల్యం, సంస్కారం, అబ్బిన యువకుడు.

ప్రధానిగా శ్రీరాజీవ్ దేశ, విదేశీ సమస్యలను సున్నితంగా పరిష్కరించేవాడు, వర్థమాన దేశాల అభివృద్ధికి కృషిచేసాడు. సార్క్ సమావేశాల్లో చురుకుగా పాల్గొని, ఇరుగు పొరుగు దేశాలతో సహకారాన్ని పెంపొందించాడు.

మాల్దీవులపై టెర్రరిస్టులు దాడిచేసినప్పుడు, తగినంత సైన్యాన్ని పంపి టెర్రరిస్టుల బారినుండి మాల్దీవులను రక్షించి, ఆదేశ ప్రధాని కృతజ్ఞతలను సంపాయించాడు. ఇరుగు పొరుగు దేశాల మధ్య వుండవలసిన సహాయ సహకారాల ప్రాతిపదికగా మాల్దీవులకు సహాయం చేసినట్లు రాజీవ్ ప్రకటించాడు.

దేశ సమస్యలను రాజీవ్ సునిశితంగా పరిశీలించి, మౌలికమైన నిర్ణయాలు తీసుకొనేవాడు. రోజ్‌గార్‌పథకాన్ని ప్రవేశ పెట్టిపంచాయతీలకు నేరుగా కేంద్రప్రభుత్వం ద్వారా నిధులను అందజేసి గ్రామ సీమల అభివృద్ధికి పాటు పడినాడు. రోజ్‌గార్ పథకం పంచాయితీ వ్యవస్థలో ఒక కొత్త మలుపు. అలాగే స్థానిక సంస్థల పునర్నిర్మాణానికి దోహదం చేసే ప్రణాళికను రూపొందించి పార్లమెంటులో చట్టబద్ధత కల్పించి పెట్టి పంచాయతీల, పురపాలకసంస్థలకు కొత్త రూపును సంతరించి పెట్టాడు.

షాబోనో కేసులో సుప్రీంకోర్టు తీర్పును ముస్లిం పర్సనల్ లా బోర్డు కమిటీ తీవ్రంగా వ్యతిరేకించి. ముస్లిం మతవ్యవహారాల్లో కోర్టు జోక్యం ముస్లిం మతవిశ్వాసాలకు విరుద్ధంగా వున్నారంటూ పెద్ద అలజడి చెలరేగింది. ఆ సందర్భంలో సెక్యులర్ వ్యవస్థలో ఒకమతం వారిమత విశ్వాసాలను మన్నించడం అవసరమనే భావనతో ఆర్డినెన్స్ రూపంలో రాజీవ్ గాంధీ షాబానో కేసుకు సంబంధించిన సమస్యను సంస్కరణ రూపంలో పరిష్కరించాడు. అయితే రాజీవ్ చర్య చాలా మంది దృష్టిలో విమర్శకు గురిఅయింది.

ఇలాంటిదే రాజస్థాన్‌లో జరిగిన సతీసహగమనం సంఘటనలో రాజీవ్ ప్రకటనలు అభ్యుదయ వాదులకు, మహిళా సంఘాలకు కోపకారణమైనాయి.

రాజీవ్ హయాంలో కాంగ్రెసు వంద సంవత్సరాల పండగ దినోత్సవం జరుపబడింది. 1985 డిసెంబరు 28 నాటికి 100 సంవత్సరాలు నిండాయి. వంద సంవత్సరాలు నిండిన కాంగ్రెసు సంస్థకు, సరిగ్గా ఆ సమయంలో రాజీవ్ గాంధీ అధ్యక్షుడిగా వుండడం జరిగింది. పైగా రాజీవ్ ప్రధానమంత్రికూడా. అపూర్వమైన యీ సంఘటన చరిత్రాత్మకమైంది కూడా. వందసంవత్సరాలు నిండిన కాంగ్రెసు సంస్థ శతసంవత్సర దినోత్సవాన్ని రాజీవ్ గాంధీ వేడుకలతో, వైభవం వుట్టి పడేట్టు జరిపించాడు. బొంబాయిలో ఆనాడు కేవలం 72మంది ప్రతినిధులతో ఏర్పడిన సంస్థ, వందసంవత్సరాల దేశ చరిత్రను తన గర్భంలో యిముడ్చు కొన్నది. సంస్థ

ఆవిర్భవించిన బొంబాయి తేజ్‌పాల్ సంస్కృత పాఠశాలలోనే రాజీవ్ అఖిలభారత కాంగ్రెసు సంస్థ శత సంవత్సర పండుగను జరిపించి కాంగ్రెసు సంస్థకు వైభవ కిరీటాన్ని అమర్చాడు.

పండిట్ నెహ్రూ హయంలో కాంగ్రెసు సంస్థ ఏకత్రాటిమీద నడిచేది. అప్పటి దేశ సమస్యలు వేరు. బ్రిటిషు వారు వైదొలగిన కొత్త దినాల్లో, దేశ ఆర్థిక పరిస్థితి, విదేశాంగ విధానం, తదితర సమస్యలు చక్కదిద్దుకొనే ప్రయత్నంలో పండిట్ నెహ్రూ చతురతతో, వ్యవహరించి చక్కదిద్దాడు. ఈనాడున్న సమస్యలు, టెర్రరిజం, వేర్పాటు వాద ధోరణులు, అరాజకవాదం, రాజకీయ సంక్షోభాలు అప్పట్లో వుండేవి కావు. అందుచేత ప్రధాని నెహ్రూ నాయకత్వం నల్లేరు మీద బండి నడకలా సాగింది.

శ్రీమతి ఇందిరా గాంధీ అధికారంలోకి వచ్చిన రోజుల్లో పార్టీ చీలింది. కాంగ్రెసు సంస్థలో అనైక్యత తారాస్థాయికి చేరింది. గ్రూపులు, ముఠాలతో పాత కాంగ్రెసు పేర్లతో చీలిపోయిన కాంగ్రెసు మరెన్నో పేర్లతో గ్రూపులుగా చీలిపోయింది. అయినప్పటికీ ఇందిరాగాంధీ ప్రజాహిత కార్యక్రమాల అమలు కారణంగా, సామాన్య పేదవర్గాల అభ్యున్నతికి పట్టిన సంక్షేమ పథకాల వల్ల అభివృద్ధి నిరోధక ముఠాపై ధ్వజమెత్తి, సాహసోపేతంగా వ్యవమరించిన కారణంగా తనపేరుతో పెలకొల్పిన ఇందిరా కాంగ్రెస్సే, అసలైన కాంగ్రెసుగా ప్రజలు గుర్తించారు. ఇందిరా గాంధీని గెలిపించారు. అయినప్పటికీ పార్టీ చీలికలతోపాటు, దేశంలో ప్రతి పక్షాలు కాంగ్రెసు నుంచి చీలిపోయిన వర్గాలు, దేశంలో అంతర్గత సంక్షోభాన్ని సృష్టించి, దేశాన్ని అరాజకం పాలు చేయడం జరిగింది. కాశ్మీరు సమస్యతో పాటు, అస్సాం, పంజాబ్ సమస్యలు వికృత రూపంతో బయటపడ్డాయి. దేశంలో టెర్రరిజం పెరిగింది. యీ కారణంగా దేశాన్ని సుస్థిరత, సమగ్రతల మార్గంగా తీర్చి దిద్దే కృషిలో శ్రీమతి గాంధీ బలి అయింది.

రాజీవ్ గాంధీ ప్రధానిగా వచ్చిన రోజు, ఇందిరా గాంధీని హత్యచేసిన రోజు కావడం, ప్రమాదకరమైన రాజకీయ అంచుల మీద రాజీవ గాంధీ ప్రయాణం మొదలైంది. ఇందిరా గాంధీ ఎదుర్కొన్న రాజకీయ సంక్షోభం అంతంకాలేదు. సరిగదా ఆరంభం మాత్రమే అయిన సందర్భంలోనే రాజీవ్ గాంధీ ప్రధానిగా ప్రమాణస్వీకారం చేసాడు. తాత్కాలికంగా రాజకీయ సంక్షోభ పరిస్థితులు ఉపశమనం పొందినట్లు పైకి కనిపించినా, అంతర్గతంగా సంక్షోభం అరాజకత్వం రగులుకొనే రాక్షసి బొగ్గులా రాజుకుంటూనే వుంది.

దురదృష్టవశాత్తూ భారత రాజకీయ రంగంలో నైతిక విలువలు, ప్రజాసామ్య విలువలు లోపించి, పదవీ వ్యామోహం, స్వార్థం, ధనకాంక్ష, అవినీతి, జడలు విప్పుకొని వున్నాయి. ఓట్లకోసం, గెలుపు కోసం రాజకీయ పార్టీలు అన్ని రకాల విలువల్ని వదులుకొన్నాయి. దేశభవిష్యత్తు, జాతి మనుగడ వంటి ప్రధానమైన అంశాలను కూడా రాజకీయ ప్రలోభానికి రాజకీయ నాయకులు ఉపయోగించు కుంటున్న తరుణంలో, రాజకీయ నాయకులనే పావులుగా చేసుకొని దేశద్రోహులు, మాఫియా ముఠాలు, నేరస్థులు, కిరాయి హంతకులు తమ కార్యక్రమాలను విచ్చల విడిగా జరుపుకుంటు వస్తున్నారు.

ఇలాంటి రాజకీయ వాతావరణంలో శ్రీరాజీవ్ గాంధీ మహాభారత కాలంనాడు పద్మవ్యూహ్యంలోకి అభిమన్యుడు ప్రవేశించినట్టు, అడుగు పెట్టాడు. రాజకీయ భద్మ వేషకులు, రాజకీయాన్ని వ్యాపార ప్రక్రియగా మార్చుకున్న కుహనా రాజకీయ వాదులు, మేకవన్నె పులులు బాహాటంగా సంచరించే రాజకీయ ప్రాంగణం రాజీవ్‌కు మయసభలా భ్రమ పెట్టింది.

శ్రీలంక వ్యవహారం సరిగ్గా మయ సభలాంటిదే. ఇందిరా గాంధీ హయంలోనే మద్రాసు నగరం తమిళ ఈలం పులిపిల్లలకు విహారభూమిగా వుండేది. ఎం.జి,ఆర్., కరుణానిది సైతం తమిళ వ్యామోహంలో, జాత్యాభిమానంతో టైగర్స్‌ను పెంచి పోషించారు. శ్రీలంకలో యల్.టి.టి. కార్యకలపాలు శృతిమించాయి. అక్కడి ప్రభుత్వ సైనికులకూ, టైగర్సుకూ నిత్యం ఘర్షణలు, కాల్పులు పరిపాటయ్యాయి. యల్.టి.టి.ఇని అణిచే చర్యలో భాగంగా జాఫ్నాలో తమిళ ప్రజలపై దమన కాండను శ్రీలంక ప్రభుత్వం జరుపుతున్నట్టు ప్రచారం జరుగుతోంది. అలాంటి వార్తలు ఢిల్లీ దాకా వ్యాపించాయి. ఢిల్లీ జోక్యం చేసుకొని తమిళ ప్రజల్ని కాపాడాలని మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం డిమాండ్ చేసింది. ఇక శ్రీలంక ప్రభుత్వం కూడా యల్.టి.టి.ని. అదుపులో పెట్టవలసిందిగా భారత ప్రభుత్వాన్ని అర్థిస్తూ, తమకు సహాయంగా సైన్యాన్ని పంపవలసిందిగా కోరింది.

దీనిపై రాజీవ్ ప్రభుత్వం జాగ్రత్తగా అన్ని కోణాల నుంచి శ్రీలంక సమస్యను పరిశీలించి, భారత సైన్యం, శాంతి సైన్యంగా మాత్రమే శ్రీలంకలో ప్రవేశించి, సామరస్యంగా తమిళ సమస్యను పరిష్కరించేందుకు కృషి చేసే షరతుతో, ఆరు వేల భారత సైన్యాన్ని రాజీవ్ గాంధీ శ్రీలంక ప్రభుత్వం కోరికపై పంపడం జరిగింది. అక్కడ భారత శాంతి సైన్యం శ్రీలంకలో టైగర్సుకూ, శ్రీలంక ప్రభుత్వానికి మధ్యవర్తిగా వుంటూ సామాన్య తమిళ ప్రజలకు అండగా సమస్యా పరిష్కారానికి కృషి చేస్తూ వస్తున్నది.

1984 నవంబరు 24, 27 తేదీలలో సార్వత్రిక ఎన్నికలు జరిగి 1989 నవంబరు వచ్చేనాటికి జరిగిన అయిదేళ్ళ కాలపరిమితి రాజీవ్ గాంధీ రాజకీయ కాలం యిట్టే గడిచి పోయింది. తన అయిదేళ్ల పరిపాలనా కాలంలో పంజాబు, అస్సాం సమస్యలను పరిష్కరించడం, సార్క్ దేశాల సమావేశాలు, మాల్దీవులకు సహకారం, శ్రీలంకకు శాంతి సైన్యాన్ని పంపడం వంటి వ్యవహారాలను రాజీవ్ గాంధీ నిర్వహించుకుంటువచ్చాడు. దేశపరిపాలనా వ్యవహారాల్లో రోజ్‌గార్ ప్రయోజనాపథం స్థానిక సంస్థల బిల్లు వంటి అభ్యుదయ కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. కాంగ్రెసు పార్టీ పరిస్థితి యిందిరాగాంధీ కాలంనాటి అంతర్గత సంక్షోభాన్ని రాజీవ్ గాంధీ హయాంలో కూడా భిన్నంగా లేకపోయింది. దేశ ప్రధానిగా, అఖిల భారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షునిగా కూడా రాజీవ్ గాంధీయే వ్యవహరిస్తూ వస్తున్నారు.

బోఫోర్స్ గొడవను శ్రీ వి.పి. సింగు లేవదీసాడు. స్విట్జర్లండునుంచి బోఫోర్స్ శతఘ్నులను కొనుగోలు చేయడంలో కోట్లాది రూపాయలను కుంభకోణం జరిగిందనీ, రాజీవ్ గాంధీ అండదండలతోనే బోఫోర్స్ కుంభకోణం కోట్లాది రూపాయలు ముడుపులు చేతులు మారాయనీ శ్రీ వి.పి. సింగు ఆరోపణ చేస్తూ, తన మంత్రి పదవికి కూడా రాజీనామా యిచ్చి, మరి కొందరి అనుచరులతో కాంగ్రెసు పార్టీకి కూడా రాజీనామా యిచ్చి పెద్ద ఎత్తున అలజడి లేవదీసాడు. ఈ ఆరోపణలతో ప్రజల్లో అపోహలు కల్పించి, రాజీవ్ ప్రభుత్వాన్ని అవినీతి ప్రభుత్వంగా చిత్రించి ప్రచారంగావించాడు. శ్రీ వి.పి. సింగుకు తోడు ప్రతిపక్షాలు చేతులు కలిపాయి.

ఈ దశలో 1989 నవంబర్ 22, 24, 26 తేదీలలో సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. యీ ఎన్నికలలో లోక్‌సభలో కాంగ్రెసుకు 193 సీట్లు మాత్రమే వచ్చి, అధికారంలోకి రావడానికి అవకాశం లేకుండా పోయింది. శ్రీ రాజీవ్ గాంధీ నాయకత్వంలోని కాంగ్రెసు పార్టీ ఎన్నికలలో ఏకైక పార్టీగా గెలిచినప్పటికీ, ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి తగినంత మెజారిటీ రానికారణంగా, ప్రతిపక్ష పార్టీగా వుండిపోయింది. ఎవరినైనా కలుపుకొని ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసిందిగా ప్రెసిడెంటు ఆహ్వానించినప్పటికీ రాజీవ్ అంగీకరించలేదు.

ప్రతిపక్షాలు, వామపక్షాలు, కాంగ్రెసులోని చీలికదారులంతా కలిసి మిశ్రమ ప్రభుత్వం ఏర్పడి శ్రీ వి.పి. సింగు ప్రధాని కాగలిగాడు. పూర్వ జనతా పార్టీ, పూర్వ సోషలిస్టు వర్గం, కాంగ్రెసు తిరుగుబాటు దార్లతో జనతాదళ్ అనే నూతన పార్టీ ఏర్పడి, దాని ఆధ్వర్యంలో శ్రీ వి.పి. సింగు ప్రభుత్వాన్ని ఏర్పరిచారు. కాంగ్రెసు పార్టీ ప్రతిపక్ష పార్టీగా, శ్రీ రాజీవ్ గాంధీ ప్రతిపక్ష నాయకునిగా లోక్‌సభలో వ్యవహరించడం

జరిగింది. ఈ సందర్భంలో లోక్‌సభతొలి సమావేశంలో ప్రసంగిస్తూ బాధ్యతగల ప్రతిపక్షంగా కాంగ్రెసు పనిచేస్తుందనీ, జాతీ సమైక్యత, దేశ సమగ్రతల పరిరక్షణలో నూతన ప్రభుత్వానికి తగుమద్దతు వుంటుందనీ, ప్రజావ్యతిరేక కార్యక్రమాలను తమ పార్టీ వ్యతిరేకిస్తుందనీ ప్రతిపక్షనాయకునిగా శ్రీ రాజీవ్ ప్రకటించారు.

ప్రతి పక్షనాయకునిగా శ్రీ రాజీవ్ గాంధీ కేబినేట్ మంత్రి హెూదా, నెలకు 11,000 రూ॥ వేతనం లభించాయి. అంతేగాక పార్లమెంటరీ హాలులో రాజీవ్‌కు ప్రత్యేక కార్యాలయం, సెక్రటరీని ఏర్పరచడం జరిగింది.

భారత దేశానికి స్వతంత్ర్యం లభించిన నాటినుండీ నేటి వరకు రెండుసార్లు మాత్రమే కేంద్రంలో ప్రతి పక్షాలు అధికారంలోకి వచ్చాయి.

1977లో జనతా పార్టీ, 1989 నవంబరులో జనతాదళ్ ప్రభుత్వాలు కేంద్రంలో ప్రభుత్వాన్ని ఏర్పరిచాయి. అయితే ఈ రెండు ప్రభుత్వాలు కూడా పూర్తికాలం ప్రభుత్వాన్ని నిర్వహించలేకపోయాయి. మరొక ముఖ్యవిషయం ఏమంటే ఈ రెండు దఫాలులో కూడా కాంగ్రెసు తిరుబాటు దారులే ప్రధానులు కావడం జరిగింది. జనతా పార్టీ నాయకులైన మొరార్జీదేశాయ్ గానీ, చరణ్‌సిగుగానీ, 1989నాటి శ్రీ వి.పి. సింగు, చంద్రశేఖర్‌లు కూడా కాంగ్రెసు వాదులే. కాంగ్రెసు పార్టీ నుండి చీలిపోయి, బి.జె.పి. కమ్యూనిస్టులు, కాంగ్రేతర పక్షాల సహకారంతో వీరు ప్రభుత్వాలను ఏర్పరచారు.

1977లో అధికారంలోకి వచ్చిన పార్టీ రెండు సంవత్సరాలలోనే కుప్పకూలిపోయింది. అందులోనే చీలికదారులైన చరణ్‌సింగుమరొక ఆరునెలలు పరిపాలన మాత్రమే నిర్వహించి, రాజీనామా యిచ్చి తప్పుకున్నాడు. తిరిగి కాంగ్రెస్ పార్టీయే అధికారంలోకి వచ్చింది.

1989 నవంబర్‌లో బోఫోర్స్ కుంభకోణం కథతో కాంగ్రెసు నుంచి చీలి జనతాదళ్‌ను స్థాపించి అధికారంలోకి వచ్చిన శ్రీ వి.పి. సింగ్ పరిపాలన కూడా ఏడాది కాలానికే కూలిపోయింది. అందులో నుంచి చీలి బయటకు వచ్చి మరొక పేరుతో పార్టీ స్థాపించిన సమాజావాది జనతా పార్టీ నాయకుడు చంద్రశేఖర్ పరిపాలన మూడు నెలలు ముచ్చటగా గడిచింది.

సుస్థిరతలేని చీలిక పార్టీలు, ఊతకర్రలతో పరిపాలనా వ్యవహారం మూన్నాళ్ల ముచ్చటగానే నడుస్తూ, తిరిగి జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు పార్టీయే అధికారంలోకి రావడం చరిత్ర చర్విత చరణంగా జరుగుతున్నది.

అనవాయితీగా నడుస్తున్న సంఘటనల పర్యవసానంగా వి.పి.సింగు రాజీనామా, తదనంతరం ప్రధానిగా వచ్చిన చంద్రశేఖర్‌లో రాజీనామాలతో తిరిగి 1990

నెలాఖరులో సార్వత్రిక ఎన్నికలు వచ్చాయి. ఈ సారి కాంగ్రెసు పార్టీ శ్రీరాజీవ్‌గాంధీ నేతృత్వంలో ఎన్నికలలో ఉత్సాహ సంరంభాలలో పాల్గొన్నది. సుస్థిరత, దేశసమైక్యత ప్రధానంగా గల ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెసు పార్టీ ఎన్నికలకు సమాయత్తమైంది. ప్రతిపక్షాలకు 1977లో ఒకసారి 1989లో రెండవసారి ఓట్లు వేసి గెలిపించిన్పటికీ, పూర్తి కాలం అధికారంలో కొనసాగకుండా అంతకలహాలతో అవి మధ్యలోనే కూలిపోతున్నాయనీ, కనుక సుస్థిర ప్రభుత్వం కొనసాగాలంటే కాంగ్రెసును మాత్రమే గెలిపించాలనీ దేశప్రజలు కృతనిశ్చయము వైపున్నట్టు ఎన్నికల వాతావరణం తెలియజేస్తున్నది. కనుక యీ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ గెలుపు ఖాయం అని తేలిపోయింది. రాజకీయ పార్టీలన్నీ ఎన్నికలబరిలో నిలిచివున్నాయి. తమతమ ఎన్నికల ప్రణాళికలతో, వాగ్దానాలతో బహిరంగసభలు పెట్టి ప్రజలకు వివరిస్తున్నాయి. ఈ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ సుస్థిర నినాదంతో ప్రజల ముందుకు వెళ్లింది. ప్రతిచోటా రాజీవ్ గాంధీ దేశమంతటా పర్యటిస్తూ, కాంగ్రెసు గెలుపుకు తీవ్రంగా కృషిచేస్తున్నాడు.

ఎన్నికల కార్యక్రమంలో ఒక భాగంగా రాజీవ్ గాంధీ తమిళనాడు పర్యటనకు వచ్చాడు.

ఆరోజు 1991 మే నెల 21.

మదరాసు సమీపంలోని శ్రీపెరంబుదూరులో బహిరంగసభలో రాజీవ్ ప్రసంగించవలసి వున్నది.

సభకు అన్ని ఏర్పాట్లు జరిగాయి.

ఆరోజు రాత్రి 10-25 గంటలకు రాజీవ్‌గాంధీ సభాస్థలం వచ్చారు. వేదిక వద్ద రాజకీయనాయకులు, కాంగ్రెసు కార్యకర్తలు రాజీవ్‌కు పూలమాలలు సమర్పించేందుకు సమాయత్తమయ్యారు.

ఇంతలో ఒక యువతి, చేతిలో పూలమాలతోవచ్చి, రాజీవ్ పాదాలకు నమస్కరించడానికి అన్నట్లు ముందుకు వంగిన మరుక్షనంలో పరిసరప్రాంతాలు దద్దరిల్లినట్లు పెద్ద శబ్దంతో బాంబు ప్రేలింది.

సభావేదిక అంతా భీభత్సంగా, రక్తసిక్తమైంది.

రక్తమడుగులో రాజీవ్‌గాంధీ హత్య చేయబడి వుండడం కనిపించింది. తమిళ టైగర్‌గా భావించబడుతున్న హంతకి నడుముకు బెల్టుబాంబు ధరించి, ముందే చేసుకున్న ఏర్పాటుతో బటన్ నొక్కి బాంబు ప్రేల్చి, రాజీవ్‌ను హత్య చేసింది.

శ్రీపెరంబుదూరు ఎన్నికల సభవద్ద 21-5-92 మంగళవారం రాత్రి శ్రీరాజీవ్ హత్య చేయబడినారనే వార్త ప్రపంచాన్ని దిగ్భ్రమలో ముంచెత్తింది. దేశం అంతా హాహాకారంతో నిండిపోయింది.

భారతదేశంలో ప్రజాస్వామ్యమే హత్య చేయబడింది.

దేశంకోసం, జాతి ముక్కలు కాకుండా, దేశం చెదిరి పోకుండా, జాతిని తన గుండెల్లో హత్తుకొని కాపాడేందుకు, ప్రత్యర్థుల, ప్రతికక్షలు పన్నిన పద్మవ్యూహంలోకి ధైర్యంగా, చిరునవ్వులతో అడుగుపెట్టిన అభిమన్యుడి వంటి రాజీవ్- ప్రతీప శక్తుల హత్యారాజకీయాలకు బలి అయ్యాడు.

జాఫ్నాలోని యల్.టి.టి.ఇ అధినేత ప్రభాకరన్ ఆదేశంపై ఇండియా వచ్చిన తమిళ టైగర్స్ శ్రీరాజీవ్‌ను హత్య చేయడం జరిగిందని దర్యాప్తులో వెల్లడైంది. ఈ ఎన్నికలలో కాంగ్రెసు గెలిస్తే మద్రాసు, శ్రీ లంకలలో యల్.టి.టి.ఇ కార్యకలాపాలకూ అంతరాయం కలుగుతుందనే వ్యూహతో, ముందుగానే రాజీవ్‌ను హత్యాచేసి, ఎన్నికల్లో కాంగ్రెసును అస్థిరం పాలు జేసేందుకు తమిళ టైగర్స్ యీ దారుణానికి ఒడిగట్టినట్లు తేలింది.

రాజీవ్ సతీమణి శ్రీమతి సోనియా గాంధీ అదేరోజు రాత్రికి మద్రాసు ఎమానాశ్రయానికి వచ్చి, ప్రత్యేక విమానంలో రాజీవ్ మృతదేహాన్ని ఢిల్లీ చేర్చింది.

1991 మే నెల 24వ తేదీ మంగళవారం ఉదయం శ్మశాన వాటికలో లక్షలాది ప్రజలు 'రాజీవ్ గాంధీ అమర్ రహే" అంటూ అశ్రుతప్తనయనాలతో తుది వీడ్కోలు చెబుతూ వుండగా, రాజీవ్ అంత్యక్రియలు పూర్తి అయ్యాయి.

కుమారుడు రాహుల్, కుమార్తె ప్రియాంక, సతీమణి సోనియా గాంధీ శూన్య దృక్కులతో చూస్తూ వుండిపోయారు. కాంగ్రెసు అగ్రనాయకులందరూ తమనాయకుడికి శ్రద్ధాంజలి ఘటించారు.

రాజీవ్ గాంధీ యికలేడు.

భారత రాజకీయాకాశంలో ధ్రువతారగా నిలిచిపోయాడు. భారత రాజకీయ చరిత్రలో రక్తాక్షరాలతో తడిసిన రాజీవ్ స్మృతి మాత్రమే యిక మిగిలింది.

భారతదేశచరిత్రలో ముగ్గురు గాంధీలు దేశం కోసం, జాతి ఐక్యతకోసం తమ ప్రాణాలు అర్పించారు. ఇది ప్రపంచ చరిత్రలోనే అద్వితీయ త్యాగ ఘట్టం.